ప్రతి 1-8 రూ. అ.

ప్రియదర్శికానాటిక, శ్రీహర్షకృతి, తెనుఁగు టీక, సంస్కృత టిప్పణము, గద్యపద్యములుగా ఆంధ్రీకరణము సయితము 1 0

శబ్దమంజరీ సమాసకుసుమావళీ తిజంతమంజరులు, తెనుఁగున వివరణము సయితము రు 0-8-0. పాతప్రతి 0 4

---

## ఆంధ్రగ్రంథములు.

| | | |
|---|---|---|
| ఆముక్తమాల్యద, సంజీవనీవ్యాఖ్య | 12 | 0 |
| శృంగారనైషధము, సర్వంకషావ్యాఖ్య | (అచ్చుగుచున్నది) | |
| విజయవిలాసము, టీకాసహితము పునర్ముద్రితము | 3 | 0 |
| సారంగధర చరిత్రము ,, అచ్చుగుచున్నది. | 2 | 8 |
| జ్ఞానవాసిష్ఠరామాయణము మడికి సింగనకవి | 1 | 8 |
| ఆంధ్రబిల్హణీయము, నిర్దోషము, మూలముమాత్రము | 0 | 8 |
| పారిజాతాపహరణము | 0 | 8 |
| సారంగధర చరిత్ర, ద్విపద, కవి విశ్వకర్మ మతస్థుడు | 0 | 8 |
| హరిశ్చంద్ర ద్విపద, గౌరనమంత్రి ప్రణీతము | 1 | 0 |

## నాటకములు

| | | |
|---|---|---|
| ప్రతాపరుద్రీయనాటకము సటిప్పణము | 2 | 0 |
| బొబ్బిలియుద్ధనాటకము | 1 | 4 |
| ఉషానాటకము | 1 | 4 |
| శాకుంతలనాటకము, కాళిదాసీయమునకు తెనుగు | 1 | 0 |
| విక్రమోర్వశీయము ,, INTER TEXT | 2 | 0 |
| మాళవికాగ్నిమిత్రనాటకము ,, | 0 | 12 |
| నాగానంద నాటకము శ్రీహర్షకృతికి తెనుఁగు | 1 | 0 |
| రత్నావళీనాటిక ,, | 1 | 4 |
| ప్రియదర్శికానాటిక ,, | 0 | 8 |
| ఉత్తరరామచరిత్ర నాటకము, విపులమగు పీఠికతో | 1 | 8 |
| శ్రీకృష్ణరాయవిజయనాటకము. | 0 | 8 |

ప్రతి 1-కి రూ. అ.

## వచన గ్రంథములు.

| | | |
|---|---|---|
| హితోపదేశకథలు, నీతిబోధకములు వెలువడ నున్నవి | | |
| భోజకాళిదాస కథలు, రసభరితములు వెలువడనున్నవి. | | |
| బేతాళపంచవింశతిక, ప్రజ్ఞకలిగించునవి | 0 | 12 |
| విక్రమార్కుని యద్భుతకథలు, గుణము కలిగించునవి | 0 | 12 |
| కథాసరిత్సాగరము, అద్భుత నీతి వ్యవహార కథలు 6 భాగ॥ | 12 | 0 |
| దశకుమారచరిత్రము, అత్యద్భుత ప్రజ్ఞా ప్రయోగముల కథలు | 1 | 0 |

## లక్షణ గ్రంథములు.

| | | |
|---|---|---|
| ఆంధ్రసాహిత్యదర్పణము, విశ్వనాథకవిరాజకృత సంస్కృత గ్రంథమునకు సరియైన యాంధ్రానువాదము, మూలము నందలి ఉదాహరణశ్లోకములతో చేర్చి ముద్రించితిమి. ఇందు నాటకలక్షణము సంపూర్ణముగా కలదు. | 5 | 0. |
| కావ్యాలంకారచూడామణి, వెనుకటివలెగాక ఇందు తొమ్మిది ఉల్లాసములును పూర్తిగా ముద్రించినారము. | 1 | 4 |
| అలంకారసారసంగ్రహము, చంద్రాలోకాద్యనేక గ్రంథముల సారాంశము. ఉన్నత పాఠశాలావిద్యార్థుల కుపయోగకరము టీకావివరణములు గలవు. | 0 | 12 |
| ఛందస్సు, విద్యార్థుల కుపయోగకరము, సంగ్రహము | 0 | 4 |
| కుమారదేవపండితీయము, ప్రౌఢవ్యాకరణమునకు శ్రీ తాళ్ళూరి అక్కమగుపిళ్లగారు రచించిన వ్యాఖ్య | 2 | 8 |
| శ్రీ టి. ఎమ్. శేషగిరిశాస్త్రులవారి ఆంధ్రశబ్దతత్త్వము 2 భాగ॥ | 3 | 0 |
| ,, అర్ధానుస్వార తత్త్వము | 0 | 12 |
| పద్యకథాలహరి Comprehension Test | 0 | 12 |

శారదాకాంచికలు—విమర్శలు—ఉపన్యాసములు

| | |
|---|---|
| జక్కన విక్రమార్కచరిత్ర ముద్రణవిమర్శనము 1 కింకిణి | (అచ్చు) |
| ఆంధ్రప్రసన్న రాఘవ నాటక విమర్శనము 2 కింకిణి | ,, |

శ్రీ

బాలబోధసుధాపరనామ

# కుమారదేవపండితీయము

అను

## ప్రౌఢవ్యాకరణ వివరణము.

విద్వాన్ తాళ్ళూరు ఆర్యగంపిళ్ళగారిచే విరచితము.






వేదము వేంకటరాయశాస్త్రి అండ్ బ్రదర్స్

4 మల్లికేశ్వరగుడిసందు, లింగిసెట్టివీథి,

జార్జిటౌను, మదరాసు.

[వెల 2-8-0

# విజ్ఞప్తి.

'వర్తమానశతాబ్దినన్నయాచార్యులవారు' (మా. ఆముక్త. సంజీవని) రచియించిన యీ ప్రౌఢవ్యాకరణమునకు నేటికి ఈవ్యాఖ్య వెలువడగలుగుట చాలశుభము. శ్రీ ఆచార్యులవారు గతించియే నేటికి ఏబదియాఱుసంవత్సరములు (1891-1947). ఈ వ్యాఖ్యాకర్తలైన శ్రీ తాళ్లూరు ఆర్ముగముపిళ్లెగారు చిత్తూరుమండలవాసులు. పిళ్లె శబ్దముచే వీరు ద్రవిడులని పలువురు భ్రమించుచున్నారు. వీరిపూర్వులు తొలుత దాక్షిణాత్యులేయైనను ఏనాడో ద్రవిడమండలమును వీడి ఆంధ్రదేశముంజొచ్చి శ్రీకరణాధికారమునే నిర్వర్తించుచు ప్రభువుల యాస్థానములయందుండి క్రమముగా నేటి చిత్తూరుమండలమందలి నారగంటిపాళెము జమీనునకుచేరిన వేల్కూరు ప్రవేశించి ఆపాళెగార్లతో సమానప్రతిపత్తి నందియుండిరి. దాదాపు మూడుశతాబ్దములనుండియు వీరికుటుంబమువారీదేశమున నున్నట్లు తెలియుచున్నది. వీరి పితామహులైన శ్రీ గోపాలపిళ్లెగారు సంస్కృతాంధ్రములయందు చక్కని ప్రవేశముగలవారై, యోగాభ్యాసనిరతులై, ఎనుబదియేండ్లు జీవించి బ్రహ్మరంధ్రమున ప్రాణత్యాగ మొనరించిరట. వీరు తరిగొండ వేంగమాంబగారి సమకాలికులుగానుండి ఆయమ రచించిన గ్రంథములకు పెక్కింటికి స్వయముగా ప్రతులు రచియించి యుంచుకొనియున్నారు.

ఇట్లే వీరికి మాతామహుల వరుసవారైన కొండకుప్పము అరుముగస్వాములవారును పెదతండ్రిగారైన శ్రీ కాశిపిళ్లెగారును సంస్కృతాంధ్రములయందు ప్రవేశము గలవారేగాక సంగీతాదికములలో ప్రసిద్ధులైయుండిరి. ఇందు శ్రీ కాశిపిళ్లెగారు శ్రీ త్యాగరాయస్వాములవారిశిష్యులతో సాంగత్యము నందియుండి సభార్యులై సన్న్యసించి దేశసంచారము గావించి తరించిరి.

ఇట్టి సద్వంశమున జనించిన శ్రీ ఆర్ముగము పిళ్లెగారు పెద్దల యాంధ్రాభిమానమును వీడక దాదాపు ఇరువదిసంవత్సరములుగా నాంధ్రాధ్యాపకులై తత్ఫలితముగా నీవ్యాఖ్యను రచించి మాకొసంగినందులకు వారికి మా ధన్యవాదములు.

మే. 1947 ప్రకాశకులు:

శ్రీః

బాలబోధసుధాపరనామ

# కుమారదేవపండితీయము

అను

ప్రౌఢవ్యాకరణ వివరణము

## వ్యాఖ్యాతృప్రోద్ఘాతము.

ఈ 'త్రిలిఙ్గలక్షణశేషము'నకు ప్రౌఢవ్యాకరణమని సర్వజన వ్యవహారసిద్ధంబగు నామాంతరముగలదు. కాని ఈ నామము కృతికర్త కల్పితము కానట్లు తోఁచుచున్నది. దీనిని రచించినవారు శ్రీమాన్ బహుజనపల్లి సీతారామాచార్యులవారు. వీరు గడచిన శతాబ్దియం దుండినవారే కావున వీరిం గూర్చి యిప్పటి విద్వల్లోకమునకుం దెలియనివియు, ఇప్పుడు క్రొత్తగాఁ దవ్వి చెప్పవలసినవియు నగు విషయము లెక్కువ లేవు. ఏతద్ వ్యాకరణప్రసక్తిని తాము రచించిన గ్రంథాంతరములను స్వీయపీఠికలో ఆచార్యులవారే సెలవిచ్చియున్నారు. కాఁబట్టి అందుం గూర్చిన పెంపకమును ఇట అక్కఱలేదు.

శ్రీ పరవస్తు చిన్నయసూరిగారి బాలవ్యాకరణమునకు లొంగని కవి ప్రయోగములను సాధించుటకునై ఈప్రౌఢవ్యాకరణము ఉత్పన్నమైనది. చింతామణిలోని విషయములను సామాన్యముగా బాలవ్యాకరణము సంగ్రహించినది; మిగిలిన కొన్నింటి నిది పూరించినది. బాల

వ్యాకరణమున సర్వనామముల రూపసాధన ప్రక్రియలేదు; చింతామణిలో సంక్షిప్తముగ నున్నది. చింతామణియందు కొఱవడిన దానిని మాత్రమే 'త్రిలింగలక్షణశేషము' సాధించినది. కావున నియ్యది కొన్ని యెడల బాలవ్యాకరణమునకును, గొన్నియెడలఁ జింతామణికిని శేషమని చెప్పఁదగియున్నది. అయినను బాలవ్యాకరణమునుదానికి ప్రతిభటముగ ప్రౌఢవ్యాకరణమన్న వ్యవహార మీపొత్తమునకు మెండగుటచేఁ జాలవఱకు నిది బాలవ్యాకరణ శేషమనియే చెప్ప నొప్పును. 'శేష' సంజ్ఞితమైనంత మాత్రంబుననే ఇందుఁ జెప్పఁబడిన విషయములెల్ల నపూర్వములని భ్రమింపరాదు. వానంబెక్కులు ప్రాచీన వ్యాకరణములలో నొకదానఁగాకున్న నింకొకదాననైన నున్నట్టివే యనుట పునరుక్తము. 'బాలము' నీ 'ప్రౌఢము' పూరించువిధము ప్రాయికముగ నెట్లుండుననఁగా, అందు అనింద్యగ్రామ్యములుగఁ జెప్పఁబడినవి ఇందు అగ్రామ్యములుగ కొనఁబడుచుండును. అందు నింద్యగ్రామ్యములుగఁ జూపఁబడినవి ఇందు అనింద్య గ్రామ్యములుగా నేర్పడుచుండును. ఇట్లగుటకెల్ల అర్వాచీన కవుల ప్రయోగములును శిష్టజన వ్యవహారములును ప్రమాణీకరింపఁ బడుచుండును. సూత్రించిన విషయములకెల్లఁ బ్రయోగములఁ జూపు నిందలి పద్ధతిమాత్రము కరము శ్లాఘ్యమనక తప్పదు.

తా. ఆఱుగం పిళ్ళె.

# వ్యాకర్త్రుపోద్ఘాతము.

పండితోత్తముండును సజ్జనాగ్రేసరుండు నగు మజ్జనకుండు నాయెడ స్వామి భావంబును దాసభావంబును నెఱపి మిత్రభావంబు నెఱపం బ్రారంభించుతఱి నాకు యథోచితంబుగఁ గవితాధార యొకింతగలుగ, తోడనే నాకు బాలవయోవస్థాకాల వాసస్థానంబైయున్న నాగపట్టణం బను దివ్యదేశంబున దివ్యమంగళవిగ్రహంబుతో సన్వర్థాభిధానుండై వేంచేసియుండెడు శ్రీ సౌందర్యరాజస్వామినిఁ బద్యరూపంబునం బ్రస్తుతింప మతివొడమి, ఏను దన్నామాంకితంబుగ నాంతము శబ్దాలంకారసహితంబై యుండ నొక్క శతకంబు గావించితి. తదనంతరము విద్యావిచార తత్పరుండనై కొన్ని హాయనంబులు గడపి యంత నాంధ్రశబ్దరత్నాకరం బను నకారాది నిఘంటు వొకటి వ్రాయ నుద్దేశముతో గ్రంథశోధనము సేయ దొరంకొని తద్విఘ్న నిరస నార్థంబు తదధిదేవతాస్తవం బొనరింపం దలంచి తదంకితంబుగ నాంతము నర్థాలంకార సహితంబైయుండ నొక్క శతకంబు రచియించితి. అంత నా నిఘంటువు వ్రాయ నుద్యమించి వ్రాయుచు వ్రాయుచుఁ దన్మధ్యకాలంబున విద్యార్థి జనసహాయంబుగ వైకృత దీపిక, సంస్కృతాంధ్ర ద్రావిడ హూణభాషాసహితం బగు పదార్థ నామకోశము, బాల చంద్రోదయము, అలఘుకౌముది, త్రివిధంబగు నీతిమాల యను నీ పుస్తకంబులను గ్రమంబుగ విరచించి ముద్రింపించి పిమ్మట భారతాది గ్రంథములయందు సంగ్రహించి యుంచిన నీతిపద్యములను గొని స్త్రీజనసామాన్య పఠనయోగ్యంబగు సతీధర్మసంగ్రహం బను నొకపుస్తక మేర్పఱిచి యచ్చువేయించి, అట్లు మిగులఁ బూనికతోఁ బ్రారంభించి వ్రాయుచుండిన యా గొప్పనిఘంటువును వ్రాసి పరిసమాప్తిఁ బొందించితిని. ఇంతకు ముందు నా షష్టిపూర్తి సమయంబునఁ బ్రపన్నపారిజాత మను నొక ప్రపత్తిగ్రంథము నలువది పద్యములు గలదానిగా నొకటి సంతరించి ముద్రింపించితిని. తుద కిప్పుడు తద్భారతాదిగ్రంథ పరిశోధనంబుచే దొరకిన విశేషలక్షణ ప్రయోగముల చేర్చి కూర్చి త్రిలింగలక్షణశేషం బను నొక యపూర్వవ్యాకరణమును దీని వ్రాసితిని. ఇందలి లక్షణము లసాధారణము లనియు నియ్యది విద్యార్థుల కత్యంతోపకారక మనియు మంచి మనసుతోఁ బరికించువారి కెల్లఁ జక్కఁగాఁ దెల్లము కాఁగలదు.

కాన శక్తిమంతులు యథాశక్తిని దీనిని విద్యార్థుల యుపయోగమునకుం దేవల యుండని యేను మిక్కిలి కోరికగలవాఁడనై యున్నాఁడను.

బ. సీతారామాచార్యులు.

## సంకేతాక్షర వివరణము.

| | |
|---|---|
| అని. | అనిరుద్ధచరిత్రము. |
| ఆము. | ఆముక్తమాల్యద. |
| ఉ-రా. | ఉత్తరరామాయణము. |
| ఉ-హరి. | ఉత్తర హరివంశము. |
| కవిక. | కవికర్ణరసాయనము. |
| కళా. | కళాపూర్ణోదయము. |
| కాశీ. | కాశీఖండము. |
| చంద్ర. | చంద్రభానుచరిత్రము. |
| చంద్రా. | చంద్రాంగద చరిత్రము. |
| జై. | జైమినిభారతము. |
| నిర్వ. | నిర్వచనోత్తరరామాయణము. |
| నై. | నైషధము. |
| పర. | పరమయోగి విలాసము. |
| పాండు. | పాండురంగమాహాత్మ్యము. |
| పారి. | పారిజాతాపహరణము. |
| ప్రభా. | ప్రభావతీప్రద్యుమ్నము. |
| భర్తృ. | భర్తృహరి. |
| భల్లా. | భల్లాణచరిత్రము. |
| భాగ. | భాగవతము. |
| భార. | భారతము. |
| భీమ. | భీమఖండము. |
| భోజ. | భోజరాజీయము. |

| | |
|---|---|
| మార్కం. | మార్కండేయపురాణము. |
| య. | యయాతిచరిత్రము. |
| రా. | రామాయణము. |
| రాఘ. | రాఘవపాండవీయము. |
| రామా. | రామాభ్యుదయము. |
| రుక్మాం. | రుక్మాంగదచరిత్రము. |
| లక్ష్మీ. | లక్ష్మీనృసింహావతారము. |
| వసు. | వసుచరిత్రము. |
| వి-పు. | విష్ణుపురాణము. |
| విక్ర. | విక్రమార్కచరిత్రము. |
| విజ. | విజయవిలాసము |
| విజ్ఞా. | విజ్ఞానేశ్వరీయము. |
| వీర. | వీరభద్రవిజయము. |
| వేం-పంచ. | వేంకటనాథుని పంచతంత్రము. |
| శశాం. | శశాంకవిజయము. |
| శివ. | శివయోగసారము. |
| శుక. | శుకసప్తతి. |
| శైవ. | శైవధర్మము. |
| సత్య. | సత్యభామాసాంత్వనము. |
| సా. | సారంగధరచరిత్రము. |
| స్వా. | స్వారోచిషమనుసంభవము |
| హరి. | హరివంశము. |
| హరిశ్చ. | హరిశ్చంద్రోపాఖ్యానము. |

శ్రీ హయగ్రీవాయ నమః.

బాలబోధసుధాపరనామ

# కుమారదేవపండితీయము

## త్రిలింగలక్షణశేషము

## సంజ్ఞాపరిచ్ఛేదము

అవతారిక. భగవానుఁడు సత్యస్వరూపుఁడు గావున నిట గ్రంథాదిని భగవత్ప్రశంసగా సత్యప్రశంసఁ జేయుచున్నాఁడు—

క. సత్యము శ్రేయము జనులకు,
సత్యము దక్కొండు లేదు సద్ధర్మ, మదే
యత్యలఘు తపః ఫల మిడు,
నిత్యతఁ బాటిల్లు దాన నిఖిలార్థంబుల్.

వ్యాఖ్య. జనులకున్, సత్యము, శ్రేయము = మేలైనది, సత్యము, తక్క=తప్ప, ఒండు=వేఱొకటి, సత్ధర్మము = శ్రేష్ఠమగు ధర్మువు, లేదు, అదే = ఆసత్యమే, అతి అలఘు తపఃఫలము = మిక్కిలి తీవ్రమగు తపస్సువలనఁ గలుగు ఫలమును, ఇడున్ = ఇచ్చును. దానన్ = అసత్యముచేత, నిఖిల అర్థంబుల్ = అన్ని ప్రయోజనములును, నిత్యతన్=శాశ్వతత్వముతో, పాటిల్లున్=వెలయును.

సూ. ౧. ఆంధ్రభాషకు వర్ణంబు లేఁబదియైదు.

అ ఆ ఇ ఈ ఉ ఊ ఋ ౠ ఌ ౡ ఎ ఏ ఐ ఒ ఓ ఔ అఁ అం అః;
క ఖ గ ఘ ఙ, చ ౘ ఛ జ ౙ ఝ ఞ, ట ఠ డ ఢ ణ, త థ ద ధ న,
ప ఫ బ భ మ, య ర ల వ, శ ష స హ, ళ.

ౡకారగ్రహణము సంస్కృత ప్రాకృత భాషా వ్యాకరణజ్ఞుల సమ్మతము. అయ్యాది మంత్రశాస్త్రప్రసిద్ధము, యవలలవలె రేఫంబును ప్రయత్నభేదంబుచే ద్వివిధంబు గాన శబ్దశాసనాదులచేత నలఘురేఫము వర్ణాంతరముగా గ్రహింపఁబడదయ్యె. క్షకారము సంస్కృతవ్యాకరణ

# సంజ్ఞాపరిచ్ఛేదము.

ములయందును నిఘంటువులయందును క్షాంత పదమధ్యమునందుఁ బఠింపఁబడుటం జేసి యది వర్ణాంతరము గాదు, సంయుక్తాక్షర మని తెలియవలయు.

వ్యా. ఇది బాలవ్యాకరణమందలి మొదటి నాలుఁగుసూత్రములకును బూరకము. సూరిగారు బాలవ్యాకరణమున నాంధ్రభాషకు సంస్కృత ప్రాకృతభాషలతోఁ నుండు సంబంధము మెండగుటచే నాయాభాషల వర్ణముల 1, 2 సూత్రములచే విశదపఱిచిరి. అనంతరము తత్సమేతరమగు నాంధ్రంబునకు ముప్పదియాఱు వర్ణము లని 3 వ సూత్రంబునను, ఋకారాదివర్ణములు పందొమ్మిదియుం దత్సమంబులం గూడి యాంధ్రంబునం జొచ్చునని 4 వ సూత్రంబునను దెలిపిరి. ఉక్త ఋకారాదివర్ణములలోఁ గొన్ని తత్సమంబులం గూడియేకాక యన్యదేశ్యంబులం గూడియు నాంధ్రమున వ్యవహరింపఁబడుచుండుటం జేసి తత్సమ తద్భవ దేశ్యపదములం దగపడు నక్షరములన్నింటి నాంధ్రభాషకుఁ జెందినవానింగా భావించుటయే మెఱుఁగనియెంచి ఆచార్యులవారు సూత్రించుచున్నారు "ఆంధ్రభాష" ఇత్యాది. అచ్చతెనుఁగు వర్ణములు ముప్పదియాఱింటితో సంస్కృత సమాన్యదేశ్యాదులంగూడి వ్యవహరింపఁబడు ఋకారాది వర్ణములు పందొమ్మిదియుం జేరఁగా వర్ణములు మొత్తము ఏఁబదియై దగునని యర్థము. ఏఁబదియైదింటిని బరిగణించుచున్నాఁడు. 'అ ఆ' ఇత్యాది. ళాకారగ్రహణంబునకుఁ బ్రమాణముం జెప్పుచున్నాఁడు: 'సంస్కృత ప్రాకృత భాషావ్యాకరణజ్ఞుల సమ్మతము......మంత్రశాస్త్రప్రసిద్ధము' అని. అలఘు రేఫము వర్ణాంతరముగామికి శబ్దశాసనాదుల యభ్యుపగతిం దెలుపుచున్నాఁడు 'యవలలవటె' ఇత్యాది. క్షకారము వర్ణాంతరముగాఁ గైకొనంబడమికి నుపపత్తి నుపన్యసించుచున్నాఁడు: "సంస్కృతవ్యాకరణములయందును" ఇత్యాదిగా. ఇఁకను సంస్కృతాది మిశ్రమగు మనభాష నే నన్నయాదులు తెలుఁగు తెనుఁగు వికృత్యాంధ్ర నామముల వ్యవహరించియుండఁగా శుద్ధజాతీయ పదజాలము తెనుఁగనియు, సంస్కృత ప్రాకృత సంకలిత మాంధ్రమనియును భ్రమ ఈ 'ప్రౌఢ ప్రథమ' సూత్రమువలనఁ గలుగుచున్నదని దూసివ్యాఖ్యాత లనిరి. అట్టిభ్రమ గలవారి కది యుండుఁగాక, అందులకు హేతువు ఈ సూత్రమనుటకు ఆస్పదము చాలదు.

---

అవ. అకారాదులు కకారాదులు అని వర్ణములం గారప్రత్యయాంతములుగను 'రేఫ'మని రవర్ణము నిఫప్రత్యయాంతముగను నిర్దేశించుట బాలవ్యాకరణమున నున్నను

తత్సాధకవిధియందు లేదు. కావున సూత్రించుచున్నాఁడు, ప్రౌఢవ్యాకర్త.

సూ. ౨. నిర్దేశ విధానోచ్చారణంబులం దఱచుగ అవర్ణాదులు కారప్రత్యయాంతములును రవర్ణ మిఫప్రత్యయాంతము నగు.

ఉ. అకారమునకు ఉకారము వచ్చును, కకారమునకు గకారము వచ్చును, లకారమునకు రేఫము వచ్చును, మొ; అకారము, ఇకారము, ఱకారము, రేఫము మొ. తఱచుగ ననుటచేఁ గేవల వర్ణోచ్చారణమునం దీవిధి నిత్యముకాదని తెలియునది.

వ్యా. అవర్ణాదులు కారప్రత్యయ మంతమందుఁ గలవియు, రవర్ణ మిఫప్రత్యయ మంతమందుఁ గలవియు నగునన్నాఁడు. ఎప్పు డనఁగా 'నిర్దేశ విధానోచ్చారణములం' దనుచున్నాఁడు. నిర్దేశమనం బేర్కొనుట, విధాన మన వర్ణముల నొండొకదానికి ఆగమముగనో ఆదేశముగనో విధించుట. ఉచ్చారణ యనం బలుకుట. లక్షణచే ఉచ్చారణాసౌకర్య మర్థము. ఉదాహరించుచున్నాఁడు 'అకారమునకు' ఇత్యాదిగా. ఉదాహరణములు మూఁడేల యన్న-సూత్రమం దవర్ణాదు లనుటచే అచ్చులను హల్లులను ఉభయమును గ్రహింపవలె నని వ్యాకర్తహృదయము. అచ్చులకుఁ గారప్రత్యయము చేర్పఁదగినందుల కుదాహరణము 'అకారమునకు ఉకారము వచ్చును'. అని; కార ప్రత్యయమును హల్లులకుం జేర్పఁదగినందులకు 'కకారమునకు గకారము వచ్చును' అని. రవర్ణముతో నద్దానికిం బ్రత్యేకముగా విధింపఁబడిన యిఫ ప్రత్యయముం జేర్చి చూపను మూఁడవ యుదాహరణము 'లకారమునకు రేఫము వచ్చును' అని. 'అకారమునకు కకారమునకు లకారమునకు'—ఇవి నిర్దేశమునకును, 'ఉకారము వచ్చును, గకారము వచ్చును, రేఫము వచ్చును'—ఇవి విధానమునకును ఉదాహరణములు. ఉచ్చారణాసౌకర్యమాత్రమునకై కారప్రత్యయముం జేర్చుటకు నుదాహరణములు 'అకారము, ఇకారము' మొ. అవర్ణాదు లనుటలోని యాది శబ్దబోధ్య వర్ణములలోఁ జేరినదగుట రవర్ణమునకును కారప్రత్యయ మగుననుట కుదాహరణముగా నాప్రత్యయమును రకారాలఘురూపమునకుఁ జేర్చి చూపుచున్నాఁడు—'ఱకారము' అని. ఇఫ ప్రత్యయమన్ననో రవర్ణమునకే యనుటకు 'రేఫము'. సూత్రమునం 'దఱచుగ' నన్నందులకుఁ బ్రయోజనముం జెప్పుచున్నాఁడు. 'తఱచుగ ననుటచే' నిత్యాది. ఈ విధి నిత్యము కానందున కారేఫ ప్రత్యయములు రానప్పుడు నిర్దేశవిధానము లెట్లన్నఁ జెప్పుచున్నాఁడు:

# సంజ్ఞా పరిచ్ఛేదము.

## సూ. 3. ఒకచో హ్రస్వంబు దీర్ఘం బగు.

నిర్దేశవిధానములం గారేఫ ప్రత్యయములు రానియెడ హ్రస్వము నకు దీర్ఘము వచ్చునని యర్థము. ఉ. అకు ఆ వచ్చును, కాకు గా వచ్చును, లాకు రా వచ్చును.

వ్యా. కారేఫ ప్రత్యయములు తఱచుగ నగు ననుటచే నవి రానియెడల అరుదు అని సూచితము. దానినే స్పష్టార్థము మఱల నూఁదుచున్నాఁడు 'ఒకచో' నని. ముందఱి సూత్రమున 'నిర్దేశ విధానోచ్చారణంబులం' దనుట నుండి 'నిర్దేశ విధానం బులం' దనుటను అనువృత్తి చేసికొని 'ఒకచో' ననుటను వ్యాఖ్యానించుచున్నాఁడు— 'నిర్దేశ విధానంబులం గారేఫ ప్రత్యయములు రానియెడ' నని. 'హ్రస్వంబు దీర్ఘం బగు' ననుటను వివరించుచున్నాఁడు—"హ్రస్వమునకు దీర్ఘము వచ్చు" నని "షష్ఠీ స్థానే యోగా" [౧-౧-౪౯] అను వ్యాకరణ పరిభాష ననుసరించి హ్రస్వమునకను షష్ఠికి హ్రస్వస్థానమం దని యర్థము. ఉదాహరణముల నిచ్చుచున్నాఁడు మూఁటిని. మూఁ డేల యన్నఁ గార ప్రత్యయము వర్ణముల కన్నింటికి విహితము, రవర్ణమునకు మాత్రము కార ప్రత్యయమును ఇఫ ప్రత్యయమును రెండును విహితములు. కారేఫ ప్రత్యయ ములు నిత్యములు గామి, కార ప్రత్యయముం దొలంగి నిర్దేశ విధానంబులం దీర్ఘత నందు ననుటకు అచ్చులకు నుదాహరణము 'అకు ఆ వచ్చును'; హల్లులకు: 'కాకు గా వచ్చును'. వర్ణము లన్నిటితోఁబాటు తనకగు కార ప్రత్యయమును తనకుఁ బ్రత్యేక ముగఁ జెప్పఁబడిన యిఫ ప్రత్యయమును రెంటిం దొలంగి రవర్ణమును నిర్దేశవిధానం బులం దీర్ఘత నందు ననుటకు నుదాహరణము 'లాకు రా వచ్చును.'

అవ. నిర్దేశ విధానంబులందు హ్రస్వమే దీర్ఘమగునని చెప్పుటచే నా దీర్ఘముచే హ్రస్వమే బోధ్య మగుఁగదా! మఱి నిర్దేశవిధాన విధాన విషయము లైన వర్ణములు దీర్ఘములే యగునేని చెప్పు డెట్లన్న సూత్రించుచున్నాఁడు—

## సూ. ౪. దీర్ఘంబు దీర్ఘం బగు.

నిర్దేశ విధాన విషయములైన వర్ణములు దీర్ఘము లయ్యెనేని అవి యట్లే యుండునని యర్థము. ఉ. ఐ కి ఔ వచ్చును వెం॥

సూ. ౫. ఒకానొకచో జకారం బుభయం బగు.

శ్లేషయందు జకార మొక్కటియే యొక యర్థమున దంత్యమును వేఱొక యర్థమునఁ దాలవ్యమును అయ్యెడు నని యర్థము.

ఉ. 'అకట పాండురాజ యశమెన్న వైతి' రాఘ. ౧. ఆ. (ఇట జకారము భారతార్థమునందు దంత్యము; రామాయణార్థమునందుఁ దాలవ్యము నని యెఱుంగవలయు).

వ్యా. సంస్కృతమున 'ఇచు యశానాం తాలూ' యను శిక్షావాక్యముచే చ ఛ జ ఝ ఞ లకు తాలుస్థానత్వము సిద్ధమగుచున్నది. కాని తెలుఁగుభాషలో నీ చ జ లకుఁ గొన్నిచోట్ల దంతస్థానతయు నుచ్చారణమున నగపడుచున్నది. దీని కనుగుణముగనే బాలవ్యాకరణమున సంజ్ఞా. 8, 9 సూత్రములు రచింపఁబడియె 'ఇ ఈ ఎ ఏ లం గూడిన చ జ లు తాలవ్యంబులు.' 'అ ఆ ఉ ఊ ఒ ఓ ఔ లం గూడిన చ జ లు దంత్యములు' అని. ఇంక తత్సమపదమ్ములం దన్నను ఇకారాంతములైన తాలవ్య చ జ లకు బహువచనము పరం బగునపుడు దన్త్యత్వ ముచ్చారణములో నగపడుచుండుటచే దీని కనుగుణముగ బాల. సంజ్ఞా. సూ 10. రచింపఁబడినది. కాఁగా రాజుశబ్దము ఇకారాంతముగాకున్నను బహువచనము పరమందు లేకున్నను దంత్యముగ నుచ్చారణములో నగపడుచుండుటచే 'మఱియుఁ రాజు శబ్దం బొక్కటి దంత్యయుక్తంబు గానంబడియెడి' నని సూరి వ్రాసినాఁడు. శ్లేషస్థలముల నుభయసిద్ధికై ఈసూత్రమును వ్రాయుచున్నాఁడు ప్రౌఢవ్యాకర్త. కాని యిది సుప్తార్థప్రకాశికాకారులచే ఖండితం బయ్యె. 'అకట పాండురాజ' యను రాఘవపాండవీయ ప్రయోగమున రాజ యనునది రాజన్ శబ్దము నుండి వచ్చినది కాదనియు, 'రాజృదీప్తౌ' యను ధాతువునుండి వచ్చినదనియు, భిన్నస్థానికవర్ణములు సకృదుచ్చారణముచే నుభయార్థ మీయఁజాలదనియు వారి యాశయము. సూరకవి యిట నప్రసిద్ధపదమును ప్రయోగించెననుట యంతగా సమంజసము గాదు. కాన నీ సందర్భమునఁ బ్రౌఢవ్యాకరణమతమే యుక్తము గానున్నది.

సూ. ౬. రాజు వైకృతం బని కొందఱందురు.

(అప్పుడు తత్సమంబులందలి చ జ లు దంత్యములు కావని యూహించునది.)

ఉ. 'తే. రాజు చూడంగఁ జెప్పంగ రానికడిమి, నీటియలఁ
గ్రమ్మి నొంచిరి లేటి మగల' య. ౯ ఆ. మొ.

వ్యా. రాజు శబ్దసిద్ధికై తత్సమంబుల చ-జ లు బహువచనము పరమందు లేకున్నను దంత్యములుగ నంగీకరింపవలసిన యావశ్యకత లేదు. ప్రౌఢకారుఁ డిట ననువదించుచున్నది కూచిమంచి తిమ్మకవి మత మయినట్లు కానంబడుచున్నది. మఱియు నియ్యది వైకృత మగుటచేతనే యచ్చతెనుఁగు గ్రంథములందుఁగూడఁ బ్రయోగింపఁబడి యుండునే కాని, లేని యెడ నచ్చతెనుఁగు పదముల మధ్య దీనికిఁ బ్రవేశ మెట్లుండును ? కావున రాజు శబ్దము వైకృత మనక తప్పదు.

సూ. ౭. నకారం బసాధారణంబు ద్రుతంబు.

ప్రత్యయాగ మావ్యయాత్మకమై యుత్వ విశిష్టమయిన నకారంబు ద్రుత సంజ్ఞకం బని యర్థము. ద్రుత మనఁగా నొల్లనియెడ మఱఁగిపోవునది యనుట.

ఉ. ప్రత్యయాత్మకమైన నకారమునకు—తాను, నేను, ధనమును, వనమును, చదువుచున్నాను, చదువఁగలను, మొ.; ఆగమాత్మకమైన నకారమునకు—నన్నును, నాచేతను, చదువుచును, చదువుడును మొ.; అవ్యయాత్మక మయిన నకారమునకు—అన్నయును, తమ్ముండును, మఱియును, ఏమియును, మొ.; వలయుంచో నీ ద్రుతంబునందలి యుంకారంబునకు లోపం బగు. ఉన్నాను ఇత్యాదులయందు ద్రుతంబునందలి యుంత్వంబునకు లోపంబు గలుగదు. శబ్దశాసనుఁడు 'ద్రుతో ఖ్యో నః' అని కేవల నకార గ్రహణము చేయుట ద్రుతమునకు స్థిరత్వ సిద్ధికై యని తెలియవలయును.

వ్యా. నకార మాత్రమును ద్రుతము అని చెప్పినచోఁ బ్రకృతి నిష్ఠమగు 'చేను' మున్నగువానియం దతివ్యాప్తి వచ్చును. ఉత్వ విశిష్టమన్నచోఁ 'బల్లన' మున్నగువానిలో నవ్యాప్తి గల్గును. 'హరిని' యనుచో నున్న యికారము ఉకారస్థానకమే గావున నచ్చట 'ని' యనుదానికి ద్రుతత్వభంగము లేదు. చింతామణి కర్తయుఁ గూడ నుత్వవిశిష్ట మగు నకారమే ద్రుత మనుట సమ్మతి మనియ్యెను ; 'ద్రుతాఖ్యో నః'

అనునది 'స్థిరా ఇతరే' యను వ్యంజనములకు స్థిరాదిసంజ్ఞలను విధించు ప్రకరణము దుండుటచే నుత్వవిశిష్ట నకారమును గ్రహించినచో స్థిరసంజ్ఞకూడ నుత్వ విశిష్ట నకారమునకే చెంది పోల్లునకుం జెందకపోవుంగాన సామాన్యముగ 'న' యని వ్యంజనమాత్రమును గ్రహించియున్నాఁడు. చిన్నయసూరి కట్టి ప్రకరణ నిర్బంధము లేకున్నను నుత్వవిశిష్ట మని విశేషించి చెప్పక చింతామణ్యనుసారముగ నకార మాత్రమే ద్రుత మని యాతఁడు చెప్పుట సమంజసము కాదు. ప్రౌఢకారుఁ డన్ననో నకారం బసాధారణంబు ద్రుతం బని సూత్రించి అసాధారణ పదము నకు ప్రత్యయాగమావ్యయాత్మిక మని వివరించి యోగమాత్మక నకారమునకు నన్నను అని యుదాహరించుచున్నాఁడు. ఇచ్చట 'ను' ఆగమ మెట్లయ్యెనో విచారింపవలసియున్నది. మఱియు చదువుచును చదువుచున్ అను నుదాహరణములు గూడ సాగమాత్మక నకారముల కిచ్చెను. ఈ నకారములైనను సూరిగారి మతమున ఆగమములనుటకు వీలులేదు. కారణ మేమనఁగా 'చు వర్ణకంబు ద్రుతాంతంబు శత్రర్థమునం దగు', 'ఆనంతర్యమున డు వర్ణకంబు ద్రుతాంతం బగు' ననుసూత్రములచే నకారాంతములైన చున్ డున్ అనునవి విహితంబులై యుండె. ఈ రెండింటి యందలి నకారమును ప్రత్యయావయవ మగునే కాని యోగమనుటకు వీలులేదు కదా! చింతామణికారుఁడు శత్రర్థమునఁ గేవల చువర్ణకము విధించి దానికి నుగాగమును విధించుకొనుటచే నతని మతప్రకారము అచ్చటి నకార మాగమాత్మకము గావచ్చును. శబ్దశాసనుఁ డుత్వవిశిష్ట నకారము ద్రుతమని చెప్పి కేవల నకారము ద్రుత మని చెప్ప టెందులకు అని ప్రశ్నించుకొని స్థిరత్వమునకు ఘటించు యని ప్రాగ్నిర్చనకు సమాధానము వ్రాయుచున్నాఁడు. స్థిరత్వముచేతనే 'వచ్చెన్ నలినాక్షుఁ' డిత్యాది రూపములు గల్గునని యెఱుంగవలయును. 'చక్కం బెట్టె' 'కమ్మగదేసె' ఇత్యాదులందలి నకారమునకుఁ జింతామణి బాలవ్యాకరణములవలన ద్రుతత్వము సిద్ధింపదు. అట్టివి మున్ముం దీగ్రంథమున సాధింపంబడును.

ఆ. వె. తన్ను నిన్ను నన్ను మిన్ను మన్నును విన్ను
చన్ను వెన్ను కన్ను శబ్దములకు
జడ్డ లుండుఁ బోవుఁ జర్చింప నివి ద్రుత
ప్రకృతికములు గావు భక్తసులభ.

# సంజ్ఞాపరిచ్ఛేదము

అని యప్పకవి తన్నాన్వదుల ప్రకృతి సిద్ధనకారము ద్రుతము కాదని చెప్పియుండఁగా గుప్తార్థప్రకాశికాకారు లాశబ్దములు ద్రుతప్రకృతికములే కావని యప్పకవి చెప్పినట్లును అట్లనుట కవి రభసహేతువనియుఁ జర్చించుట సరికాదు.

సూ. ౮. అక ప్రత్యయాంతావ్యయంబు కళయ.

వ్యతిరేకార్థక భూతకాలిక సమాపక క్రియ ద్రుతప్రకృతికము కాదని యర్థము.

ఉ. 'ఉ. కాదన కిట్టి పాటి యుపకారముఁ దక్కఁ దేక విప్ర సం, బోధనఁ జేసి చేసె.' భార. ఆది. ౧ ఆ. 'హర్ష మద మాన విషాద సం, బోధనఁ జేసి చేసె.' భార ఆది. ౧ ఆ. 'ప్రాణవ్య ములం జొరంగ నీక తొలఁగఁ ద్రోవు' భార. శాంతి. ౨ ఆ. 'ప్రయోగము బిట్టుండ పాయంబు లేక తగన్' హరి. ఉ. 3 ఆ. మొ. 'క. అనఘు డిది యేటి తప మే, మనుపమ దుఃఖితుల మగుట నాథా రము లే,కను సంతానోచ్ఛేదం,బున ప్రేలెద మధమ లోకముల తెరువు సనన్' భార. ఆది. ౨ ఆ. ఇందు 'లేకను' అని ద్రుతాంతముగా నుండుటవలనం గొంద ఱయ్యది ద్రుతప్రకృతిక మని భ్రమించెదరు.) (చూ. శబ్దపరిచ్ఛేదము. ౧౧౩ సూత్రము.)

వ్యా. వ్యతిరేక క్త్వార్థకము ద్రుతప్రకృతిక మని బాలసరస్వతీయమునఁ జెప్పఁబడియున్నది. 'రాకన్ మానవు వానివృద్ధులు' ఇత్యాది ప్రయోగములుం గలవు. 'రాకన్'—దీనిని వచ్చుధాతువుయొక్క కృదంతరూపముగఁ గొనఁదగును. కొట్టక తిట్టకిత్యాదులం గళలలోనే చిన్నయసూరి పఠించియున్నాఁడు. ప్రౌఢవ్యాకర్త ఇదే విషయమును మఱల సూత్రించుట స్పష్టార్థమని తలంచుట యొప్పును.

సూ. తద్భవములందును నలఘు రేఫము గలదు.

ఉ. కఱకంఠుండు, కాఱియ, గఱి, గొఱపము, గొఱ్ఱె, గోఱజము, జీలకఱ్ఱ, పిఱికి, పెఱ, మోఱడు, తొఱఁగ మొ —కఱకంఠుఁడు—గరళకంఠ శబ్దభవము; కాఱియ—కారికాశబ్దభవము, గఱి—గరుచ్ఛదభవము, గొఱపము—కురపశబ్దభవము, గొఱ్ఱె—కురరీశబ్దభవము, జీలకఱ్ఱ—

జీరకశబ్దభవము, పిఱికి—భీరుశబ్దభవము, పెలి—సరళశబ్దభవము, మోఱకు—మూర్ఖశబ్దభవము, తాఁగ—లంకాశబ్దభవము, ఇం. (మా. ప్రయోగములు ఆంధ్రశబ్దరత్నాకరము.)

వ్యా. తద్భవములలో శకటరేఫము లేదని బాలవ్యాకరణ మతము. అయ్యది యుండవచ్చునని 'కఱకంఠుఁడు' మున్నగు శబ్దములంబట్టి యీసూత్రము సిద్ధయించు చున్నది. కఱకంఠుఁ డనునది గరళకంఠశబ్దభవ మనుటకంటె గరకంఠశబ్దభవ మని చెప్పుట సమంజసము. సంస్కృతమున గర, గరళ—శబ్దములు పర్యాయపదములై యున్నవి. గరము=విషము, 'అ కనికర గరో[illegible]. [illegible]' ఇత్యాది ప్రయోగములు గలవు చిన్నయసూరి సామాసిక గ్రామ్యతగల పదముల నుదాహరించునట్టున దీని నుదాహరింపకయుండుటచే నతఁడు దీనిని గరకంఠశబ్దభవ మని తలఁచియుండఁడు. నల్లని కంఠము గలవాఁ డను నర్థముగల మిశ్రబహువ్రీహి యని తలఁచియుండును. మిశ్రబహువ్రీహి కాదనుటకే ఈ సూత్రమునం దిది యుదాహరింపఁబడియున్నది. సమా 27 వ సూత్రమున నీ విషయమే వివరింపఁబడియున్నది. సుప్రసిద్ధ ప్రకాశికాకారులు 'ప్రాణగొడ్డ' శబ్దముపలెనే కఱకంఠశబ్దమునందును గ్రామ్యమనుట 'ప్రౌఢ'కారుని మతమైనట్లు వ్రాసిరి. అది యసంగతము. 'ప్రౌఢ'మున [illegible] తద్భవ మని నుడివి యిద్దాని సామాసిక గ్రామ్యతను వారించినను, ఆంధ్ర[illegible] రూప గ్రామ్యత తదవస్థితమైయే యున్నదనక తప్పదు. ప్రౌఢవ్యాకరణ[illegible] శబ్దము గరకంఠశబ్దభవ మని వ్రాసెనే కాని యగ్రామ్యమని వ్రాసియుండలేదు. తన శబ్దరత్నాకరమునను నియ్యది యనింద్యగ్రామ్య మనియే వ్రాసియున్నాఁడు.

సూ. ౧౦. కారము క్షారశబ్దభవము.

ఇందు సారూప్యము గనఁబడెడి. క్షారశబ్దము కటుశబ్దపర్యాయము నగు. 'త్రిరాత్ర ముభయో రధశ్శయ్యా, బ్రహ్మచర్యమ్, క్షారలవణ వర్జనం చ' అని ఆపస్తంబసూత్ర వాక్యము.

వ్యా. బాలవ్యాకరణమున (సం. 19 సం॥) కటుశబ్దభవము కారమని నిరూపింపఁబడియె. తద్విరుద్ధముగ నిందు క్షారశబ్దభవ మనియును క్షారమనుటకు కారమను నర్థము 'క్షార లవణవర్జనం చ' యను నాపస్తంబసూత్రమున గన్పట్టుచుండెనని వ్రాయుచున్నాఁడు.

సూ. ౧౩. కపిల శబ్దభవము కవిలశబ్దం బొందు గానంబడెడి.

ఉ. 'అక్రూర. అవసరజ్ఞుండయి వ్యాసుఁ డేతెంచె నంత నత్తపసి. కవిల గడ్డంబును గవిల జడలును గవిల కన్నులును, దవిన యన్నువ నల్లనైన దీర్ఘపుఁ దనువునుజూచి, యుండిద కన్నుంగవ మొగిచి తెలివక యుండె భయమున' భార. ఆది. ౪ ఆ.

వ్యా. సూరి 'కపిలగడ్డము' మున్నగునవి యనింద్యగ్రామ్యము లని చెప్పఁగా నవి నింద్యగ్రామ్యములే యగుని నిరూపించుట కీసూత్ర మారంభింపఁబడినది. కపిల గడ్డము మున్నగువానియందు సామాసిక గ్రామ్యత గలదనియు నీసూత్రములో నుదాహరింపఁబడిన యక్రూరలోఁదప్ప మఱెచ్చటను దీని ప్రయోజన మగపడదనియు, నీపద్యమున నున్న వకారప్రాసము తద్భవత్వమును స్థాపించుచున్నదనియు, ప్రౌఢవ్యాకరణకర్తయొక్క యభిప్రాయము. 'కపిల గడ్డము కపిల కన్నులు కపిల జడలు' అను మూఁటిని వరుసగా సూరి యుదాహరించుటంబట్టి యీ యక్రూరనే యాతఁ డాధారముగాఁ జేసికొని యుండెననియు ప్రాసభంగమును గుర్తింపనందున వకార ఘటిత తద్భవరూపమును గ్రహింపలేదనియుఁ గావుననే వాని ననింద్యగ్రామ్యములని తెలంచెననియు నీతని మతము. కాని సూరి ప్రాసవిషయమును గుర్తించియే 'పవ' ప్రాసము నంగీకరించి వీని నుదాహరించి యుండునని తోఁచుచున్నది. ఇచ్చట పవప్రాసాంగీకారమే కవిహృదయమును ప్రాచీనసమ్మతము నైనట్లు స్ఫురించుచున్నది. 'కవ దోసలు గాండీవము, నవల నిడుఁబడుపు ముంచ అరదము దిగు మే,ను విడప డిగియుద శుభకర, మగు నివ్విధమిట్లు సేయు మనుడు నతండుగ్' [భార. శల్య.] మొదలగు భారతప్రయోగములు పవప్రాసమును స్థిరపఱచుచున్నవి. ప్రాచీన తాళపత్ర గ్రంథములయందును బ్రాచీన ముద్రణమందును బై భారతాక్రూరపద్యము పవప్రాసముతోడనే యగపడుచున్నది. పై పద్యమున మూఁడవపాదము తాళపత్ర గ్రంథములయందు 'తపసి యన్నువ నల్లని' యని వ్రాయఁబడియున్నది. ఈ పాఠమే యర్థసంపత్తియు నన్వయసంపత్తియుఁ గలిగి యున్నది. అన్నువ యను పదమునకు స్త్రీయనునర్థ మాంధ్ర పదపారిజాతములో నున్నను శబ్దరత్నాకరాదులు దీని నంగీకరింప లేదు. మఱియు నమూచ్చిత కర్తలనడుమ కర్తృపద ప్రయోగము సహజముకాదు. పునరుక్తిదోషము వచ్చును. తపసి రూపు భయంకరముగ నుండెనని నిర్ణయించుట యీసందర్భమున కావశ్యక మగుటచే నన్నువ శబ్దమున కల్ప

త్వార్థము సరిపడదు. వ్యాకరణములు ప్రయోగైక శరణము లగుటచేఁ గవి ప్రయోగ ములకు అ గ్రామ్యత వచ్చునట్లు సూత్రించుట యుక్తము గాని తొలుత గ్రామ్యతను సూత్రించి పిమ్మట ననిందృత నంగీకరించుట సమంజసము గాదు.

సూ. ౧౪. గ్రామ్యంబు తత్ తజ్జాతి వర్ణనంబునం బ్రయోగార్హం బగు.

ఉ. 'మొక్కేము సామి' రామా. ౫. ఆ. 'ఎ. గీ. ఇతని, నూసి నా మేలు బాగెము సేసినాము.' య. ౧. ఆ. మొ.

వ్యా. ఇయ్యది 'గ్రామ్యం తత్ తద్విధా౽సాధుః' అను ద్వితీయాచార్యుని కారికకు అనువాదము.

సూ. ౧౫. ఒకానొకచో ననుకరణ విరహితంబుగ సంస్కృతవాక్యంబు గానంబడియెడి.

ఉ. "తే. అంటిరి నమశ్శివాయ పాపాత్మురాల" జై. ౪. ఆ.

వ్యా. "న పదా న్యవ్యయ సుప్ తిఙ్ త్వాతుమూనా, మనుకృతేఽస్తి వాక్యన్తు." అని చింతామణిలో ననుకరణ విరహితముగ సంస్కృతపదము ప్రయోగింప రాదని చెప్పఁబడియె. కాని యట్టి ప్రయోగము క్వాచిత్కముగ నుండుటంబట్టి యథర్వణుఁడు "వినాఽనుకరణం కేచిదార్య శబ్దం ప్రయుంజతే" అని నవరించెను. ఆకారిక నిట ప్రౌఢకర్త యనువదించినాఁడు.

సూ. ౧౬. జయపదం బనుకరణ విరహితంబ తఱచుగ నగు.

ఉ. 'తరువోజ. జయ పూతనాఘాత జయ దైత్యదమన, దయ నిమ్ము జీవిత దానమ్ము నాకు.' హరి. పూ ౭. ఆ. 'మ. జయ నారాయణ పుండరీకనయనా శార్ఙ్గీ జగన్నాయకా.' ఉ. హరి. ౬. ఆ. యని తఱచుగ ననుటచే ఒక్కొకచో ననుకరణ సహితంబు నగు నని యెఱుంగవలయు.

వ్యా. ఇందలి కరువోజ పాదములో నేకాక్షర యతి పాటింపఁబడిన ట్లగపడదు. అట్లు పాటింపమి సులక్షణసారమునకు సమ్మతమైనను నప్పకవీయాదులకు విరుద్ధము.

బాలబోధసుధాపరనామ కుమారదేవపండితీయ వివరణ
సమేతం బగు త్రిలింగలక్షణశేషంబునం దిది
సంజ్ఞాపరిచ్ఛేదము.

# సంధిపరిచ్ఛేదము

సూ. ౧. ప్రశస్తతావాచకంబు లగు నార్యాంబాద్యర్థక శబ్దంబులు పరంబులగుచో నన్నియచ్చులకు సంధి నిత్యము.

ఉ. రామయ్య, సామయ్య, సీతమ్మ, లక్ష్మమ్మ. మొ. ఆదిశబ్దము అన్న అక్క అప్పలను దెలిపెడు.

వ్యా. అత్తునకు సంధి బహుళము బాలవ్యాకరణసంధి. 4 వ సూత్రంబున కిది పూరకము. దీనిచే బాలవ్యాకరణమునఁ గుదరని కొన్ని రూపములకు గతి గల్గినది. ఉ. అమ్మాయి, అబ్బాయి — ఈ స్థలములందలి 'య, యి' యనునది వాత్సల్యద్యోతకావ్యయము. ఇట్టివే తపసి కన్నాకు, పొన్నాకు, అరటాకు, తాటాకు మొ. "తాటాకులలోన వ్రాసిరి" శశాం. 'అమ్మంజియమ్మ' ఇత్యాదులలో సంధిఁ గానము.

సూ. ౨. ఇ ప్రత్యయాంతావ్యయంబునకు సంధియుఁ జూపట్టెడి.

భూతకాలిక సమాపకక్రియయొక్క యికారమునకు బ్రామాణిక ప్రయోగములయందును గొన్నియెడల సంధి గనఁబడుచున్న దని యర్థము.

ఉ. 'చాపము నాకందిమ్మనుడు' భార. విరా. ౪. ఆ. 'వెలిచిట్లంబుధినాథనందనులు దోర్వీర్యంబు సాలించియుం, దలు పాటింగ' నిర్వ. ౫ ఆ. 'ఎఱింగెఱింగి నా వలు విదియేల కట్టుకొని వచ్చును దానలి' భాగ. ౯ స్కం. 'శా. నేఁ దేతెంచు ప్రయత్నమున్న నకటా నీ చేతఁ జెప్పంపఁడే' ప్రభా. ౪ ఆ. మొ.

వ్యా. 'క్త్వార్థం బైనయిత్తునకు సంధి లేదు' అను సూరిసూత్రమున కిది సవరణము. ఉదాహృతములను క్త్వార్థకేకారసంధులుగఁ గొనుట కవిసంశయవిచ్ఛేదకారుని మతము. 'ఎఱిఁగించిపుడే' యనునది 'ఎఱిఁగించితగదే' అని ముద్రితప్రతులలో నగపడుచున్నది. 'అందిమ్మను' నది శబ్దపల్లవ మనుట న్యాయము గాన నది...

ప్రబలప్రమాణము కానేఱదని కొందఱమతము. (చూ. బా. క్రి 118). 'క్త్వార్థేతో న భవే త్సదా' యను నాథర్వణమునకును 'న సదాభవతి, కదాచిత్ భవతి' 'ఎల్లప్పుడుం గల్గదు, ఎప్పుడేని గల్గు' నని యర్థము చెప్పుకొనవలెను.

సూ. 3. కొన్నియెడలఁ బ్రామాణికప్రయోగంబులం ద్రుతంబున కచ్చు పరంబగుచో ద్విత్వంబు చూపట్టెడి.

ఉ. 'మ. ఘనచక్రాయుధ నిష్ఠురక్షతగళద్ రక్తాస్య సర్వాంగుని, న్ననుభూతాప్రతిమప్రగల్భపరివాదాంతర్ధితో ద్విక్రముశ్' ఉ. హరి. ౬ ఆ. 'సర్వము న్నతని దివ్యకళామయము మంచు విష్ణునం దుల్లముసేర్చి' భాగ. ౭ స్కం. 'మ. తరుణీశాత కటాక్షవీక్షల కొనల్ దార్కొన్నచోట్లం బలె, న్నురుశోభా విభవాకరంబు లగుచుశ్ రోమాంకురస్థానముల్, పరఁగుశ్' కళా. ౭ ఆ. (నన్నయభట్టారకుఁడు 'అన్నిష్ట సఖి నూఁది యున్నదాని' యని ప్రయోగించి 'లుక్ సం శ్లేషా నాచి ద్రుతస్య' అని సంశ్లేషమును నిషేధించుట ప్రయోగ వైరళ్య సూచనార్థం బని యెఱుంగునది)

వ్యా. బాలవ్యాకరణమునఁ గొన్నియెడల ద్రుతంబుమీఁద నకారంబు గానంబడియెడి నని నిమిత్త మేమియుం నుడువకయే సూత్రించెం గాన నచ్చు పరమగుచున్నను హల్లు పరమగుచున్నను నకారద్వయ ముండవచ్చు నని తేలుచున్నది. కనుక నీసూత్రము బాల, సూత్రముచే గతార్థమే 'ద్రుతాత్ ద్రుతః క్వచి చ్చాత్ర దృశ్యతే కవి భాషితే' అని యథర్వణుండును చెప్పియున్నాఁడు. ద్రుతము మీఁది ద్రుతమునకు ఆదేశసరళములకు ముందుండు ద్రుతమునకు విహితములగు కార్యము లన్నియుం గల్గు నని తలంపరాదు 'అదియుంనుఁగాక, అదియునునుగాక' మున్నగు రూపములు సాధువులు కాఁజాలవు. మఱియు సంస్కృతమున 'ఙమో హ్రస్వాదచి ఙము ణ్నిత్యమ్' (8-3-32) అను పాణినీయముంబట్టి ద్రుతమున కచ్చుపర మగునపుడు ద్విత్వమువచ్చి 'స న్నచ్యుతః' 'పచ న్నయమ్' అని యైనట్లే తెనుఁగునందును ద్రుతమునకుఁ బిదప నచ్చుండెనేని ద్విత్వము చేయవచ్చును. కాన నీసూత్రము లేకున్నను దోషము లేదు. 'అనుక్తమన్యతో గ్రాహ్య'మ్మను నాథర్వణకారికచే సంస్కృతమర్యాదను క్వాచిత్కముగ నిందు

గ్రహింపవచ్చును. ఇట నన్నిష్టసఖి నాది యున్నదాని నను నన్నయప్రయోగము నుదాహరించుకొనుటమాత్ర మసంగతము. ఏల యన నిది ద్రుతప్రకరణము; 'అను' లోని నకార మీతనిమతమున ద్రుతము కాదు. దానిం బెన్వాదులలో 9వ సూత్రమునఁ జేర్పనున్నాఁడు. ప్రకృత సూత్రోదాహృతలక్ష్యములలోఁ దొలి దాన యతి సరిపడ లేదు. చరమలక్ష్యమున నఖండయతి యగపడుచున్నది.

సూ. ౪. చిట్టడవిఁ జిట్టి. ఇయ్యది తదితరంబులకును ఉపలక్షణం బని యెఱుంగునది.

ఉ. చిట్టడవి, చిట్టాముదము, చిట్టీఁదు, చిట్టుడుకు, చిట్టెలుక, చిట్టేలకి ఇత్యాదులందుఁ బూర్వపదంబు చిట్టి శబ్దమని యర్థము. ఇవి సంజ్ఞావాచకములు గాన సంధి నిత్యము. హల్లు పరం బగుచో ద్విత్వంబునకు లోపంబు వైకల్పికంబు. చిట్టిచాఁప, చిటిచాఁప, చిట్టితాళము, చిటితాళము. మొ॥

వ్యా. బాల. సంధి. 12 సూ. 'కుఱు చిఱు కడు నడు నిడు శబ్దముల ఱడల కచ్చు పరం బగునప్పుడు ద్విరుక్త టకారం బగు' నను దాని కిది సవరణము. చిఱు శబ్ద పర్యాయము చిట్టి శబ్ద మొకటి భాషలో చిట్టిశాస్త్రి చిట్టిపంతులు మున్నగు తావుల నుండుటచే చిట్టి + ఎలుక = చిట్టెలుక అని యైన దని చెప్పుటయే సమంజసము. సూరి కైనను హల్పరకస్థలములఁ జిఱు శబ్ద పర్యాయ మగుఁ జిట్టిశబ్దము వేఱొకటి యున్న దని యంగీకరింపవలసిరయే యుండును. అచ్పరకస్థలములఁ జిఱు శబ్ద మనియు హల్పరక స్థలములఁ జిట్టి శబ్ద మనియు ద్వైవిధ్యము నంగీకరించినచోఁ బ్రక్రియాగౌరవము స్పష్ట మగుచున్నది. కావున నీస్థలమునఁ బాధకారుని సూత్రరచనయే యుక్తమని తోఁచెడిని. ఈవిధముగఁ జిట్టిశబ్దమునే యంగీకరించినచో సేమ్యాదులలో నిది చేర వలసియుండును. కాని సంజ్ఞావాచక మగుటచే సంజ్ఞాత్వమునకు భంగము నాపాదించెడి వైకల్పికసంధి యిటఁ బ్రవర్తింపదు. చిన్నయసూరి తాను సంజ్ఞావాచకములకు నిత్య సంధి చెప్పియుండనందునఁ 'జిట్టెలుక' యిత్యాదిరూపములు సిద్ధించుననియే చిట్టిశబ్ద మును బూర్వపదముగా గ్రహింపలేదేమో!

## సూ. ౫. కొన్నియెడలఁ దెనుఁగులమీఁది సాంస్కృతిక కతపలను గదవలు గానంబడియెడి.

కొన్నియెడల ననఁగాఁ బ్రాసంబులం దని యర్థము.

ఉ. వీరల్ గోపించిన నంతకుండుఁ జెడు మీరాయోర్చువారు’ ఉ. హరి. ౪ ఆ. ‘ఇట్లు దపంబు సేయుచుండుడు’ నిర్వ. ౫ ఆ. ‘పేషణ ములు’ విజ్ఞా. ప్రా. కాం. మొ.

వ్యా. తెనుఁగులమీఁది సాంస్కృతిక పరుషములకు గసడదవలు రావను బాల. సంధి. 14వ సూత్రమున కిది సవరణము. సూరి తొలుత ప్రథమమీఁది కచటతప-లకు గసడదవ-లు బహుళముగ నగునని సూత్రించెను. ఇత్యాది సమాసములలోఁ బ్రవర్తింపదు, అనఁగా సరసపువలుకు మున్నగు తావుల గసడదవాదేశము రాదని యర్థము. చింతామణికారుఁడు ‘గసడదవా స్స్యుః ప్రథమా మాత్రాత్’ అని సూత్రించెను. వ్యాఖ్యాత లియ్యది నిత్యశాస్త్ర మనియు నిచ్చటి ప్రథమాపదము కళాత్వోప లక్షక మనియు నర్థము చేసి రారు+కదా మున్నగుస్థలముల రారుగదా యను సరళయంత రూపములనే సాధించిరి. కావున వారిమతమున రారుకదా యను రూపము కుదుర నేఱదు. సూరిగారు ఈ రూపద్వయమును గ్రంథములం దగపడుటం జేసి యేత దుభయ సిద్ధికై గసడద వాదేశమును బహుళముగ విధించిరి. బహుళ మనుటకన్న వైకల్పిక మన రాదా యని శంకింపఁగూడదు. అట్లు వికల్ప మన్నచో ‘లెస్సగాను న్యాయ్యముగాను’ మున్నగు స్థలములందుఁగూడ నీ వైకల్పికవిధి ప్రవర్తింపవలసివచ్చును. మొత్తముమీఁద సర్వవిధిప్రయోగ సంగ్రహార్థమై సూత్రమున బహుళగ్రహణ ముండి తీఱవలయును. ఈ బాహుళకమువలననే వాఁడు+కంసారి మున్నగు తెలుఁగులమీఁది సాంస్కృతిక పరుషము లున్నస్థలముల నీవిధికి అప్రవృత్తి చెప్పినచో బాల. సంధి. సూ. 14 అక్కఱలేనిదై యుండును. చింతామణి తద్వివరణముల మార్గమున నన్నచో గసడదవాదేశ నిషేధసూత్రము చరితార్థ మగుచున్నది. పాపము సూరిగారు పై విషయము నంతయుం విమర్శింపక ప్రథమా మాత్రాత్ అను సూత్రమునుమాత్రము నాలోచించి యనంతర సూత్రమును సమాలోచనాదృష్టి నుపయోగింపకయే తెలిగించిరి. కాని యిట్లు సూత్రించుట సరిగాదు. ఎలయనఁగా ‘వీరల్ గోపించిన’ మొదలగుస్థల

ములఁ దెలుఁగులమీఁద సాంస్కృతికపరుషములకు గసడదవాదేశము వచ్చియుండుటచేతను నియ్యది ప్రాసస్థానమున నుండుటం జేసి మార్పరానిదై యుండుటచేతను సూత్రమాయొక్క యసార్వత్రికత్వము స్పష్ట మగుచున్నది. ఏతత్ప్రయోగసంసిద్ధికై యీ యైదవసూత్రమును ప్రౌఢకారుఁ డారంభించినాఁడు. ఈ గసడదవాదేశ సందర్భమున నథర్వణోద్ధృత శృంగారభూషణము సకలప్రయోగ సమంజసమై యున్నట్లు తోఁచెడిని—

పరుషా వా స్వరూపేణ ప్రథమాన్త్యోపరి స్థితాః
కాకా సంబోధనే చాపి హ్యత్యయే కర్మధారయే
అచేతనార్థకే శబ్ద ఇతి శృంగార భూషణే

ఈకారిక యందలి హికారము ప్రయోగప్రసిద్ధిని సూచించుచున్నది, అనఁగా నీ నియమము శృంగారభూషణ కల్పితము గా దని భావము.

సూ. ౬. కొన్నియెడల ద్వంద్వంబునం బదంబుమీఁది చతప-లకు సడవ-లు గానంబడవు.

ఉ. 'అందచందములు' అని. ౫ ఆ. 'అప్పాచెల్లెండ్రు' నిర్వ. 3 ఆ 'కండతుండెములు' రామాయణ, 'రాకపోకలు' భాగ. ౧౦ స్కం. మొ.

వ్యా. 'ద్వంద్వంబునం బదంబు పయి పరుషములకు గసడదవ లగు' నను బాల. సంధి. 15 వ సూత్రమున కిది సవరణము. ఉక్త బాల. సూత్రమును 'తఱచుగా' నను టచే పూరింపవచ్చును. గసడదవలు తఱచుగ నగుననిన నవి 'క్వాచిత్కముగ రాకయుండునను టకు సూచనగల్గును. అప్పుడు ప్రకృతప్రౌఢసూత్రమునకుఁ బ్రసక్తి యుండదు.

సూ. ౭. సర్వపర్యాయం బయిన యెల్లశబ్దమునకు సప్తమియు, అసమాసంబున విశేష్యమునకు ముందుప్రయోగమునుం జూపట్టెడు.

ఉ. 'తే. ఎఱిఁగె సకలశాస్త్రంబుల నెల్లయందు, నధికసాత్త్వికుఁ డస్తికుఁ డనఁగ జనులు.' భార. ఆది. ౨ ఆ. 'తే. ఎల్లయందును దావసి

యించు టెల్ల, యదియుఁ దనయందు వసియించు టాత్రు వాసు, దేవుఁ
డను పేరి కర్థంబు." ఉద్యో. ౫ఆ. 'నే నొకండనే భిక్షానకున్ వత్తునో
యెల్లన్ శిష్యులఁగొంచువత్తునో' భీమ. ౨ ఆ.

వ్యా. బాలవ్యాకరణమున సూరి 'ఎల్ల' శబ్దము సమాసమందె విశేష్యమునకు ముం దుండునని చెప్పెను. అసమాసంబునఁగూడ నట్లుండ వచ్చునని ఈసూత్రము చెప్పు చున్నది. మఱియు 'సర్వపర్యాయంబైన యెల్లశబ్దంబు ద్రుతాంతం బయిన యవ్యయం' బనియుం సూరి చెప్పియున్నాఁడు. అవ్యయం బన లింగవిభక్తి వచనశూన్యము కదా. ఎల్లశబ్దము సప్తమీఘటితమై యుండు మహాకవిప్రయోగములఁ జూపుచు నింకఁ బ్రౌఢ కారుఁ డట్లది యొకానొకప్పు డవ్యయము కాకయు నుండునని స్పష్టముగఁ దెల్పు చున్నాఁడు. 'ఎలన్ + అందు = ఎల్లయందు' అని యె ట్లగును? బాలవ్యాకరణముచే నీరూపము గుదురదు. అయినను అధర్వణుని మతముచే నియ్యది కుదురును. 'అచాం సస్థా ద్రుతోऽదృశ్య స్థితోऽపి చ భవేత్సదా' యను కారికచే ద్రుతలోపమును వెలయాల్వాదులలోవలె యడాగమంబును గల్గెనని యెఱుంగునది.

సూ. ౮. తామరకాకు పరంబగునపుడు పుగాగమంబగు.

ఉ. 'ఉ. తామరపాకు నీరువలెఁ దల్లడమందిరి పౌరులందఱున్'
ఉ. హరి. ౩ ఆ

వ్యా. 'తామర'—ఇది తామరసశబ్దభవము. దీనికి 'ఆకు' పరమైనప్పుడు అత్సంధి సూత్రము ప్రవర్తింపవలసియుండఁగా, తామరపాకను పుగాగమయుతవిశేషరూపము కొండొకప్రయోగములఁ గానవచ్చుటంజేసి దానిని సాధింప నీసూత్రము నెఱుఁగ వలయును. సూత్ర మున్నతీఱున తామరపాకను రూప మొక్కటి సాధువని తోఁచుం గాని తామరాకుకూడ సాధువే. పుగాగమము నిత్యము కాదా యనిన ఆగమశాస్త్రమే యనిత్య మని వైయాకరణుల పరిభాష. అదియ ఇట శరణ్యము కాఁదగును.

సూ. ౯. తెలుఁగు గర్మధారయ సమాసంబునం
బెళ్వాదుల కడవాల్లున కచ్చుపరంబగునపుడు
ద్విత్వంబు గానంబడియెడి.

ఉ. 'పెన్నదరులు' రా. యం. కాం. 'పెన్నరదము.' రుక్మాం. 3 ఆ. 'పెన్నుద్ది' పాండు. ౩ఆ. "పెన్మూర్తి" శివ. ౭. ఆ. 'పెన్నోదలు-' భోజ. ౬ ఆ. 'కన్నాకు' (కను+ఆకు) భార. భీష్మ. ౧ ఆ. 'పల్లఅపు' (పలు+అఅపు) హరిశ్చ. ౪ ఆ. మొ. తఱచుగ ననుటచే 'అన్నిష్ట సఖీ నూఁదియుఁన్నదాని.' (అను+ఇష్టసఖి) భార. ఆది. 3 ఆ. 'అన్నుర్వీ శుఁడు' నిర్వ. ౫ ఆ. 'పెన్నరము' రా. యం. కాం. ఇత్యాదులు గ్రాహ్యంబులు. (పెను పెనుపు శబ్దము లు ప్రశేషము.)

వ్యా. పెనుపు+అదరులు - అనుచోట పువర్ణకమునకు నిత్యలోపము కాఁగ" 'కవి భల్లటైః క్రియాణాంసామ్నాం చోల్లోప ఇష్యతే' అను చింతామణ్యుక్తిచే నకారలోపమును జేయఁగ పెన్+అదరులు అని యగును. పిదప 'నోవాద్విత్వం క్వచి ద్దీష్టం పరప్రాణేన సంగతేః' అను నాథర్వణముచే ద్విత్వము రాఁగా పెన్నదరులు పెన్నుద్ది మున్నగునవి సిద్ధించును. 'అను' అనునది ధాతుజన్యవిశేషణ మగుటచే నియ్యది పెనా మున్నగునవి సిద్ధించును. ... ద్విత్వము సిద్ధించుటకై తఱచు శబ్దమును ద్యన్తర్గతము గాదు. కావున నిచ్చటఁగూడ ద్విత్వము సిద్ధించుటకై తఱచు శబ్దమును శరణముగఁ జెప్పుచున్నాఁడు. దీనినే మూఁడవ సూత్రము క్రిందను ఉదాహరించుకొని యున్నాఁడు. ఏకరూపసిద్ధికి సూత్రద్వయమును సాధారగముగొనుట పరిమం కాదు. ఇది బాలోక్త టుగాగమశాస్త్రమునకుఁ బూరకము

సూ. ౧౦. కొన్నిచోట్ల షష్ఠీసమాసంబునందు కారంబున కచ్చు పరంబగునపుడు నుగాగమంబునకు లోపంబునగు.

ఉ. 'గోపుల మిల్లిల్లు దప్పకుంట లక్ష్మిపతి గ్రుమ్మరున్ గడియ సేపున రేపున.' హరి. పూ. ౫ ఆ. సీ. దినవెచ్చమునకునై తన మేనఁగల సొమ్ము కొదుకక బచ్చింటఁ గుదువపెట్టుచు.' పాండు. 3 ఆ. 'శిరసందం బరయన్' కళా. ౭ ఆ. మొ.

వ్యా. 'షష్ఠ్యా ఉతో౽చినుమ్ సేచ' అను సూత్రముచే షష్ఠీ సమాసమ లలో నుదన్తముల కచ్చు పరమగునపుడు నుగాగమమును చిన్తామణి విధించెను. ఇచట యూనకా రము బుకారోపలక్షకము. బుకారమును గండు రేఫములు నోక యోగముగల వు గదా! దీనిచే సూరి 'షష్ఠీసమాసమునందు కార బుకారముల కచ్చు పరమగునపుడు

నుగాగమంబగునని తెనిఁగించెను. ఉక్త నుగాగమము రాని ప్రయోగములం గొండొకచో గాంచి తాదృగ్రూపసిద్ధికై ప్రౌఢవ్యాకర్త ప్రకృతసూత్రమును వ్రాసెను. 'గోకుల మిల్లిలు' అనుచోటమాత్రము షష్ఠీసమాసముగనే కొనవలసిన యక్కఱ లేదు. 'గోకుల' మును దానిని సప్తమ్యర్థమున వచ్చిన ప్రథమగాఁ గొనఁదగును. అప్పుడు నుగాగమము నకుఁ బ్రాప్తియే యుండదు. సప్తమ్యర్థమునఁ బ్రథమవచ్చుట సూరికిం జింతామణికారు నకుంగూడ నభిమతమే. మిగిలిన ప్రయోగములన్నియు నాగమశాస్త్రము యొక్క యనిత్యత్వమును సూచించుచున్నది. ఆగమశాస్త్రమనిత్యమనుట ఆద్యవ్యాకరణపరిభాషా ప్రసిద్ధమే కావున న్వాగమాభావరూపముల సాధింపఁ బృథక్సూత్రకరణము అక్కఱ లేదు.

### సూ. ౧౧ పూ పూవు.

అసమాసంబునం బూ శబ్దము పూవు శబ్దముయొక్క పర్యాయముగాఁ గానంబడియెడినని యర్థము.

ఉ. 'ఎ, గీ. కాలకంఠుని శిరసు పూ గగనగంగ' కాశీ. ౧. ఆ.

వ్యా. బాలవ్యాకరణకారుఁడు [సంధి. సూ. ౩౬] సమాసంబునం బ్రాఁతాదుల తొలి యచ్చుమీఁది వర్ణంబులకెల్ల లోపంబు బహుళంబుగ విధించి యుదాహరణంబులలో పూరెమ్మ యని కూర్చినాఁడు. దీనింబట్టి 'పూ' అనునది పూవు శబ్దముయొక్క లుప్తశేషమే అనియుం సమాసపూర్వావయవముగనే అయ్యది యుండఁదగుననియు వ్యస్తముగఁ గొని సమాసోత్తరావయవముగఁగాని అట్టి రూప ముండదనియు స్థూలదృష్టికి భ్రాన్తి వొడమవచ్చునని యాశంకించి తదపనయనార్థము ప్రౌఢకర్త ఈసూత్రమును వ్రాసినాఁడని తెలియవలయు. 'కాలకంఠుని శిరసు పూ గగనగం' గిత్యాది స్థలముల పూ శబ్దము ప్రాఁతాదిసూత్ర గోచరము కానందున నద్దాని పూవుశబ్ద పర్యాయంబునుగాఁ గొనవలెనని సూత్రార్థము.

### సూ ౧౨. సమాసమునఁ దత్సమంబు పరంబగునపుడును నుమాగమాదులు గానంబడియెడి.

ఉ. ముంగోపము, వింజామరము మొ. (వెల్ల+చామరము) సంధి యందు వర్ణవికారము (చూ. సమాసపరిచ్ఛేదము. ౭ సూ.)

వ్యా. సూరి ప్రాంతాది సమాసములలో నుత్తరపదముల నన్నింటం దత్సమేతరంబులుగనే యుదాహరించెను. దానింబట్టి ప్రాంతాదులకుం దత్సమంబులతో సమాసము ఘటిల్లదను భ్రాన్తి వొడమఁదగియున్నందున ప్రౌఢవ్యాకర్త యట్టి భ్రాన్తిం దొలంపనున్నాఁడు. సమా. సూ. ౭ చేత 'క్రొత్తాదులు లుప్తశేషంబులు దేశ్యంబులతోడం బోలెఁ దత్సమంబులతోడం గొన్నియెడలఁ గర్మధారయ మగును' అని. అట్టి సమాసంబులంగూడ నుమాగమాదుల నీసూత్రముచే విధించుచున్నాఁడు.

సూ. ౧౩. అచుకొను లోనగు ధాతుజ విశేషణముల
యంత్యాకారమునకు వ్రాల్లు పరంబగునపుడు
లోపంబు వైకల్పికంబు.

ఉ. 'గిరివ్రజ మన్పురంబు' భార. సభా. ౧, ఆ. 'జడిగొన్ కోర్కుల నింతి తాను మగవేషం బూని. సత్య. ౩ ఆ. 'తోడువింటి వాఁడు చక్రావఁ బోక' ఆము. ౬. ఆ.

వ్యా. పదాంతంబులయి యసంయుక్తంబు లయిన నుఁరుల యంత్యంబునకు లోపంబు బహుళంబుగా నగునని బాలవ్యాకరణమున సూత్రితము (ప్ర.16). నను స్వపద మధ్యగతములైనప్పు 'డను కొన్నా'దులకుం బ్రయోగంబులం గానవచ్చు నంత్యోత్వ లోపము అవ్వానికి పదాంతత లేమి ఉక్తబాలసూత్రమునకు లోఁగదు కాన దానిని సాధింప నీ పృథక్సూత్రారంభమని గ్రాహ్యము. ఇచ్చటి లుప్తాచ్కమగు నకారంబు గాఁక పరుషముల స్థానమున సరళాదేశము రామి యానకారము ద్రుతసంజ్ఞకము కామికి సూచకము.

సూ. ౧౪. నెన్నడాదులన్ నెఱిదగు

నెన్నడ, నెన్నడుము ఇత్యాదులయందు నెఱి శబ్దము పూర్వపదంబుగా నుండుట యుక్తమగునని యర్థము. నెఱి పూర్ణార్థకము; నెఱి రమ్యార్థకము.

వ్యా. బాలవ్యాకరణమున క్రొత్తాది సూత్రోదాహృతములలో నెఱి + నడుము అనియున్నది. నెఱి పూర్ణార్థకము గావున "నెఱి + నడుము = నెన్నడుము" అన్న బోలు

స్థూలమగు నడుము అను నర్థ మేర్పడును. ఆయ్యర్థ మనుచితము. ఇట్టి సమాసంబులం బూర్వపదంబు 'నెఱి' యగుట తగునని ప్రకృత సూత్రార్థము. నెఱి రమ్యార్థకము. నెఱి+నడుము=అందమైన (సన్నని) నడుమని గ్రహించుట యొప్పును. ఆదిశబ్దముచే నెమ్మోము నెమ్మేను మున్నగునవి గ్రాహ్యంబులు.

సూ. ౧౫ కొన్ని యెడల నవర్ణంబు
పరంబగునపుడు పూర్వ పదాంత్య
డకారంబు నకారంబగు

ఉ. రెన్నాళ్లు, క. పది దినము లైదుప్రొద్దులు, పసపడి రెన్నాళ్ల నొక్క పగలుఁ రేయుఁ' భార. ఆది. ౧, ఆ. మూన్నాళ్లు, 'ఎ. గీ. చెలఁగుమాసిన మూన్నాళ్ల సిగ్గుతోడఁ, బతివిలోకన మార్గంబు పరిహ రించి' కాశి. ౭. ఆ. వేన్నిళ్లు 'తే. ఏళ్ల నీళల నొండె వేన్నీళ్ల నొండెఁ, గడువఁబాతఁ దోమిన నొండెఁ గలుగు శుద్ధి.' మార్క. ౩ ఆ.

వ్యా. మూఁడు+నాళ్లు, రెండు+నాళ్లు, వేఁడి+నీళ్లు—అను తావుల బిందు పూర్వక ఉకారమునకు ణకార సజాతీయత యుండుటచేతను, న, ణ-లకుఁ బరస్పర సామ్యముండుటచేతను నకార ద్విత్వముగల్గుట యనుభవసిద్ధము గానున్నది. డకార మాత్రమునకు నకారరూప స్థిరవర్ణాదేశంబును విధించినందువలన డువర్ణమునకుఁ బూర్వమం దుండు బిందువు నాన్నాఁడిత్యాదులలోవలె స్వయముగ లోపించునని యాతఁడు తలంచి యుండును. కాని యీ ప్రక్రియ వర్ణవిపరిణామ స్వరూపమున కంతగా సంబంధించి యుండలేదు. అనునాసిక్య మింతయును లేని కేవల డకారము నకారమగుట స్వాభావి కము గాదు. కాన నిట బిందు పూర్వక డకారమునకే నకారము విధించుచు నిట్లు పీలున్న స్థలములందైన విపరిణామ స్వభావమును బోధించుట యావశ్యకము. మూన్నాళ్లు వేన్నీళ్లిత్యాది దీర్ఘపూర్వక ద్విరుక్తయుత రూపములంబట్టి "ద్విరుక్తం బగు హల్లు పరంబగునపుడు ఆచ్ఛికం బగు దీర్ఘంబునకు హ్రస్వంబగు' నను బాల. సమా. 13 వ సూత్రము ప్రాయోవాదమని ఎంచవలసియున్నది.

## సంధిపరిచ్ఛేదము

సూ. ౧౬. హలవసానంబులు పరంబు లగునపుడు ఏమిశబ్దముయొక్క
యికారమునకు లోపంబు వైకల్పికంబు.

ఉ. 'నీకే బ్రాఁతియే వెన్నలుం బాలున్;' హరి, పూ. ౫ ఆ.
'శవము క్రియనుండెడిదే." భాగ. ౯ స్కం, పూ.

వ్యా. ఉదాహృతములలో లోపించినది 'మి' వర్ణమంతయుం నేకాని తద్గతమయి బట్టి యికారమాత్రము కాదు. కావున 'మి' లోపించునని సూత్రించుట శ్రేయము. లేక—ఇకారమాత్రమునకే లోపమని సమ్మతించుపక్షంబున నీకేమ్ బ్రాఁతియే యని సిద్ధింప, నమలకుంగల యానునాసిక్య సాధర్మ్యముంబట్టి సిద్ధసరళములకు ముందు ద్రుతమునకుం జెప్పఁబడియుండు లోపమునే ఇచట మకారమునకు ప్రసక్తింపఁజేసి 'నీకే బ్రాఁతియే' యని సిద్ధించినదని తలంపవచ్చును. అవసానమున లోపము నిట్లే.

సూ. ౧౭. షష్ఠీసమాసమందలి నిలలమీఁది యచ్చులకు
హల్లు పరంబగుచోఁ గొన్నియెడల లోపంబు
గానంబడియెడి.

ఉ. 'శా. ప్రీతిన్ సూరిల నశ్వినీ సుతులం రాఁ బెంపొందు
నింద్రున్ వలెన్' ఉ. రా. ౨, ఆ. "తూలె రజనీచర భాస్కర బింబ
ముల్ రుచుల్" రామా. ౫. ఆ. "అబ్జాసనాంకముల్ పెంపు"
చంద్రా. ౧. ఆ.

వ్యా. 'ఇంద్రునివలెన్' 'బింబముల రుచుల్' అని యుండఁ బ్రకృత సూత్రముచే 'ఇ' కార లోపముచేయఁగా 'ఇంద్రున్ వలెన్' 'బింబముల్ రుచుల్' అను రూపములు సిద్ధించినవి. ఇట్టి స్థలముల స్వరలోపము గావించుటంజేసి వివక్షిత షష్ఠ్యేక వచన బహువచనార్థ ప్రతీతికి భంగము సంభవించుటయేగాక ద్వితీయైకవచన ప్రథమా బహువచనార్థ స్ఫూర్తిగల్గి ప్రాకరణికార్థ ప్రతీతి కాటంకమును కలుగుచున్నది. బహు తాత్పర్యార్థప్రతీతికి భంగమువచ్చుననియే చిన్నయసూరిగారు 'సమాసంబున విభక్తికి లోపంబగు, లట్టునకుఁగాదు" అని లడాగమమునకు లోపమును నిషేధించిరి. మఱియుం 'తామరసనేత్రల + ఇండ్లు' మున్నగు స్థలములసంధిని సమ్మతింపకయుం నుండిరి. కాని

'తామరసనేత్ర లిండ్లు' న్నిత్యాదిప్రయోగములు గొన్ని గలవు. అట్టివానిని సంరక్షింప నధర్వణులు. 'వినాలవర్ణం నోసంధిః' యను కారికచే క్వాచిత్కసంధి ననుగ్రహించిరి. దీనికే మఱియొక యుదాహరణము—'రాకాచంద్రుఁ గారాకొట్టు' (విజ) రాకాచంద్రపదసంబంధమగు 'రా' యను నక్షరమును కొట్టుఁ=ఖండించుము తప్పించు మని యర్థము. కాఁగా 'కాచంద్రుఁ' అని యగును. 'కుత్సితచంద్రునిగఁ జేయుము' నని గూఢార్థము. ఇట 'రాకాచంద్రునియొక్క రా (అను దానిని) కొట్టి' యన్నప్పుడు 'యొక్క'కు లోపము చేసినపిదప నివర్ణైకారమునకు ఇద్దానిచే లోపము రాఁగా 'రాకాచంద్రు'న్నని యేర్పడినదని తెలియవలెను.

సూ. ౧౮. మధ్యమ పురుష మువర్ణంబున కచ్చుపరంబగు
నపుడును గొన్నియెడల లోపంబు చూపట్టెడి.

ఉ. 'ఆడిదె నీడుపంటెము' కళా. ౬ ఆ. 'భవచ్చిత్తేప్సితం బ్చెప్పనినఁ' మార్క. ౨ ఆ.

వ్యా. 'మధ్యమ పురుష మువర్ణకమునకు హాలవ సానంబులు పరంబులగు నపుడు లోపము విభాషనగు' నను బాల. సంధి. సూ. 47 కు ఇది సవరణము. ఉదాహృతములు లేఖక ముద్రాపకాదుల చేతఁ గల్గిన పొరలేగాని కవిప్రయుక్తరూపములు కానోపవనియు, 'ఆడితె నీడుపంటెము' 'భవిచ్చిత్తేప్సితం బె దొకో యనినన్' అని దిద్దుకొనుటయే శ్రేయమనియుఁ దోఁచెడిని.

సూ. ౧౯. ధ్వన్యనుకరణశబ్దములకనుధాతువు పరంబగుచోఁ
గొన్నియెడల ముగాగమంబగు.

ఉ. "కనకన మను" రామా. ౬. ఆ. "సలసల మను" పాండు. ౫. ఆ. మొ.

వ్యా. ధ్వని ననుకరించు శబ్దములు ధ్వన్యనుకరణ శబ్దములు—అట్టివి ద్విరుక్తములే యైయుండునని వెంటనే సూత్రింపనున్నాఁడు—వానికి 'అను' ధాతువు మీఁది దగునప్పుడు ఆ ద్విరుక్తశబ్దంబునకు 'ము' వర్ణము అంతాగమము కును. కనకన + ము + అను సలసల + ము + అను=కనకన మను సలసల మను—అని సిద్ధించును. అట్టి ముగా

గమయంత రూపముల వైరళ్యముం దలంపించుచున్నాఁడు 'కొన్నియెడల' నని. 'గళ గళనిచెప్పె' (పర. ౫ ఆ) మున్నగు ముగాగమము రాని ప్రయోగములే బహుళము లనుట.

సూ. ౨౦. ధ్వన్యనుకరణ శబ్దంబులు ద్విరుక్తంబుల యగు

ఉ. గడగడ, వడవడ, తళతళ, పెళపెళ.

వ్యా. ధ్వని ననుకరించుశబ్దములు అనుకృత్యధ్వని శ్రోతలకు స్పష్టపడుటకై, ఇరుమాఱు అవ్యవహితములుగ ప్రయుక్తము లగుచుండునని ఈ సూత్రార్థము. గడ, వడ, తళ, పెళ,—ఇ ట్లేకైకరూపములు ధ్వన్యనుకరణసమర్థకములు కాజాలవనుట.

సూ. ౨౧. ఇయ్యవి క్రియావ్యవహితంబులు నగు.

ఉ. 'వడవడ జమదగ్ని సూతివడఁకెన్' రా. సూ. ౮ ఆ.

వ్యా. ఇయ్యవి యనఁగా పూర్వ పూర్వతర సూత్రోక్తధ్వన్యనుకరణ శబ్దములు. అవి తమకు వి క్రియతో నన్వయమో ఆ క్రియతో వ్యవధానము గల్గియుండునని సూత్రార్థము. ఉదాహరణమున వడవడ యను ధ్వన్యనుకరణ శబ్దమునకును, 'వడఁకెన్' అను క్రియకును 'జమదగ్నిసూతి' యను దానివలన వ్యవధానము గల్గియున్నది. సూత్రమందలి సముచ్చయార్థకముచే వ్యవధానములేకయు నుండుననుట గ్రాహ్యము. ఉ. "క. అ, వ్వరూథినిండాఁకె ధరణి వడవడ వడఁకన్" భార. శల్య. ౧ ఆ. మొ.

సూ. ౨౨. ప్రాసంబున సకారంబు పరంబగుచో ద్రుతంబునకు మకారాదేశం బగు.

ఉ. 'కస్మని లతాంతములకు మ్మొనసి' భార. ఆది. ౫ ఆ. 'మత్త. వృష్టిం జేసె మ్మహానది దీర్ఘికా సరసీ జలంబులు నిండఁగాన్' అర. 3 ఆ.

వ్యా. ఈ రెండు భారతప్రయోగము లందును ప్రాసము సరిపెట్టుటకై యీ మకారాదేశము విధింపఁబడినది. ఈవిధి ప్రయోజనాంతర రహితము. ద్రుతమునకు బిందువును విధించి మకారద్విత్వము బిందుపూర్వక మకారముతోఁ ప్రాసముఁ జెల్లు ననియుం నయ్యది యనునాసికప్రాసమనియు అప్పకవి స్పష్టపఱచియున్నాఁడు గాన నీ ప్రాసములఁ గుదుర్చుటకై మకారాదేశవిధి యనావశ్యక మనఁదగును.

## సూ. ౨౩. ఆమ్రేడితంబు పరంబగునపుడు కృతహ్రస్వంబునకు దీర్ఘంబగు.

ఉ. లే లెమ్ము, పో పొమ్ము. మొ.

వ్యా. కృతహ్రస్వం బనఁగా వ్యాకరణసూత్రప్రాప్త హ్రస్వతగలది. అట్టిది ఆ హ్రస్వతనువీడి దీర్ఘంబగును. ఎప్పుడనఁగా 'ఆమ్రేడితంబు పరంబగునపు' డను చున్నాఁడు. దీర్ఘత్వప్రాప్తికి ఆమ్రేడితంబు పరంబగుట హేతువని సూత్రకారుని యభిప్రాయముగాఁ దోఁచుచున్నది. కాని కృతహ్రస్వముయొక్క హ్రస్వతాప్రాప్తి కేది హేతువో అది లోపించుటయే ఆ హ్రస్వత వీడుటకును హేతువనియెంచుట యొప్పును. ఎట్లనఁగా—'లేచు నకు ముజ్జు పరంబగునపుడు చు లోపంబగు'—లేము—'పోవునకు దుష్టుత్తులు ముజ్జుం బరంబులగునపుడు వు లోపంబుం బొదకపలును విభాషనగు'—పోము—'ముజ్జు పరంబగునపుడు దీర్ఘంబునకు హ్రస్వంబును ముపర్ణకంబునకు మాము డియు నగు'—లెమ్ము పొమ్ము—ఆమ్రేడితంబు పరంబుకాఁగా—లెమ్ము + లెమ్ము, పొమ్ము + పొమ్ము—మధ్యమ ముపర్ణకమునకు హ ల వ సానంబులు పరంబులగునపుడు లోపము విభాషనగు—లె + లెమ్ము, పొ + పొమ్ము—'మ్ము' అనునది లోపింపఁగాఁ తత్సన్నియోగశిష్ట మగు హ్రస్వముగూడ దానితోడనే లోపించి స్వతస్సిద్ధమగు దీర్ఘము మఱల గల్గు చున్నది.—లే లెమ్ము, పో పొమ్ము—'సన్నియోగశిష్టానాం సహ ప్రవృత్తిః' అను సంస్కృత వ్యాకరణ పరిభాషను 'అనుక్త మన్యతో గ్రాహ్య' మనుటంబట్టి తెనుంగు నందును గ్రహింపవచ్చునుగదా.

ఇది బాలబోధసుధాపరనామ కుమారదేవపండితీయ మను

ప్రౌఢవ్యాకరణ వివరణంబునందు

సంధిపరిచ్ఛేదము.

# శబ్దపరిచ్ఛేదము

---

## నామప్రకరణము

సూ. ౧. శబ్దములు విశేష్యములు విశేషణములు లని ద్వివిధంబులు.

ఉ. అయ్య, అన్న, అమ్మ, అక్క మొదలగునవి విశేష్యములు; తక్కినవి విశేషణములు.

వ్యా. శబ్దములు రెండువిధములు. వాని పేర్కొనుచున్నాఁడు: 'విశేష్యములు విశేషణములు' అని. విశేష్య విశేషణముల నవ్వలిసూత్రమున మూలకారుఁడు స్వయముగ వివరింపనున్నాఁడు. ఉదాహరించుచున్నాఁడు 'అయ్యా'దులు విశేష్యము లని తక్కినవి విశేషణములని.

సూ. ౨. విశేష్యము నా విశేషణములచేఁ దెలుపఁబడు విశేషము గలది; విశేషణము నా జాత్యాది విశేషములను దెలుపునది.

వ్యా. విశేష్య మనఁగా విశేషము గలది. విశేష మనఁగా భేదము. భేదముగలది భేద్యము. కావుననే విశేష్యమునకు భేద్య మని నామాంతరము గలదు. ఉదా. రాముఁడు—ఈ వ్యక్తియందు రామత్వ మను విశేషము గలదు. అయ్యది లక్ష్మణాదులందు లేమిం జేసి తద్విశేషము (భేదము) ఇందుఁ గలదు. కాఁగా రాముఁడు విశేష్య మనియు భేద్యమనియుం జెప్పఁదగు. ఈ రామాది పదార్థనిష్ఠ రామత్వాది విశేషమును బోధించు పదములకు విశేషణము లని పేరు, విశేషం వక్తీతి విశేషణమ్. విశేష్యనిష్ఠ విశేష (భేద) బోధకము. దీనికి భేదకమని యను నామాంతరము. విశేష్య విశేషణ సంబంధమునకు సమవాయ సంబంధ మని పేరు. ఈసమవాయము నిత్యము.

సూ. ౩. విశేషణము జాత్యాదిభేదంబుచే షడ్విధంబు.

అవి—జాతిప్రయుక్తవిశేషణము, క్రియాప్రయుక్త విశేషణము, గుణప్రయుక్త విశేషణము, ద్రవ్యప్రయుక్త విశేషణము, సంఖ్యాప్రయుక్త విశేషణము, సంజ్ఞాప్రయుక్త విశేషణము.

ఉ. ౧. జాతిప్రయుక్త విశేషణమునకు —బ్రాహ్మణుఁడు.

౨. క్రియాప్రయుక్త విశేషణమునకు—పోవువాఁడు.

3. గుణప్రయుక్త విశేషణమునకు —నల్లనివాఁడు.

౪. ద్రవ్యప్రయుక్త విశేషణమునకు —ధనవంతుఁడు.

౫. సంఖ్యాప్రయుక్త విశేషణమునకు—ఒక్కఁడు.

౬. సంజ్ఞాప్రయుక్త విశేషణమునకు —దేవదత్తుఁడు. మొ

వ్యా. విశేషణము షడ్విధం బనుచున్నాఁడు: అనఁగా ఆరుభేదములు గలది. అట్లది యారువిధంబు లగుటకుం గారణము 'జాత్యాదిభేదం' బనుచున్నాఁడు. జాత్యాదులు ఆరు. అవి ఏవి యనఁగా జాతి క్రియా గుణ ద్రవ్య సంఖ్యాసంజ్ఞలు. ఉక్తభేదంబుచే షడ్విధంబులైన విశేషణముల నోలి పేర్కొనుచున్నాఁడు. 'జాతిప్రయుక్త విశేషణము' ఇత్యాదిగా. జాతి యనఁగా సజాతీయ వస్తుధర్మము. నిఖిల బ్రాహ్మణులయందు బ్రాహ్మణత్వము జాతి నాఁబడు. బ్రాహ్మణుఁడు బ్రాహ్మణత్వ రూపజాత్యాశ్రయుఁడు. క్రియ యనం బని. వ్యాపారమును నిరూపకముగఁ జెప్పుట-పోవువాఁడు. గుణ మన వర్ణాది నిరూపకము. ఉదా. నల్లనివాఁడు. నల్లాదులు గుణవచనంబు లని బాలవ్యాకరణమునను-ద్రవ్యంబు నా ధనము మొ॥ ధనాదుల కలిమిలేముల నిరూపకములుగఁ జెప్పునవి ద్రవ్యప్రయుక్త విశేషణములు. ఉదా. ధనవంతుఁడు సంఖ్య యనఁగా లెక్క. ఉదా. ఒక్కఁడు. సంజ్ఞయన గుర్తు, పేరు, సజాతీయములలో నొక్కొక్కదానిం బ్రత్యేకించి తెలియ నుపయోగపడునట్టిది. ఉదా. దేవదత్తుఁడు.

సూ. ౭. సంఖ్యాప్రయుక్త విశేషణ మేకాంతంబై యుమహద్విశేష్యక మయ్యు, తదంశాంతంబయి మహదమహద్విశేష్యకమయ్యు, సమస్తంబు వ్యస్తంబునగుచో విశేష్యంబు క్రమంబుగ నుత్తర పదంబు నేకవచనాంతంబును పూర్వపదంబు బహువచనాంతంబు నగు.

తదంశము = ఆయొకటియొక్క భాగము. అనఁగా భాతిక లోనగునది.

ఉ. డెబ్బదియొక్క రథము, రథములు డెబ్బదియొక్కటి; రెండున్నర మానిసి, మానిసులు రెండున్నర; రెండున్నరరూపాయ, రూపాయలు రెండున్నర మొ॥

వ్యా. స్త్రీ తిర్యగ్ జడ భిన్నంబులును వాని విశేషణంబులును మహత్తు లనంబడునని బాల. తత్స. సూ. ౧౭. మహద్భిన్నంబు లనఁగా స్త్రీ తిర్యగ్ జడవాచకంబులును వాని విశేషణంబులును అమహత్తులు. అందు స్త్రీవాచకవిశేషణములకు మహతీవాచకము లని వ్యవహారము. సంఖ్యాప్రయుక్త విశేషణమనఁగా సంఖ్యను నిరూపకముగఁ జెప్పు విశేషణము. ఏకాంతం బనఁగా ఒకటిం దెలుపు పదముతో ముగియునది. ఏకాంతంబు లగు సంఖ్యాప్రయుక్త విశేషణములు పదునొక్క, ఇరువదియొక్క, ముప్పదియొక్క, మొ॥. ఏకాంతంబగు సంఖ్యాప్రయుక్త విశేషణము అమహద్వాచకము విశేష్యముగాఁ గలదేని అప్పు డది యమహద్విశేష్యక మగును. ఆ యేకాంతం బగు సంఖ్యాప్రయుక్త విశేషణము అమహద్విశేష్యముతో సమసించునప్పుడు తాఁ బూర్వపదంబుగనే యుండును. ఆ విశేష్య ముత్తరపదమ్మై ఏకవచనాంతమ్మై యుండును. ఉదా. డెబ్బదియొక్క రథము. అవి సమసింపక వ్యస్తములుగ నుండునేని విశేష్యము పూర్వపదంబయ్యి బహువచనాంతమగును. ఉదా. రథములు డెబ్బదియొక్కటి. 'తదంశ మనఁగా ఆ యొకటి యొక్క భాగము. అనఁగాఁ బాలిక లోనగునది' యని సూరికారునిదే వివరణము. 'బాలిక లోనగువానిం దెలుపుపదముతో ముగియు సంఖ్యాప్రయుక్తవిశేషణము 'తదంశాంత సంఖ్యాప్రయుక్తవిశేషణము.' ఉదా. రెండున్నర, రెండుంబాలిక మొ॥ దానికి విశేష్యము మహద్వాచకమేని యది మహద్విశేష్యకమును, అమహద్వాచకమేని యది యమహద్విశేష్యకము నగును. ఆ విశేషణ మా విశేష్యముతో సమసించునేని విశేష్యము ఉత్తరపదమ్మై ఏకవచనాంతమయి యుండును. ఉదా. మహద్విశేష్యక మైనప్పుడు— రెండున్నర మానిసి; అమహద్విశేష్యక మైనప్పుడు— రెండున్నర రూపాయి; ఉక్తవిశేష్య విశేషణములు సమసింపక వ్యస్తంబులుగ నున్న, విశేష్యము పూర్వపదంబయ్యి బహువచనాంతంబు నగు. ఉదా. మహద్విశేష్యక మైనప్పుడు— మానిసులు రెండున్నర; అమహద్విశేష్యక మైనప్పుడు— రూపాయలు రెండున్నర.

సూ. ౫. అయ్యది యేకాంతంబు మహాద్విశేష్యకంబు సమస్తంబు కాదు. వ్యస్తంబగుచో బహువచనాంతంబ యగు.

ఉ. పదునొకండ్రు రుద్రులు మొ. (చూ. సమాసపరిచ్ఛేదము.)

వ్యా. ఒకటిం దెలుపు పదముతో ముగియు సంఖ్యాప్రయుక్తవిశేషణమునకు విశేష్యము మహద్వాచకమైన యెడ నవ్విశేషణంబున కా విశేష్యముతో సమాసము కుదురదు. ఆ విశేషణము వ్యస్తముగనే యుండవలెను. అప్పుడది యేకవచనాంతముగ నుండరాదు. బహువచనాంతమై యుండవలెను. పదునొక్క రుద్రులను సమాసమును రుద్రులు పదునొక్కం డను నేకవచనాంత వ్యస్తరూపమును అసాధువులు. పదునొకండ్రని బహువచనాంతముగనే యుండవలెను. ఒకండు మొదలగువానితో 'పది' కగు సమాసంబుల యువర్ణ వ్యవధానంబును గలదని 'పదియు నొక్కం' డ్రిత్యాదిరూపంబుల సమా. ౭౭ వ సూత్రమున మూలకారుడు సాధింపనున్నాడు. కావునే చెప్పుచున్నాడు:—'చూ. సమాసపరిచ్ఛేదము ౭౭ సూ.' అని.

సూ. ౬. విశేష్యంబు ప్రధానం బితరం బప్రధానంబు

వ్యా. ప్రధానం బనగా ముఖ్యము. అప్రధానంబనా నముఖ్యము. విశేష్య విశేషణంబులలో ప్రాధాన్యము విశేష్యమునకే. ఇతరం బనగా విశేషణము.

సూ. ౭. ప్రధానంబు పశ్చాద్ వాచ్యం బగు.

అన్వయక్రమమునందు విశేషణములను ముందు చెప్పి కడపట విశేష్యమును జెప్పవలె ననుట.

వ్యా. ప్రాధాన్యము దేని కున్న దేమియు నన్నం జెప్పుచున్నాడు. 'ప్రధానంబు పశ్చాద్ వాచ్యం బగు' నని. ప్రధాన మేదో అది వెనుక చెప్పంబడగిన దగు నని యర్థము. విశేష్యము ప్రధానము గాన దానిని వెనుకం జెప్పవలె ననియు అప్రధానములు గాన విశేషణముల ముందు చెప్పవలెననియు నర్థము. ఎప్పుడనగా 'అన్వయ క్రమమునం' దనుచున్నాడు. అర్థము వివరించుపట్టున ననుట. పేరుప్పుడట్టిక్రమ మపేక్షితము కాదు 'ఏకవాక్యంబునం దొకానొకండు తక్క సర్వపదంబులు క్రమ నిరపేక్షంబునం బ్రయోగింపంజను' నని బాల. కార. ౩౭ సూ.

సూ. ౮. ఒక్కచో విశేషణంబులును విశేష్యంబు లగు.

ఉ. 'నారదుం డిట్లనియె' మొ॥

వ్యా. 3 వ సూ. ప్రకారము నారదుఁడు సంజ్ఞాప్రయుక్త విశేషణం బగును అది యిట నభిధావృత్తిచే విశేష్యంబునై యున్నది.

సూ. ౯. ఒక్కొకచో విశేష్య విశేషణంబులు వ్యత్యస్తంబులు నగు

ఉ. క. నీమాఁటు వల్లి త్రిభువన, భామారత్నంబు గంధవతి పై'

హరి. పూ. ౧ ఆ.

వ్యా. త్రిభువనభామారత్నంబైన నీ మాఁటువల్లి యని యన్వయక్రమము.

సూ. ౧౦. తెనుఁగునం గొన్ని శబ్దంబులు విశేష్య విశేషణంబు లుభయంబులు నగు.

కొన్ని యనఁగాఁ గీడు ప్రభృతులును నల్లాదులును.

వ్యా. కీడు ప్రభృతులును నల్లాదులును కొన్నియెడల విశేష్యంబులుగను గొన్ని యెడల విశేషణంబులుగను ప్రయోగ మందుచుండునని సూత్రార్థము. "తరువోజ. మీఁదు పరికింపకున్నఁ గీడ్వాటిల్లకున్నె" భార. స్త్రీ. ౧ ఆ; 'గీ. కృష్ణకృష్ణ యనం తయు కీడు లేదు, వీరిదస' లక్ష్మీ. ౪ ఆ. 'గీ. శాస్త్ర మాదిగఁగల యట్టి ధాతుచయము, కొలిమి నిడి యూఁదఁ గీడెల్లఁ దొలఁగునట్లు' మార్క. 3 ఆ. 'క. అది పాపము దానికి నా,మది చెప్పెదు వగతు విమలమానస యక్కీ,డు దొలంగునట్లుగా' భార. ఆశ్ర. ౧ ఆ—మున్నగు తావులం గీడు శబ్దము విశేష్యముగను 'నీకేమిట నమ్మహాధ్వరంబు కీ డంటి' భార. అశ్వ. ౪ ఆ. 'కీడె కురువంశమున కతని రాక' భార. ఉద్యో. 3 ఆ; 'వారల తలంపులు కీడు' భార. ఉద్యో. 3. ఆ;—మున్నగుచోట్ల నదే శబ్దము విశేషణముగను ప్రయోగములుంటను ము లకారులే శబ్దరత్నాకరమునం దెలిపి యున్నారు. నల్లాదులకును చూ. శ. ర.

సూ. ౧౧. విశేషణంబులు కొన్ని వ్యవహితంబులు నగు.

ఉ. 'క. ఈలోకంబున వెదకితి, మే ల్లెడఁ గాన వరుని.' నిర్వ. 3. ఆ.

వ్యా. మే లను విశేషణంబునకును వరుని యను విశేష్యంబునకును 'ఎల్లెడఁ గాన' యను పదంబులవలని వ్యవధానంబు గల్గియున్నది.

సూ. ౧౨. విశేషణంబులు గొన్నియెడ విశేష్యలక్షకంబు లగు.

ఉ. 'క. దేవతల కప్రియంబులు, గావించి మనుష్యు లధమగతు లగుదు రిలన్, గావున వారికి నిష్టము, గావింపుము నన్నుఁ బ్రీతిఁ గావుము తరుణీ! [అప్రియంబులు=అప్రియకార్యములను, ఇష్టము=ఇష్టకార్యములు.] భార. అర. ౨, ఆ. 'చ. పశుపతిప్రతిన్ సభఁ దపస్వినిఁ బాండవ ధర్మపత్నిఁ ద, గ్గరత నయోనిజన్ బ్రకృతి మానిని భామినిగాఁ దలంచి దు, ష్పరములు పల్కఁగాఁ దగునె.' (దుష్పరములు=దుష్పరపు మాటలను.) భార. సభా. 3 ఆ. 'వ. బెట్టిదంబులం గాని చక్కంబడఁడు' (బెట్టిదంబులన్ = బెట్టిదపు మాటలచేత) భార. అర. ౬ ఆ. మొ.

వ్యా. 8 వ సూత్రమున విశేషణ మభిధావృత్తిచే విశేష్య మగు నని చెప్పఁబడెను. ఇచ్చట లక్షణావృత్తిచే విశేష్యబోధక మగునని యర్థము చేయవలసియుండుటచేఁ బౌనరుక్త్యదోషము లేదు.

సూ. ౧౩. ఓ శబ్దం బొకచో సంబోధ్యవాచకంబునకు ముందితర శబ్దవ్యవహితం బయి కానంబడియెడి.

ఒక్కచో ననఁగా సంబోధ్యవాచకము క్రియాజన్య విశేషణపూర్వకం బగునపు డనియుఁ, ఇతర శబ్దంబనఁగా అక్రియాజన్య విశేషణమునకు సంబంధించిన పదమనియు నర్థము. ఉ. 'ఓ వినువీథి నున్న ఖచరోత్తములార' వీర. ౨. ఆ. 'ఓ తోయజనేత్రుఁ గాంచిన వసుధామణి' విజ. 3 ఆ.

వ్యా. 'ఓయామంత్రణంబునం దగు'ననియు 'ఇది సంబోధ్యవాచకంబునకు ముందే ప్రయోగింపంబడును' అనియుం బాల. తత్వ. సూ. ౧౭. 'ముందే' యను నవధారణముచే వెనుకఁ బ్రయోగింపఁబడదనియే కాక ముంగను అవ్యవహితమై ప్రయోగింపఁబడు ననునర్థమును స్ఫురించుచున్నది. అట్లు ఓ శబ్దంబు సంబోధ్యవాచకంబునకు ముందు అవ్యవహితముగ్నే బహుళ ప్రయోగములం గానవగుచున్నను వ్యవధానము గల్గు నెడలుం గలవనుచున్నాఁడు. తాదృక్ప్రయోగముల క్వాచిత్కతం దలఁపించుచున్నాఁడు 'ఒకచో' నని. 'ఒకచో' ననుటను వ్యాఖ్యానించుచున్నాఁడు 'సంబోధ్యవాచకము క్రియాజన్య విశేషణపూర్వకం బగు నపు'డని. 'ఇతరశబ్దం బనుటను వివరించుచున్నాఁడు ఆ 'విశేషణమునకు సంబంధించిన పద'మని.

సూ. ౧౮ రో శబ్దం బొండు సంబోధనంబున స్త్రీవాచకంబునకుఁ బరంబుగ నగు. అయ్యది హ్రస్వాంతంబును నయ్యెడి.

ఉ. 'చ. కమలపత్రాక్షిరో వినవుగా గల యొక్కటి గంటి వేఁడుకన్.' ప్రభా. ౧. ఆ. 'చ. రమణిరో భృత్యులందు నపరాధము గల్గిన నాయకుల్ స్వపక్షము దలపోసి యుగ్రతరశాసనముం దెగి చేయరు.' భాగ. ౮, స్కం. మో. (ఒకానొక యాధునిక గ్రంథమునందు 'అన్నరో, ఏనుంగురో.' అని ప్రయోగములు కానంబడుచున్నవి. వానికిఁ బ్రామాణిక ప్రయోగములు కానంబడవు).

వ్యా. సంబోధనంబున 'ఓ' శబ్దమే గాక రో శబ్దంబు నొండు గలదు. వీరు చెప్పు దీనివిశేషము లేవన నిది స్త్రీసంబోధనంబులందే ప్రయుక్తంబగు ననుటయుం, సంబోధ్యవాచకంబునకుం బరముగఁ బ్రయోగింపబడుననుటయుం. కాని రో శబ్దప్రయోగ మట్లు వ్యవస్థితము గాదు. అయ్యది స్త్రీ సంబోధనస్థలములందే గాక తదితర స్థలములందును ప్రయోగములం గానవచ్చుచుంటంబట్టి అథర్వణాచార్యులవారు 'అన్యత్రాపి క్వచిద్ రోస్యాద్ రూఢదేశ్య ప్రయోగతః' అని లక్షించిరి. ఆధునిక గ్రంథమని మూలకారుఁడిట నిరసించినది కూచిమంచి తిమ్మకవీంద్రుని యచ్చతెనుఁగురామాయణ మని స్పష్టమే. అరణ్యకాండము 25, 90 పద్యములలో నివి యగపడుచున్నవి. వీరికి శబ్ద. సూ. ౭౭లో ఏడే రేదేవి శబ్దంబు లర్థవిశేషణంబున దీర్ఘాంతంబు లగు' నంటకు 'ఏఁడీ నాబలుమాని

కంబుల కోటారు' అను నచ్చు. రామాయణ ప్రయోగము ప్రామాణిక మగుట ఎట్లో 'అన్నరో ఏమంగునో' అనుట కదే గ్రంథము ప్రామాణికము కాకపోవుట ఎట్లో దురూహ్యము. ఇవియుం నిట్టి ప్రయోగములును రంగనాథుని రామాయణమందుం గలవు. [చూ. యుద్ధ. కాం.] రంగనాథుని వీరు 'లాక్షణికుల్లైన దోష్టకవి' యని శ. ర. పీఠికలోఁ బ్రశంసించియున్నారు.

సూ. ౧౫. దేశ్యంబులం గొన్ని కొండల స్త్రీవాచక స్త్రీసమంబు లగు సంబోధ్యవాచక శబ్దంబులమీఁద నేకవచనంబునఁ గాన శబ్దం బొందును, అల యను నన్యాగమం బొందును గానంబడియెడి. అల దీర్ఘాంతంబు నగు.

ఉ. 'ఏ. గీ. భవ్యరతి దేవతాచార పరమపుణ్య. ధర్మసేమర కుండుమీ తల్లి కాన.' నై. ౭. ఆ. 'మ సామి కాన,' సా. ౧. ఆ. (కొం కవి 'పాపజాతి కాన' అని ప్రయోగించినాఁడు. అది విచార్యము. 'గీ. అక్కల కన్యకాత్వ మిటు లాఅడివోవ నకాంబులు సీ, కొక్క పె మాలు వచ్చె' నిర్వ. ౨. ఆ. 'చ. తోడితబడ నన్ములక్క. లని తూలుచు సీనక దోయి లొగ్గుచుక్.' ఆము ౨. ఆ. 'క. త్రిలసు వంద్రురి కెరుగఁడు దూలఁగఁ దలయూఁచు దొప్పదొప్పున నోరిం, గేల నడిచి తాను సలపుల, లాలలు దొరఁగంగ నన్నరాయుని యొఱలుక్' ఉ. హరి. ౪ ఆ.

వ్యా. సంబోధనంబులం గానవచ్చుచున్నవని యిటం జెప్పంబడిన 'కాన' 'అల'లు రెంటిలో 'కాన'కు అథర్వణాచార్యుల అభ్యుపగతి యిటం గలదు. 'క్వచి దామన్త్రణే కానో వైకృతాత్ పరతో మతః' అని వారి కారిక సూత్రమైన దేశ్యనామక సమితిరం బని చెప్పియుండిన మేలు. విలయనఁగా 'సామి' వైకృత మగు నేగాని దేశ్యము కాదు. 'అక్క+అల' 'అమ్మ+అల+అక్క+అల' అనుతాపుల స్త్రీవాచకంబులకు సంధిగల్గుట బాలవ్యాకరణమునందలి అత్సంధిసూత్రమునకు విరుద్ధము.

సూ. ౧౬. హ్రస్వావసానంబులు పరంబులగునపుడు లు ను వర్ణకంబుల యుత్వంబునకు లోపంబు వైకల్పికంబుగ నగు

ఉ. 'మ. విశదోల్కాశని పుంజ మొక్కొ యనఁగా విస్వధి నిక్షిప్త ప్రభూతి వాతాహతిఁ దూలి తూల శకలాకారంబులై వారిద, ప్రతతుల్ సొల్పడి నల్గడం జెదరఁగాఁ బాఱె న్మనోవేగుఁడై, పతగేంద్రుం డమృతాంతికంబునకుఁ దత్పాలుర్ భయం బందఁగన్.' భార. ఆది. ౨. ఆ. ఇట్లు 'భూసురోత్తముల్, భూపాలుర్.' మొ.

వ్యా. 'పదాంతంబులై యసంయుక్తంబు లయిన సుఁబురుల యంత్యంబునకు లోపంబు బహుళంబుగ నగు' నని సూరిగారు. ప్రక్రి. సూ. ౧౬ లోఁ దెలిపియున్నారు. ప్రకృత ప్రాచీనసూత్రోదాహృతము లగు 'ప్రతతుల్' 'పాలుర్' మున్నగునవియు నా 'బాల' సూత్రగోచరము లగుంగాన నీసూత్ర మక్కఱలేదు.

సూ. ౧౭ మహాత్సమూహార్థకశబ్దం బమహాత్కార్యయుక్తంబయ్యుఁ దద్విశేషణక్రియలు మహాత్కార్యయోగ్యంబులు విభాషనగు

ఉ. 'ఎ. గీ. ముని నికాయ మెల్ల, వివిధ పుణ్యకథలు వినువేడ్క నతనిఁ బూజించిరి.' భార. ఆది. ౧ ఆ. 'క. గీర్వాణప్రభుఁ డాదిగ, గీర్వాణ గణంబు కాలకేయులతోడన్, గర్వించి రణము చేసిర, ఖర్వపరాక్రములు కడిమిఁగసు నాసులై.' భార. అర. 3 ఆ. 'అయ్యిరు దెగలు పగఱ గా రే తమలోన్' నిర్వ. 3 ఆ. 'పడనడతురు గన్న నిన్నుఁ బ్రమథ గణంబుల్.' నిర్వ. ౪ ఆ. మొ. విభాష ననుటచే 'క. విషధర నుతి ననుంఖ్యము, నిషాదగణముండి ధారుణీప్రజకుఁ గడున్, విషమమును జేయువారి నిమిషమున భక్షించి చనుమమిత్రవిఘాతీ.' భార. ఆది. ౨ ఆ. 'సీ. నెత్తమ్ములే కొండ నెత్తమ్ములం దాడు విద్యాధరీకోటి విటులతోడ.' స్వా. ౪. ఆ. ఇత్యాదు లూహ్యంబులు.

వ్యా. మునినికాయ మనఁగా మునుల సమూహ మని యర్థము. ఈ సమూహము పురుషనిష్ఠ మగుటం జేసి పుంవాచకములకు రావలసిన విశేషణములును క్రియలును వచ్చునవి. రాఁగా 'మునినికాయము.....పూజించిరి.' ఇట్లే 'ఇరుతెగలు పగఱగా రే.' 'ప్రమథగణంబుల్ పడనడతురు' మొ. సూత్రమున విభాషను గ్రహించుటచే నట్టి పట్టుల క్రియలును విశేషణములు నమహాత్త్వ యుక్తంబు లయ్యు నుండునని

గ్రహింపవలెను. అందుల కుదాహరణములు 'నెత్తమ్ములాడు' నిషాదగణము...... చేయఁగ్' మొ.

సూ. ౧౭. జడపదంబుమీఁది తోడకు మెయి మైలు వికల్పంబుగ నగు

ఉ. 'అందఱుఁగూడి మోసలకు నర్థి మెయిం జనుదెంచి.' నిర్వ. ౨. ఆ. 'చ. ముక్తికి, న్సుఖకవహింపఁగా పలయుం మోహముఁ బోయఁగఁ ద్రోచి భక్తిమైన్.' లక్ష్మీ. ౪, ఆ. మొ.

వ్యా. 'కేచిత్ వైకృత శబ్దాస్య ర్విభక్త్యర్థాభిధాయకాః' యను కారికచే నిది యించు మించు ననువాదమే యని చెప్పనగు. 'శబ్దాః' అనఁగా అవ్యయము లని యర్థము. చేతార్థమునం జేసియు, కొఱకర్థమునం 'బొంటె' 'కొసము'లును, తోడార్థంబున మెయి మైలును ప్రయోగంబులం గాన నగుచున్నవి. వీనం 'జేసి బొంటె'లని ప్రౌఢకారుఁడు కారక పరిచ్ఛేదమునం జెప్పనున్నాఁడు. మెయిమైల నిటం జెప్పినాఁడు. చెప్పక విడిచినది 'కొసము'ను. అది మహాపమహాద్వాచకములందు సహితము గన్పట్టెడి.

సూ. ౧౮. కు వర్ణకంబు పరంబగునప్పుడు కవిత్రయంబు వారి ప్రయోగంబులం దక్కఁ దక్కిన మహాకవి ప్రయోగములందునుం గొన్నియెడల నగాగమంబు చూపట్టెడు.

ఉ. సీ. సంగరమునకు నుత్సవము కేఁగెదు క్రియ నొలసిన పని యెడు శూరులార.' ఉ. హరి. ౬ ఆ. 'ఉ. లాలనఁ గ్రొత్తబెబ్బులి కళాసము వెట్టిరి యాసనంబుగాఁ, గోలయుఁ సాధువైన యొక కోమటికిన్ నివహేంద్రుఁ బచ్చురన్.' నై. ౬ ఆ. 'ఆ. వెలఁది సోయగంబు వీక్షింప వినుతింపఁ, బోయి కన్ను లమరవిభుని కిచ్చి, రెండువేల జిహ్వ లండఱధీశ్వరు, కొసఁగఁ బోలుఁ బంకజోద్భవుండు.' విక్ర. ౪, ఆ. 'ఉ. బలవంతపుఁ జాపము వెచ్చుకొంటి వేలా నగుఁబాటు కొల్చి.' భో. ౫ ఆ. మొ. (ఇట్టి ప్రయోగములం బట్టి యాగమశాస్త్ర మనిత్య మగుట వలనఁ దక్కినచోట్ల నకారాగమము రాకుండినను దోషంబు లేద

నియమం, తత్సార్థదోష విస్ఫురణంబు కలుగక పువర్ణాంత శబ్దములమీఁద నకారాగమము వచ్చుట కేత త్సూత్రారంభ ప్రవృత్తియై యుండును గాన నచ్చోమాత్ర మయ్యది యత్యావశ్యకమనియుఁ దోఁచుచున్నయది.)

వ్యా. చిన్తామణికారుఁడు 'నఃకౌ' అని కువర్ణకము పరమగునపుడు ఉదన్తములకు నగాగమము వచ్చునని సూత్రించెను. ఇచటి యుదన్తము ఋదన్తములకుఁ గూడ నుపలక్షకము. ఇంక నథర్వణులు 'సర్వేషామేవ చోదన్త శబ్దానాం కౌపరే భవేత్, నః ప్రాయస్స్యాదృ ఋకారాచ్చ సర్వపండిత సమ్మతేః" అని నగాగమమును మధ్యమణి న్యాయంబున నుకారాన్త ఋకారాన్తములకు రెండింటికిని ప్రాయికముగ వచ్చునని చింతామణి సూత్రమును సవరించిరి. ఆ సవరణమునే ప్రౌఢవ్యాకర్త యిట ననువదించుచున్నాఁడు. అర్థస్ఫూర్తికి భంగము రాకుండునట్లు ఈ యాగమమును మానినను దోషము లేదని ఫలితార్థము.

సూ. ౨౦. కంటె వర్ణకము పరంబగునపుడును గొన్నియెడల నగాగమంబు చూపట్టెడి.

ఉ. 'తత్క్రతు శతంబునకంటె సుతుండు మేలు' భార. ఆది. ౪. అ. 'క. మనయింటి చేటు మాఁచితె, మనుమల సత్త్వముఁ దొలఁగు మైథిలినిఁ గూ, జనవాదంబు మహాత్ముల, యనఘు చరిత్రమునకంటె నధికం బగుటన్.' నిర్వ. ౯ ఆ. మొ.

వ్యా. ఉకారాన్త ఋకారాన్తములకు 'కు' వర్ణకము పరమగునపుడు నుగాగమము ప్రాయికముగఁ గల్గునని పూర్వసూత్రోక్తము. ఆ యుకార ఋకారాన్తంబులకే కంటె వర్ణకము పరమైనపుడును ఈ నుగాగమము కొన్నియెడలఁ జూపట్టుచున్నవని ఈ సూత్రమునఁ జెప్పుచున్నాఁడు. ప్రయోగ వైరళ్యముం దలఁపించుచున్నాఁడు కొన్ని యెడలనని.

సూ. ౨౧ ఉదంతములగు నదుపాత్తుల కండు వర్ణకము పరంబగునపుడును నగాగమంబు కొన్నియెడలఁ గానంబడియెడి

ఉ. 'చ. దేవ నీ, వనిమిష నాయకత్వమునయం దభిషిక్తుఁడవై ముదంబుతో, ననుఁ బనిగొమ్ము' భార. అర. ౫. ఆ. 'క. విను పిండదాన

సమయంబున యందును భక్తిపూర్వముగ దీనిఁ బఠించిన నయ్యన్నం బమృతము, నెనయఁ దురగమేధఫలము నిచ్చుఁ గృతార్థ్యు.' హరి. పూ. ౨ ఆ. 'సీ. సంతరించితి నిందు జవ్వనంబునయందు సార్థ ప్రబంధ కావ్య మాంధ్రభాష.' కాశీ. ౧ ఆ. 'క. జననాథ నన్ను నడుగఁగఁ, జనుదెంచిన కార్యమేను సర్వంబు మనంబునయందు మున్నె యెఱుఁగుదు, విను చెప్పెద నీకుఁ దగునె విడువఁగ భార్యన్' మార్క. ౫ ఆ. 'ఉ. దక్కఁగ వ్రాసితిన్ మును పటమ్మునయందు సుశిల్పసాహసముల్.' పాండు. ౫ ఆ. మొ.

వ్యా. 'ఆగమ ముపవర్ణంబుల కందు వర్ణకము పరం బగునపుడు నుగాగమం బగు' నని బాల. తత్స. సూ. 30. మఱి యిట విశేష మేమనఁగా నుగాగమ మనక నగాగమ మనుటయుం ఆగమ న వర్ణముతో 'అందు' వర్ణకము సంధి గలియక యడాగమము వచ్చెనని చూపుటయును. ఇట్టి రూపములకై యిట్లు వేఱుసూత్రము వ్రాయ నక్కఱ లేదని యెంచి సూరిగారు 'సమాసంబునయందు ద్రుతంబునకు లోపంబగు' ననుసంధి ౨౮ సూత్రమందలి 'సమాసంబునయం' దను ప్రయోగమునే దీనికి జ్ఞాపకముగఁ గూర్చిరి. ఇట్లు చేయుటవలని లాభ మేమనఁగా 'జ్ఞాపక సిద్ధం న సర్వత్ర' అని యున్నది గాన నిట్టి ప్రయోగములు క్వాచిత్కము లని గ్రహింపఁబడియుండును.

సూ. ౨౨. తెనుఁగునం గొన్ని తత్సమదేశ్య శబ్దముల కంటు బహుళంబుగ నేకవచనంబున నీచత్వద్యోతకంబయి యుగా యను నొక్క శబ్దంబును దానిపై డు వర్ణకాదులును జూపట్టెడి. సంబోధనంబున డువర్ణకంబు చూపట్టదు. తుది దీర్ఘంబునకు హ్రస్వంబు వైకల్పికము

ఉ. ప్ర. బాలిగాఁడు, చిట్టిగాఁడు; సం. ప్ర. బాలిగా, బాలిగ; చిట్టిగా, చిట్టిగ; బాలిగానిన్, బాలిగానిచేతన్, అని తక్కిన విభక్తులూహ్యంబులు. ఇట్లు గోపాలిగాఁడు మొ.

వ్యా. 'అర్థభేదే క్వచిచ్ఛబ్దా దిగా స్యాచ్చ తతోఽపి డుట్, నామన్త్రణే డుజ్ హ్రస్వస్స్యాత్ బహులా త్వత్ర నేష్యతే' యను కారిక సూత్ర మనువాదము.

సూ. ౨౩. ద్విత్వయుక్తలాంతంబుమీఁది లు ల నులు రుర లాదేశంబు లగు.

ఉ. 'మ. అరరే యల్లియ రామరాజు పెద తిమ్మాధీశు బాహా భయం, కర కౌక్షేయక ధారఁ బోరుసఁ గడంకం ద్రెళ్ళ వీరారి మల్ల రకుల్ మట్టియగుం దదీయ బలధూళుల్ సంగడాలై వియు, చ్ఛర కాంతా స్తనపాళి విగ్గరిడి నాశ్చర్యంబు చర్చింపఁగన్.' రామా. ౧ ఆ. మొ.

వ్యా. 'అదంతంబయి దీర్ఘ పూర్వ లోపధంబయిన మహత్తుమీఁది విభక్తి లకారంబునకు రేఫం బగు'నని బాల. తత్స. సూ. ౩౮. రేఫాదేశంబు విభక్తి లకారంబునకు దీర్ఘ పూర్వలోపధంబయిన మహత్తుమీఁది దానికేకాక ద్విత్వయుక్తలాంతంబు మీఁది దానికిని వచ్చునని ఇటం బూరింపఁబడినది. ఉ. మల్లురకుల్.

సూ. ౨౪. విధా శబ్దంబు సంస్కృతంబునం బుంలింగంబు నగు.

ఉ. 'విధో విధానే హస్త్యన్నే ప్రకారే వేతసేఽపి చ.' అని పుంలింగంబులందు అజయుఁడు. దీనికిఁ దత్సమంబునం బుంలింగరూపము తోనే ప్రయోగముగాని స్త్రీలింగరూపముతో లేదు. దంష్ట్రా శబ్దంబును బుంలింగముగాను గానంబడియెడి.

వ్యా. 'విధాశబ్దమునకుఁ గ్లీబతుల్యత్వంబు నిత్యంబు—విధము' అని బాల. తత్స. ౬౬ వ సూత్రవృత్తిలో సూరిగారు. కంఠరాదులుగం బఠితములెల్ల సంస్కృతంబున స్త్రీలింగములే యని సూరిగారు తలంచియుందురని తోవలయు నిట ప్రౌఢకారుఁడు విధాదంష్ట్రా శబ్దంబులు నిఘంటువులం బుంలింగములుగాను పఠితములై యున్నవను చున్నారు. క్లీబతుల్యత్వం బనిదేశించుటం జేసి కంధరము మున్నగు వ్యంతరూపంబులును, బహుళగ్రహణము చేఁ బక్షంబున స్త్రీలింగంబులకు విహితమగు ప్రథమైకవచన లోపముగల్గి కందర నాసిక-ఇత్యాద్యదంత రూపంబులును సూరిసూత్రముఁబడి ఏర్పడ వలసియుండును. విధాదంష్ట్రాశబ్దములం బుంలింగములుగను గొను నెడల క్లీబతుల్యత్వంబు గల్గినప్పుడు స్త్రీలింగములకు విహితంబగు ప్రథమైకవచన లోపమునకు ప్రాప్తిలేక

పోవును. అట్లగుట ఆంధ్రమహాకవి ప్రయోగములకు విరుద్ధమగుటంగాన బాలవ్యాకర్త అజరాది నిఘంటువుల నీ విషయమున నుపేక్షించెనని యెంచనగును.

సూ. ౨౪ అర్ఘాదులకడ యచ్చున కుత్వంబును మీఁద వు వర్ణకంబును వైకల్పికంబుగా నగు.

ఉ. అర్ఘువు, అర్ఘము; ధర్మువు, ధర్మము; వర్గువు వర్గము. 'చ. అవని యరాజకం బయిన యప్పుడు భూప్రజలందు సర్వపుర్షార్థములు దొలంగు దేవ ముని ముఖ్యులు వారుందు రోలి వృష్టిలే, దవు మఱి యర్ఘువుల్ దఱుఁగు నందురు, కావున గాలయాపనం, బవిశథవాక్య చేయక రయంబున రాజ్యము నిల్పు మిత్తఱిన్.' భార. ఆది. ౮ ఆ. వర్గువునందలి వువర్ణకం బొండె లోపించు. ఉ. వర్గు.

వ్యా. పుంలింగ మహద్వాచకనామంబుల తుది యుత్వంబునకును హలంతముల కును ఉత్వము తత్స. సూ. ౨౧—౨౩ లచే బాలవ్యాకరణమున విహితము. అర్ఘాదులు హలంతంబులును మహద్వాచకములును కామింజేసి బాలవ్యాకరణముచే వీనికి ఉత్వ వువర్ణకముల ప్రాప్తిలేదు. కావున నిట అది చెప్పఁబడినది. వర్గశబ్దమునకు మాత్రము ఉత్వము గల్గియు వువర్ణకము వైకల్పిక మని 'వర్గు' అని యుదహరించినాఁడు. కడమ వానికి ఉత్వముగల్గునెడ వువర్ణకము నిత్యమని గ్రాహ్యము. ఉత్వమే ప్రకృతిగాను గాన నది గల్గినప్పుడు అమహదదంతముల కన్నిటికి నెట్లో అట్లు వీనికిని మువర్ణకము గల్గును. అర్ఘము మొ.

సూ. ౨౫ రాహుబాహు శబ్దముల కంతట వు వర్ణక లోపంబు వైకల్పి కంబు.

ఉ. రాహువు, రాహు; రాహువులు, రాహులు; బాహువు, బాహు; బాహువులు, బాహులు - ఇత్యాదులు. 'సీ. అసమాను మై యున్న యంబరమున, విద్యుత్సహస్రముల్ విలసిల్లుచుండె రాహుపర్వంబు గాకయుం భానుఁ గప్పె.' భార. సభా. ౨ ఆ. 'తే. అగ్గలించి నా యెదుర బాహాస్ఫాలించి, కడవఁజాలిన మల్లురఁ గాన నెందు' భార. విరా. ౨ ఆ. మొ.

వ్యా. బాలవ్యాకరణమున ఊకారాంతములకు వువర్ణకేతర విభక్తి పరమగుచో వుగాగమము బహుళముగ విహితము. అట్లు ద్వితీయాదులందు వచ్చు నాగమ వుక్కు బహుళమే కాని వానిక ప్రథమయందువచ్చు వు ప్రత్యయమే మో నిత్యమేయని' ఊకారాంత గోశబ్దంబుల కంతట వువర్ణకం బగు' నని బాల. తత్స. సూ. ౪౦ చే స్పష్టము. రాహుబాహుశబ్దములకుమాత్రము వు ప్రత్యయాంతప్రయోగములందు నిత్యముగఁ గాక వైకల్పికముగఁ గానవచ్చుటంజేసి ప్రౌఢకారు డిట నిట్లు సూత్రించె.

సూ. ౨౭. విశ్వకర్ముఁడనియు రూపంబు

ఉ. 'సీ. విశ్వకర్ముని కూఁతు విశదలావణ్య సముజ్జ్వలఁ జేకొని మురిఁబోయి.' హరి. ఉ. ౪ ఆ.

వ్యా. 'విశ్వకర్మాదులకు స్త్రీత్వం బగు' నని బాల. తత్స. సూ. ౭౫. 'స్త్రీలింగత్వాతిదేశంబుచేత నత్వ డుజ్ఞులులేవని యెఱుంగున' దని సూరిగారిదే వృత్తి. డుజ్ఞు గల్గిన రూప మిట చూపఁబడుచున్నది.

సూ. ౨౮. దేశ్యమునం దక్కడాదులు నిత్యైకవచనాంతములు.

ఉ. అక్కడ, ఇక్కడ, ఎక్కడ; అచ్చట, ఇచ్చట, ఎచ్చట - మొ. అదిశబ్దము చేత ఇరులు, కేలు మొ - కొందఱు ఇరులు కేలు శబ్దములు బహువచనాంతము లందురు. అట్లు కాదు. 'ఇరులున నొంటిఁబోఁ బాసలి నెట్టిపోట్లు.' విక్ర. ప్రా. 'కలభాషిణి వేనలి యొక కేలఁబట్టి పే ర్వాక్క కేల నొఱ గట్టి నిలిచి.' కళా. ౩ ఆ. 'సీ. ఉపధాన విని మయుం బొందొండ చూపుటఁ జెఱికేలు లబిలఁకువఁ బ్రిదిలి బిగియ.' కవిక. ౪ ఆ.

వ్యా. ఈ సూత్రమునందలి 'నిత్యైకవచనాంతము' లనునది ౩౩ వ సూత్రము దనుక ప్రతిసూత్రమునను అనువర్తించును. ఈ యారుసూత్రంబులచే నిత్యైకవచనాంతములం జేర్కొనె నని తెలియవలెను. ల్వంతములగు నిరులు కేల్వాదులకు ప్రదర్శిత ప్రయోగముల నవగ్రహైకవచనైకార్థ్యంబులు గల్గియుంటచే నవ్వాని బహువచనాంతములుగ భ్రమయరాదని సూత్రకృద్ధృదయము.

సూ. ౨౯. సస్యవాచక శబ్దములును.

ఉ. అరుగ, చోడి, వరి, కంది, పెసర, మినుము మొ.

వ్యా. సస్యవాచకములనం బైరులం దెల్పునవి. అరు గాదులును నిత్యైక వచనాంతములు.

సూ. 30. కతిపయసంభారవాచక శబ్దములును.

ఉ. ఆముదము, ఇంగువ, ఉప్పు, చింతపండు, చమురు, పసుపు మొ॥

వ్యా. సంభారవాచకము లనం బదార్థసంచయముం దెల్పునవి, అవియు నిత్యైక వచనాంతములే.

సూ 3౧. లోహావాచక శబ్దములును.

ఉ. ఇత్తడి, ఇనుము, కంచు, బంగారు, వెండి. మొ॥

వ్యా. స్పష్టము—ఇవియు నిత్యైకవచనాంతములే.

సూ. 3౨. సమానార్థకములయిన యీడు డెన సరి సాటి లోనగు దేశ్య విశేషణ శబ్దములును.

ఉ. 'క. స్వరములు సురములు శిరములుం, గరములుం బెండ్లి డలు మెడలుం గన్నులు వెన్నులె, సురుచిర పదములు రదములు, నిరుపురసుం జూడ నొక్క యీడై యుండికిఁ.' రా. కిష్కిం. 'క. పతిం బడసి సుతులం బడయంగ, నతివలు గోరుదురు కోరినట్టులతనరుక్, బలిః బడసి సుతులం బడసెను, సుతు లీ భార్గవికి భాగ్యసంపద సెనయె.' భార. ఆది 3 ఆ. 'క. సురపతి యమ వరుణ ధనేశ్వర కమలాసనుల దివ్య సభలెల్ల నరేశ్వర చూచితి నవి దీనికి, సరిగా వత్యంత విభవ సౌందర్యములఁ.' భార. సభా. ౧ ఆ. 'ఉ. హేమ ధరాధరేంద్రమున కెంతయుం బెద్ద ధృతిక్ భుజంగమ, స్వామికి మేలు చేయు పటు వాగ్ విభవంబున బుద్ధి సంపదం, దామరచూలికిఁ సరి ప్రధానులు తక్కినవారు సాటియే,

మామిడి వీరభద్రున కసమాస్త్రశిఖామణికి వసుంధరా.' వై. ౧ ఆ. ము. 'సరులేని దృక్ ఖంజన శాబకములు' అని యొకచోటఁ బ్రయోగము కానంబడుచున్నది. అది శబ్దాలంకార తత్పరత్వమునఁ బ్రౌఢముగాఁ జెప్పఁబడినదని గ్రహింపవలయును.

వ్యా. 'ఈడు, ఎన, సరి, సాటి' లోనగువాని నొక్కొక్కదానికిని 'సమాన' మని యర్థము గాన వీనినెల్ల సమానార్థకము లన్నాఁడు. ఇవి యన్నియు నిత్యైకవచనాంతము లనుట సూత్రార్థము. వీనికివి విశేషణములో అవియు సర్వానిక్రియలును బహుత్వయుతము లైనప్పుడును ఇవి లుపస్థకముం బొరయవనుట. 'సరు' లను నొక్క ప్రయోగము కన్నను, దానిని ప్రౌఢప్రయోగముగ ననుసార్యముగ గొనవలెనను చున్నాఁడు.

సూ. ౩౩. గుణవాచకములైన దేశ్య విశేషణ శబ్దములును.

ఉ. ఈ రాళ్లు తెలుపు, ఆ రాళ్లు నలుపు; ఈపండ్లు తీపు ఆపండ్లు పులుసు. మొ.

వ్యా. గుణ మనంగా నిరూపకధర్మము, రంగు మొదలగునది. దానికి వాచకము లనంగా తీపు పులుసు మొ. గుణవాచకములు (దేశ్యములు) విశేషణములైనప్పుడు, విశేష్యములు రాళ్లు పండ్లు మొదలగునవి బహుత్వమం దున్నను, ఈ విశేషణములు బహువచన లుపస్థకంబుం బొరయకయుండు నవియనునది.

సూ. ౩౪. కొన్ని యవ్యయంబులు బహువచనాంత తుల్యంబులు నగు.

ఉ. అట్టు, అట్లు, ఇట్టు, ఇట్లు. ఎట్టు, ఎట్లు, నిచ్చ, నిచ్చలు మొదలగునవి.

వ్యా. అట్టు, ఇట్టు మున్నగునవి బహువచనాంతములతోఁ దుల్యము లగు నను చున్నాఁడు. తుల్యత ఎట్లన్న లుపస్థయోగముం బొంది అట్లు ఇట్లు మున్నగు రూపము లేర్పడుటచేతనే బహువచనాంతము లగు ననక తత్తుల్యము లగుననుటచే అవ్యయత్వ హాని పరిహరింపఁబడినది.

సూ. ౩౫. అందఱ్వాదులు నిత్యబహువచనాంతములు.

ఉ. అందఱు, ఇందఱు, ఎందఱు, కొందఱు, పెక్కండ్రు, పలుగుండ్రు.

వ్యా. ఇంక నాలుగు సూత్రములచే నిత్య బహువచనాంతములం జెప్పుచున్నాఁడు. ఉదాహృతముల విభజించిన అంత + వారు, ఇంత + వారు — ఇత్యాదిగా నేర్పడును. కావున అందఱ్వాదులయందలి రేఫము బహుత్వద్యోతకము గుని స్పష్టము. ప్రథమైకవచన ప్రత్యయయోగము తోడి రూపములు వీనికి లేవని సూత్రార్థము.

సూ. ౩౬. అదరులు లోనగు శబ్దములును

ఉ. అదరులు, అఱువుళ్లు, ఎండువులు, మిడుఁగుఱులు మొ. ఇవి వృత్తియం దేకవచనాంతంబుల యగు. ఉ. అదరుటగ్గ. మొ.

వ్యా. అదరులు మొదలైన శబ్దములును నిత్యబహువచనాంతములే. బహువచనాంత నిత్యత వీనికి వ్యస్తములుగ నున్నప్పుడే. వృత్తియందు=సమాసమునందు అన్నచో ఇవి ఏకవచనాంతములే యగుననుట కుదాహరణము అదరుటగ్గ మొ.

సూ. ౩౭ తఱచుగ ధాన్యవాచక శబ్దములును.

ఉ. అళ్లు, చోళ్లు, వడ్లు, కందులు, పెసలు, మినుములు. మొ. తఱచుగ ననుటచే బియ్యము జీలకఱ్ఱ ఇవి ధాన్యవాచకము లయ్యు నిత్యైకవచనాంతములే యని గ్రహింపవలయును.

వ్యా. ధాన్యవాచకశబ్దములు తఱచుగ నిత్య బహువచనాంతము లగును. 'తఱచుగ' ననుట ఏలయన 'బియ్యము జీలకఱ్ఱ మున్నగు నిత్యైకవచనాంతములు గొన్ని యుండుటచేత.

సూ. ౩౮. క్రీడావిశేష వాచకశబ్దములును.

ఉ. అచ్చనగాయలు, ఓమనగుంటలు, కనుమూసిగంతలు, గుజ్జనగూళ్లు, బొమ్మపెండ్లిండ్లు, ఉప్పునంబట్టెలు, కుప్పిగంతులు, గొబ్బిళ్లు, దాఁగిలిమ్రుచ్చులు, పుట్టుచెండ్లు, బిల్లిగోళ్లు, సరిబేసులు మొ. ఒకా

కవి యిందుఁ గొన్నిటి నేకవచనాంతములుగాఁ బఠించియున్నాఁడు. అది విచార్యము.

వ్యా. క్రీడావిశేషవాచకము లన నాటలం దెలుపు పదములు అచ్చనగాయలు మొ. అవియును నిత్యబహువచనాంతములే. దానం గొన్నిటి నేకవచనాంతములుగా నెవఁడో ఒక్కకవి పఠించియున్నందున, అంతమాత్రమున నది గ్రాహ్యము కాదనుచున్నాఁడు:—'విచార్య' మని.

సూ. ౩౯. తఱచుగా స్త్రీసమంబులగు దేశ్యశబ్దంబులకుఁ గడపలఁ గొన్నింటికి నేకవచనంబునం బూజ్యతయందు గారు శబ్దం బగు.

ఉ. అయ్యగారు, అమ్మగారు, తల్లిగారు, తండ్రిగారు, రాజుగారు, రాణిగారు, సెట్టిగారు, నాయఁడుగారు, దేవిగారు. మొ. 'చ. సుమ్ముగా, రనుటయు కాని మా దశరథావనిభర్తకు మీకు భేదమే.' ఉదా. ౫ ఆ. మొ. (నాయఁడుగారు దేవిగారు వీనికిఁ దఱచు శబ్దంబు శరణము.)

వ్యా. ఉదాహృతములలో 'రాజు' తత్సమంబును 'రాణి' తద్భవంబునుం గాన సూత్రమందలి 'దేశ్య' యును విశేషణమును దేశ్యేతరంబులకు నుపలక్షకంబుగాఁ గొనవలెను. 'గారు'ను స్త్రీసమములకు సూత్రము విధించి యుదాహరణములలో అస్త్రీసమము లగు 'నాయఁ'డను డుజంతమును దేవి యను స్త్రీవాచకమునుం జేర్చినాఁడు. వానికి శరణము 'తఱచు శబ్దం' బనుచున్నాఁడు. తఱచు శబ్దంబును 'బహుళ' మను నాద్య వ్యాకరణ ప్రసిద్ధ శబ్దార్థంబునం బ్రయోగించిరని యెఱుఁగవలయును. అప్పుడు ప్రవృత్త్యప్రవృత్తు లేకాక అన్యథాభావమును సావకాశము లగును.

సూ. ౪౦. ద్వితీయాదులందు రు రి యగు.

ద్వితీయాది విభక్తులయందు గారు శబ్దమందలి రువర్ణము రివర్ణ మగు నని యర్థము. ఉ. అయ్యగారిన్, అయ్యగారితోన్ అయ్యగారికిన్ మొ.

వ్యా. పూర్వసూత్రమునుండి 'గారుశబ్దము' అనున దిట ననువర్తించును. ద్వితీయాదులం దనఁగా ప్రథమేతరవిభక్తు లాఱిటియందు నని యర్థము. అనఁగా నాప్రత్యయం

బులు పరంబులగునపుడు 'గారు' నందలి రకారాశ్రితమగు నుత్వంబున కిత్వంబు వచ్చును. దానినే వివరించుచున్నాఁడు 'రువర్ణము రివర్ణ మగు' నని. ఉదాహరించుచున్నాఁడు 'అయ్యగారి' న్నిత్యాదుల.

సూ. ౪౧ డుమంతంబులగు తత్సమాది శబ్దంబులకుం గొన్నింటికి ద్వితీయా బహువచనంబుమీఁదం బూజ్యత యందు గారునకు మాఱుగ వారగు

ఉ. శ్రీరాములవారు, వసిష్ఠులవారు, వ్యాసులవారు, స్వాములవారు మొ. శ్రీరాములవారికి, శ్రీరాములవారితోడ ఇత్యాదు లూహ్యంబులు.

వ్యా. ఇట నుదాహృతము లెల్ల నాభాస మిశ్రితత్సమములు. 'స్వాములవా'రను నుదాహరణమును బట్టి సూత్రమందలి 'డుమంతంబులగు' అనుదానిని డుమంతేతరములకు నుపలక్షణముగాఁ గొనవలయును.

సూ. ౪౨. అర్థవిశేషంబునం దేశ్యంబులగు గొన్ని శబ్దములకు మీఁద వారు చూపట్టెడు.

ఉ. అయ్యవారు (ఉపాధ్యాయుఁడు, పూజ్యుఁడగు బ్రాహ్మణుఁడు అట్టి వేలుపు). అమ్మవారు (స్త్రీదేవత, పూజ్యయగు బ్రాహ్మణ స్త్రీ.) 'ఎ. గీ. చిత్ర మిది యయ్యవారి సంసేవ వేళ, నమ్మవా రగ్గలించిరో యనుచు నడిగె.' కళా. ౫ ఆ. దేవరవారు (పూజ్యులగు మీరు.)

వ్యా. అయ్య అమ్మ యను లేకవచనాంతము లయ్యును వానికిం బరముగ నర్థవిశేష సిద్ధికై=అసాధారణార్థము గల్గుటకై 'వారు' ప్రయుక్తమగును. అయ్యవారు అమ్మవారు అనుటలకు ఉపాధ్యాయుఁడు స్త్రీదేవత యనునవి యసాధారణార్థములు; పూజ్యయగు స్త్రీ పూజ్యుఁడగు బ్రాహ్మణు డిత్యాది పట్టుల నర్థవిశేషము పూజ్యత. పూజ్యులగు మీరనుచోటఁ 'బూజ్యులరగు' అని రామి. బా. ల. సూ 33 లోని ప్రయోగ ప్రమాణముచే రక్షితము.

ప్రశ్నార్థము సిద్ధింప 'నట్టు' చేర్పఁబడినది. చూచినట్టున్న=చూచినట్టా. ఇట్లర్థ విశేషంబునం గ్రియల కనుప్రయుక్తము లగు నట్టాదులకు (అది శబ్దముచే అయ్య అన్నాదులు గ్రాహ్యములు) బహుత్వంబు గల్గదు.

సూ. ౪౫. పూజ్యతాతిశయంబున యుష్మదర్థబహువచనంబునకు మాఱుగా నాత్మార్థబహువచనంబు ప్రయుక్తంబగు.

ఉ. స్వామీ తాము దయ చేయవలెను. మొ.

వ్యా. పూజ్యతయందు 'మీరు'. పూజ్యతాతిశయంబున 'తాము' సూ. ౭౪ చే. 'తమరు' 'తారు' అనియుం బ్రయోగింపనగు.

సూ. ౪౬. సంబంధంబున యుష్మదస్మచ్ఛబ్దంబులకుం గొన్నియెడల బహుత్వంబగు

ఉ. మీ యిల్లు, మా యిల్లు. మొ. 'మా యత్త పృథ్వీ సమాన పృథాదేవి.' భార. అర. ౫ ఆ.

వ్యా. నీయిల్లు నాయిల్లు—అని ఏకవచనాంతములుగనే యున్నచో నింటికి సంబంధివి నీవే యని నేనే యని, నీతో నీయింటిపనియును నాతో నాయింటిపనియును సరి యను నమంగళార్థము గల్గును. దానిం దొలంప నీ బహుత్వంబని యూహ్యము.

సూ. ౪౭. కిమేకార్థకశబ్దంబులు క్రమంబున సజ్ఞాతవస్తూద్దేశ్య ప్రశ్నము నందును, నిర్దిష్ట స్త్రీపురుషాన్యతర ప్రశ్నమునందును, నిర్దిష్ట స్త్రీపురుషాన్యతర గ్రహణము నందును, అనిర్దిష్ట స్త్రీపురుషోద్దేశ్య వ్యవహారమునందును దఱుచుగ బహువచనాంతంబు లగు

ఉ. ఎవరక్కడ; 'సీతారాము లిద్దఱిలో నెవరు మిక్కిలి కరుణ గలవారు; ఈ స్త్రీపురుషు లిద్దఱిలో దీని నొకరికిమ్ము; ఒకరుపోయిన త్రోవ నొకరు పోరు, వారొక్కరే వచ్చిరి, ఇత్యాదులు గ్రాహ్యములు. తఱచుగ ననుటచే సీతారాము లిద్దఱిలో సీత మిక్కిలి కరుణ గలదా? రాముఁడు మిక్కిలి కరుణగలవాఁడా? అని ఇత్యాది రూప

ముగా వాక్యమును వ్యాసముచేసియుఁ జెప్పవగు నని తెలియవలయును. ['నీ వెవ్వ రిత్యాదివిశేష ప్రయోగంబులుం గలవు. 'క. నీ వెవ్వ రేమి పనికై, యీ పలనికిఁ బోవు చునికి యిది.' భార. విరా. ౧ ఆ. 'చ. నీవు మునిసత్తమ యెవ్వఁడ వెట్టి లేను నీ, తనయుండ నైతి మ జ్జనని తా నది యెవ్వరు' మార్క. ౫ ఆ. 'ఉ. వారలఁజూచి పల్కె రఘువర్యుఁడు మీరెట జాతకర్మ సంస్కారము లెవ్వ రుక్తవిధిఁ జల్పి రొగిన్ ధను రాది శాస్త్ర విద్యారతు లెట్టి రెవ్వరి కతంబున నీ గతి యుద్ధచాతురిన్, జేరుచు నొంటి రెవ్వ రవనిం బలిదండ్రుల పేరు నావుడున్.' జై. ౬ ఆ. 'ఆ బ్రహ్మచారిం జూచి యో యయ్య మీ రెవ్వ రని యడిగి.' పర. ౩ ఆ. 'నామము నేమువర్తుఁడన్' జై. ౧ ఆ. కొన్నియెడల నెవ్వ రనిపూర్వకంబులు కానంబడియెడి 'సీ. అది యెవ్వరని ప్రతీ హారు లెవ్వరు నన్నుఁ దమ్ముఁగా బలఁచి చిత్తమున నులుకు.' నై. ౩ ఆ. 'అది యెవ్వరే పిలిచెదరు న న్నది యేమొ యూరసివచ్చెద నంచు నురిఁగ నొకతె.' కళా. ౭ ఆ. మొ.]

వ్యా. ఎవఁడు ఎవతె మొ. నిమర్థక శబ్దములు. ఒకఁడు ఒకతె మొ. విశార్థక శబ్దములు. ఎఱుఁగఁబడని వస్తువులంగూర్చిన ప్రశ్నమందును, నిర్దేశింపఁబడిన స్త్రీ పురుషులలో నొకరింగూర్చిన ప్రశ్నమందును నిమర్థక శబ్దంబు తెలుచుగ బహువచనాంత మగును. ఉదా. ఎవ రగ్రుఁడు. సీతారాము లిద్దఱిలో నెవరు కరుణగలరు. మొ. నిర్దేశింపఁబడిన స్త్రీ పురుషులలో నొకరికి గ్రాహ్యము గల్గవలసివచ్చినప్పుడును నిర్దేశింపఁబడని స్త్రీ పురుషులంగూర్చి చెప్పునప్పుడును విశార్థకశబ్దము తెలుచుగ బహువచనాంత మగును. ఉదా. ఆ స్త్రీపురుషు లిద్దఱిలో దీని నొకరికిమ్ము; ఒకరుపోయిన త్రోవ నొకరు పోరు. మొ. నీ వెవ్వ రిత్యాదులు విశేష ప్రయోగంబు లనుచు న్నాఁడు.

సూ. ౭౮. దేశ్యంబునం గొన్నియెడల మహాస్వహాత్రర్థక బహువచనాంత నామంబులపై నుగల బహువచనప్రత్యయంబులు చూపట్టెడు. అచ్చో వారు నీరు మీరు శబ్దంబుల యంత్యరేఫాకారంబున కకారంబగు.

కంబున నాయితం బయిన కజ్జము భోజనశాలలోనఁ బ్రశ్యంబిడి నారు
పంకజదళాక్షులు రెండవజాము గంట ప్రేయంబడె నారగింప సమయం
బని చెప్పెర విన్నవించిరి.’ కాశీ. ౫ ఆ. ‘ఎ, గీ. తరుణ ధావన ధగ
ధగ ద్దళన మణుల, హత్తు కొల్పిరి శ్వేత వీద్యముల డాలు, పర్వదిన
ముల బాహర ప్రమదలుచిత, నియమ సంభావ నారంభ నిభృత బుద్ధి.’
పాండు. 3 ఆ. పెం.

వ్యా. ‘ఇయయు మాలుగా నామాంతంబున కత్వంబు బహుళంబుగా నగు’
నను బాల. ఆచ్చి. సూ. ౫3 క్రింది వృత్తిలో ‘ఇయ శబ్దంబునం దికారలోపంబు
కొందఱు వక్కాణించిరి—అయ్యది ప్రయోగంబులందు మృగ్యంబు—ముత్తియ
శబ్దంబునందు మాత్ర మిత్వలోపంబు గానంబడియెడి—ముత్తియము—ముత్తెము—
ముత్యము’ అని సూరిగారు తెలిపియున్నారు. ముత్తియ శబ్దమున కేకాక కన్నియ
దివ్వియ కళ్లియ పళ్లియ వీడియ శబ్దములకును ఇత్వలోపంబును ప్రయోగములం జూపు
చున్నాఁడు ప్రౌఢవ్యాకర్త. కన్నియశబ్దము కొన్నియర్థములఁ దత్సమము, మఱి
కొన్నిట నాచ్ఛికము. వీరే శబ్దరత్నాకరమున నిట్లు సెలవిచ్చియున్నారు “కన్య—
ఉత్త. వై. విం. ప్రోక్త *‘నెయ్యపుఁ గన్యకల నన వాలుఁ దూపుల జయించి’ (రామా
యణార్థమందు ‘నెయ్యపుఁ గన్యకల వన వాలుఁ దూపుల ననియుం, భారతార్థమందు
‘నెయ్యపుఁ గన్యకలఁ నన వాలుఁ దూపుల ననియుఁ జేదము) రాఘ. ౧ ఆ. (ఇక్కడ
రామాయణార్థమునందు సహితము కన్య యను శబ్దమును తత్సమముగానే చెప్పి యర్థ
మును పరిపఱుపవచ్చునని కొందఱు చెప్పుదురు. కన్యాశబ్దము వికృతిని జెందినప్పుడే
ఉత్త యను నర్థము గలిగి తెనుఁగు ప్రయోగములందు సాధారణముగా వాడఁబడు
చున్నది. సంస్కృతమునం దాయర్థము కలిగి వాడఁబడునట్లు కానము. సంస్కృతము
నందు లేని యర్థములు వికృతియందుఁ గలుగుట సహజము” అని. ఈ ప్రపంచమందుఁ
గని తెలియుం దనిరో ఈసూత్రవృత్తియందు ‘చూ. శబ్దరత్నాకర’ మనుట.

సూ. ౫౦. ఎద్దు దేవర శబ్దములకు లుల-లు పరంబు లగునపుడు దకారంబు
నకు డకారంబును దకారంబు నుత్వంబునకు లోపంబును వికల్పముగాను, రేఫమునకు ళకారమును ళకారంబు నత్వంబునకు లోపంబును నిత్యముగాను క్రమంబుగ నగు.

ఉ. ఎద్దులు, ఎడ్డులు, ఎడ్లు; ఎద్దులన్, ఎడ్డులన్, ఎడ్లన్; దేవళ్లు దేవళ్లన్. మొ.

వ్యా. ఎద్దు శబ్దమునకు 'లు' గాని 'ల' గాని పరమైనప్పుడు ఎద్దు+లు, ఎద్దు+లన్ అనియుండ, దకారమునకు డాదేశమును డకారోత్వ లోపంబును రాఁగా ఎడ్లులు అనియుం ఎడ్డులన్ అనియుం, వైకల్పిక గ్రహణముచే ఎద్దులు ఎద్దులన్ననియుం రూపములు గల్గును. లు ల-లు పరము లగునపుడు దేవర శబ్దాంతమునకు ళాదేశంబును ళకారాత్వలోపమును నిత్యమును గల్గుఁ గాన దేవళ్లు దేవళ్లన్ననియును నే రూపములు.

సర్వనామ ప్రకరణము.

సూ. ౫౧. ఈ ఏ ఒకశబ్దముల కంటెం బరంబయిన యంత శబ్దము నకారమునకు లోపంబగు అగుచో నీ యే-ల దీర్ఘమునకు హ్రస్వమును ఒక కు వర్ణవ్యత్యయ సంహితయు నగు

ఈ, ఇంత, ఎంత, కొంత. (చూ. డెబ్బది) శబ్దానుశాసనుఁడు 'తచ్ఛబ్దాతః' అని సూత్రించిన సూత్రమునందలి తచ్ఛబ్ద మంతే ప్రభృతులకు నుపలక్షణ మని తెలియునది,

వ్యా. కొంత—ఒక+అంత అని యుండ నంతలోని యకారమునకు లోపము రాఁగా ఒక య ను దానికి వర్ణవ్యత్యయము చేయఁగా క+ఒ+ంత=అని యుండ సంహితచే కొంత యగునని ప్రక్రియను జూపుచున్నాఁడు. 'చూ. డెబ్బది' యనఁగా డెబ్బది యను రూపమున ఏడు+పది యని యుండునపుడు కలిగిన వర్ణవ్యత్యయమును జూడుఁడని యర్థము. 'నాయది' అను స్థలమున నున్న తచ్ఛబ్దాకారమునకు లోపము వచ్చునని చింతామణికర్త తచ్ఛబ్దాతః అని సూత్రించినాఁడు. ఆ యకారలోపము కేవల తచ్ఛబ్దాకారమునకే కాదు అంతలోని యకారమునకుఁగూడ నగునని యర్థము.

సూ. ౫౨. అమహాదర్థంబున భిన్న వస్తు సముదాయం బర్థమగుచో నేకవచనంబున నంతాదుల తకారంబునకు ద్విరుక్త నివర్ణంబగు.

ఉ. అన్ని, ఇన్ని, ఎన్ని, కొన్ని.

వ్యా. భిన్నవస్తు సముదాయ మనఁగ నుద్భూతావయవకంబులగు సజాతీయ విజాతీయ వస్తుసమూహమని యర్థము. ఇట భిన్న యను విశేషణము లేనిచో పిండి యను చోటఁగూడ నన్ని పిండి యని యనవలసియుండును. సిద్ధాంతములో అంత పిండి అని యుండును. పిండిలో నవయవభేద ముద్భూతమని చెప్పుటకు వలనుపడదుగదా! కాని అంత పప్పు అనుచోట అవయవభేదము ఉద్భూత మగుచున్నను అన్ని పప్పు అని వ్యవహారములో లేమి సూత్రమునకు అవ్యాప్తి. అన్నిపాలు మున్నగుచోట్ల నద్దానికి అతి వ్యాప్తి.

సూ. 23. ఆ ఈ శబ్దములకును, ఏ శబ్దమునకును మహదర్థంబున నన్ని విభక్తులయందును వకారము నిత్యముగాను వైకల్పికముగాను, మహదర్థంబునం బ్రథమేతరవిభక్తులయందు వచనద్వయంబునం గ్రమంబున తకార వకారంబులు నిత్యముగాను బూర్వాగమంబు లగు.

ఉ. వాఁడు, వారు; వీఁడు, వీరు; వానికి, వారికి; వీనికి, వీరికి; వానిచేతకు, వారిచేతకు; వీనిచేతకు, వీరిచేతకు; వేఁడు, ఏఁడు; వెరు, ఏరు; వేని, ఏనికి; వేరికి, ఏరికి, వేనిచేతకు, ఏవిచేతకు - మొ. 'తే. నిలిచి చారుల రావించి యిలయుఁ దివియుఁ, మంచు కపి వీరసేనల మించుఁగాంచి, వీరిలో ముఖ్యు లెవ్వారు వేఁడు రాముఁ, డతని యనుజన్ముఁ డెట్టివాఁడనుచుఁ బలుక.' రామా. 2 ఆ. మొ. దానికి, వానికి, దీనికి, వీనికి, దేనికి, వేనికి, దానిచేతకు, వానిచేతకు; దానియందుకు; వానియందుకు. మొ. అనుప్రయుక్తంబు లగునపుడు సరి కీరూపంబు లిట్లయగు. ఉ. (చూ. నీఁడు,)

వ్యా. ఆ ఈ శబ్దముల కనియు ఏ శబ్దమున కనియుఁ బృథక్కుగ నుచ్చరించుటంజేసి గ్రంథకర్త యాశయ మిట్లున్నది. ఏమనఁగా మొదటి రెండు శబ్దములకును వకారము నిత్యముగాను ఏ శబ్దమునకుమాత్రము వికల్పముగాను వచ్చును. రాఁగా వాఁడు, వీఁడు అను వైకల్పికరూపములును వేఁడు ఏఁడు అను ద్వైరూప్యమును

గల్గును. అనుప్రయుక్తములైనప్పుడును నీనిరూపములు లిగ్గీయగునని చెప్పి యుదాహరణములం జూచుకొను మనుచున్నాఁడు తరువాతి సూత్రముక్రింద. 'చూ. నీవాఁడు' అని.

సూ. ౫౪. కొన్నియెడల మహదర్థంబున నే శబ్దంబునకు వాఁడు వారును, అమహదర్థంబునం ద్రికంబున కది యవులును స్వార్థంబున నేక బహువచనంబులం గ్రమంబుగ ననుప్రయుక్తంబులగు.

ఉ. ఏవాఁడు, ఎవ్వాఁడు; ఏవారు, ఎవ్వారు; ఆయది, అయ్యది, ఆయవి, అయ్యవి; ఈయది, ఇయ్యది; ఈయవి, ఇయ్యవి; ఏయది, ఎయ్యది; ఏయవి, ఎయ్యవి.

వ్యా. బాలవ్యాకరణము చెప్పిన నెవ్వాఁడు మున్నగు రూపములు కర్మధారయమునంచే సాధువు లగుచున్నవి. ఇట సామర్థ్యమందును సాధుత్వము నిరూపించుచున్నాఁడు.

సూ. ౫౫. ఇటనే హ్రస్వంబగు, అగుచో నా దీర్ఘంబునకు హ్రస్వంబును ద్విత్వంబునకు లోపంబును విభాష నగు.

ఉ. ఎవ్వాఁడు, ఎవఁడు; ఎవ్వారు, ఎవరు.

వ్యా. ఎవ్వాఁడు ఎవ్వారు—అను రూపములు 'త్రికంబుమీఁది యుసంయుక్త హల్లునకు ద్విత్వంబు బహుళంబుగా నగు; ద్విరుక్తంబగు హల్లు పరంబగునప్పుడాచ్ఛికంబగు దీర్ఘంబునకు హ్రస్వంబగు' నను బాల. సమా. సూత్రముల చేత సిద్ధించును. కాని యీ సూత్రోదాహృతములం బట్టి మీఁదహల్లు ద్విత్వ మెడలిన మునుపటి కృతహ్రస్వమునకు దీర్ఘముగల్గి 'అకన్య ఇకాలము' మున్నగురూపములు గల్గనట్లు 'ఎవఁడు ఎవరు' మున్నగు రూపములును సిద్ధింపవు. ఎవఁడు ఎవరు—అనురూపముల సిద్ధికై ప్రకృతసూత్రము.

సూ. ౫౬. ఆ ఈ ఏ శబ్దములకుఁ బూజ్యతయందు మహదేకవచనంబునఁ దవరాగమంబును వాని దీర్ఘంబునకు వికల్పముగా హ్రస్వంబును; మహత్యేకవచనంబున వానికంటెఁ బరంబయిన అక, అప, అమ శబ్దంబుల తొలి యకారమునకు లోపంబును, తుది యకారంబున కెకారాదేశంబు నగు.

ఉ. అతఁడు, ఆతఁడు; ఇతఁడు, ఈతఁడు; ఎతఁడు, ఏతఁడు;

ఆకె (ఆ + అక + ఎ), ఆపె (ఆ + అప + ఎ), ఆమె (ఆ + అమ + ఎ),

ఈకె (ఈ + అక + ఎ), ఈపె (ఈ + అప + ఎ), ఈమె (ఈ + అమ +

ఎ), ఏకె (ఏ + అక + ఎ), ఏపె (ఏ + అప + ఎ), ఏమె (ఏ + అమ + ఎ.)

వ్యా. ఆ ఈ ఏ శబ్దములకుఁ బూజ్యతయందు మహదేకవచనమునందు 'త'
వర్ణము నిత్యముగ ఆగమము కాఁగా ఆతఁడు, ఈతఁడు, ఏతఁడు అను రూపములు గల్గి
నవి. వాని దీర్ఘమునకు వికల్పముగా హ్రస్వము రాఁగా అతఁడు, ఇతఁడు, ఎతఁడు
అను రూపములు ఏర్పడును. మహత్యేక వచనంబున ఆ ఈ ఏ శబ్దములకు అక అప
అను శబ్దములు పరములు కాఁగా ఆ + అక, ఈ + అక, ఏ + అక, ఆ + అప, ఈ + అప,
ఏ + అప, ఆ + అమ, ఈ + అమ, ఏ + అమ — అని యుండఁగా; అకారాదుల తొలి
'అ'కారము లోపింపఁగా ఆ + క, ఈ + క, ఏ + క, ఆ + ప, ఈ + ప, ఏ + ప, ఆ + మ,
ఈ + మ, ఏ + మ అని నిలుచును. అపుడు అకాదుల తుదినున్న 'అ'కారము 'ఎ'కార
ముగ మాఱఁగా ఆకె ఈకె ఏకె ఆపె ఈపె ఏపె ఆమె ఈమె ఏమె యనురూపములు
సిద్ధించినవి.

సూ. ౧౪౮. ఆ ఈ శబ్దములును ఏ శబ్దమును నపుంసకార్థంబున ప్రథమా
విభక్తి పరంబగునపుడు నిత్యముగాను వైకల్పికముగాను క్రమం
బుగ హ్రస్వంబులగు. ఉ. (చూ. మీఁది సూత్రము.)

వ్యా. ఆ ఈ ఏ శబ్దములకు ప్రథమైకవచనమున దివర్ణకంబును తద్బహువచనం
బున వి ప్రత్యయమును జేరునని తరువాతి సూత్రమునఁ జెప్పనున్నాఁడు. ఆ ప్రత్యయ
ములు పరము లగునపుడు ఆ ఈ శబ్దములు నిత్యముగ హ్రస్వంబు లగును. అది, అవి;
ఇది, ఇవి; అక ప్రత్యయములు చేరునప్పుడు ఏ శబ్దమునకు హ్రస్వత వైకల్పికముగ
రాఁగా రూపద్వయము ఎది, ఏది; ఎవి, ఏవి — అని. ఈ యుదాహరణములం దరు
వాతిసూత్రమున నిచ్చియున్నాఁడు కావున చెప్పుచున్నాఁడు 'చూ. మీఁది
సూత్ర'మని.

సూ. ౫౮. త్రికంబున క హామదర్థంబునం బ్రథమైకవచన బహువచనం బులం గ్రమంబుగ దివి వర్ణకంబు లగు.

ఉ. అది, అవి; ఇది, ఇవి; ఏది, ఏవి; ఎది, ఎవి;

వ్యా. ఆ ఈ ఏ యను సర్వనామంబులు త్రికంబు నాఁబడు నని బాల. సమా. సూ. ౪. ఆ. సర్వనామములకుం బ్రథమైకవచన ప్రత్యయము ది, తద్బహువచన వర్ణకము వి. ఉదాహరించుచున్నాఁడు 'అ' దిత్యాది. ఎది ఏది ఎవి ఏవి యను రూప ద్వయముల నిష్పత్తి పూర్వసూత్రమున సంపాదిత మైయున్నది.

సూ. ౫౯. హ్రస్వ వ్యస్త త్రికంబునిరాఁది దివులకు ద్విత్వంబు నగు.

ఉ. అద్ది అవ్వి; ఇద్ది, ఇవ్వి; ఎద్ది, ఎవ్వి, ఇట్లనుటచే అయ్యది త్యాదులయందు ద్విత్వంబు కలుఁగదని యూహింపవలయును.

వ్యా. ఆ ఈ ఏ యను సర్వనామములకు పరంబులగు దివి వర్ణకంబులకు ద్విత్వం బును అగు ననుచున్నాఁడు. ఇచ్చటి సముచ్చయార్థకము ఈ ద్విత్వము వైకల్పిక మని తెలుపుచున్నది. ఈ వైకల్పిక ద్విత్వము వ్యస్తములందే కాని సమస్తపదంబులం గల్గదు. కావునఁ జెప్పుచున్నాఁడు 'అయ్యదిత్యాదులం' దిత్యాది. అయ్యది కర్మధారయము గాన ప్రకృతసూత్రోక్త ద్విత్వమున కట ప్రాప్తిలేదని భావము.

సూ. ౬౦. ద్వితీయైకవచన బహువచనంబుల రెంటను నివర్ణకం బగు.

ఉ. దానిఁ, వానిఁ; దీనిఁ, వీనిఁ; దేనిఁ, వేనిఁ;

వ్యా. చింతామణిలో బహువచనమున 'లను' అను ప్రత్యయ ముండవలయు నని సామాన్యముగాఁ జెప్పఁబడియున్నది. ఈ సర్వనామములలో నట్లుగాక బహువచ నమునఁగూడ నివర్ణకమే యగు నని యీ సూత్రము చెప్పుచున్నది. ఉదా. దానిఁ—ఇత్యాది.

సూ. ౬౧ అయ్యాది తృతీయాది విభక్తులు పరంబు లగుచో నాగమం బుగా నగు.

ఉ. దానిచేతఁ, వానిచేతఁ.

వ్యా. ప్రత్యయముపైఁ బ్రత్యయము రాదను గానఁ దృతీయాది పరక నివర్ణంబు నీ సూత్రంబున నాగమం బనుచున్నాఁడు.

సూ. ౬౨. అది యిది యెది యనువానికిఁ దృతీయా సప్తమ్యేకవచనంబులందు దాన దీన దేన లనియు, వాని బహువచనంబులయందు వాన వీన వేన లనియు రూపంబు లగు.

ఉ. 'క. చనుసెడ శ్రీరాముఁడు పావన నవనిజరూప వైభవశ్రీ నుల్లంబున నిడి దాన విచిత్ర, తను రాగ వార్ధి వచ్చి తనుఁ బైకొనఁగన్.' రాఘ. ౨ ఆ. 'క. నలుఁ గాన మిప్పనంబునఁ, గలవెప్పుడుఁ గాంతు మృగకరులను సింహంబుల భుజంగంబుల నిది మర్త్యుల కవిషయ మాతపంబు దూఱదు దీనన్.' భార. అర. ౨ ఆ. 'క. కాననము గిరులు నదులును, నానా తీర్థములు భోజనంబుల కెల్లన్, భూనుత సాధారణములు, నానను ధర్మములు సేయవచ్చు విశేషన్.' భార. అను. ౨ ఆ. 'తే. అనిశ నలుగాలి వాన గోవును నశేష, శబ్దముల మంత్రమును గాఁ బాఁజాలఁ గాంచ ననుజు మనుజుల విప్రుఁడు సమధికత్వ, భోజనములం ద్రి వేద ప్రపంచవిదులు.' భార. శాంతి ౧ ఆ. 'తే. కలవు నాఁటలు వేలు లక్షలును గోటు, లప్రమేయముల్ ఘనమాయ లధిప నాకు, వానఁ దగులక పోరాదు వసజభవున, కైన నధిపున కైనను నన్య్మ లంగ.' లక్ష్మీ. ౪ ఆ. 'క. ధ్యానం బింద్రియవృత్తులు, మానించు టహింస గురుసమర్చన విధి నిత్యస్నానము తపమును, వీనం బర సేవ్య మెట్టి విననగా వలతున్.' భార. అను. ౪ ఆ. 'సీ. ఒక్కఁ డొక్కటి చేత నెక్కుడుఁ దలఁగుచుఁ, ద్రిగుణంబులను బ్రవర్తించు వీన, జనితంబులగుఁ బ్రీతి సంతాప మోహాదులు.' భార. అను. ౫ ఆ. 'ఎ. గీ. అని యుటెంగించి మఱియును నిట్లను నజుండు, స్వేద బుద్భిజాండజములు జరాయుజములు.' భార. అశ్వ. ౨ ఆ. మొ. దేనన్, వేనన్. అను వానికిఁ బ్రయోగంబులు మృగ్యంబులు.

వ్యా. అది ఇది ఎది—అనువాని తృతీయా సప్తమ్యేకవచన రూపములు దాని చేతన్, దానియందున్; దీని చేతన్, దీనియందున్; దేని చేతన్, దేనియందున్—అని

యుండును. వీనికిం బ్రకృతసూత్రమున దానన్ దీనన్ దేనన్ — అను రూపాంతరములు నిపతింపఁబడినవి. వానిచేతన్, వానియందున్; వీనిచేతన్, వీనియందున్; వేనిచేతన్, వేనియందున్ అను బహువచనరూపములకుం గ్రమంబుగ రూపాంతరంబులు వానన్ వీనన్ వేనన్ అని యేర్పడును. ఈ రూపాంతరంబులం దృతీయా సప్తములం దేకరూపత నరయునది. నామంబుల కేతాదృగ్రూపములు బాల. కారక. సూ. ౨౨ చే సిద్ధించును. ఉక్తసర్వనామముల కీ రూపాంతరసిద్ధికై ప్రకృతసూత్రము.

సూ. ౬౩. పదాద్యంతర్గతం బా శబ్దం బనుమహదర్థకంబు సమస్తంబు వ్యస్తంబునయి కొన్నియెడల నర్థశూన్యం బగు.

ఉ. 'చ. తత్పురవప్రము పాదపీఠికా, శిరముల కొప్పు నర్పవలు చేసిన పువ్వుల యవ్విధంబునన్.' భార. ఆది. ౧ ఆ. 'పాదు గాపు నాగతి,' కళా. ౩ ఆ. 'మఱి బావులు నూఱిటి కంటె నొక్క సత్క్రతు వది మేలు.' భార. ఆది. ౮ ఆ. మొ.

వ్యా. ఆ. 'పువ్వుల యవ్విధంబునన్' 'ఆగతి' యనుచోట్ల 'ఆ' శబ్దము పదాదిగతము సమాసగతము. 'సత్క్రతు వది' యనుచోట 'అ' శబ్దము వ్యస్తము. ఈయుదాహృతులం దాశబ్ద మర్థశూన్య మనుచున్నాఁడు. 'పువ్వుల యవ్విధంబునన్' అన్నట్లే 'వీరుల యవ్విధంబునన్' అనియును నసగూడియుండఁగా సూత్రంబున 'అనుమహదర్థకం' బననేల యన్న తాదృక్ప్రయోగ వైరళ్యముచే.

సూ. ౬౪. త వర్ణకంబు స్త్ర్యర్థకం బగు.

వ్యా. 'త' యను ప్రత్యయము 'స్త్రీ' యను నర్థము నిచ్చునదే సర్వనామంబులకుం గొన్నింటి కనుప్రయుక్త మగు.

సూ. ౬౫. అయ్యాది యేకత్వంబున సమాసగత షష్ఠ్యంతయ త్ర్యర్థకాన్యైకార్థక శబ్దంబులపై నగు.

ఉ. ఎవ్వరిత, ఎవరిత; ఒక్కరిత, ఒకరిత; ఒక్కొరిత, ఒకొరిత. (వీనికి ఎవరియొక్క యాఁడుది యనియును, ఒకరియొక్క యాఁడుది యనియును, ఒక్కయాఁడు దనియును నర్థములు.)

వ్యా. 'ఎవ్వ' రను ప్రశ్నార్థము నిచ్చునది యత్కిమర్థకము ఎవరో యొక రను నర్థమిచ్చునది యనాద్యర్థకము. ఒక్కరని సంఖ్యచే నిరూపించునది ఏకార్థకము, ఎవరు ఒకరు అను శబ్దములే యత్కిమర్థకానైర్ద్యకార్థకములు. సమాసమున వీనిపైఁ 'ద'వర్ణకంబు కూడును. 'ఎవరియొక్క ఒకరియొక్క' అనువానిలో 'యొక్క'కు లోపము 'సమాస విభక్తికి లోపంబగు'నను బాల. సమా. సూ. ౨౫ చే నని తెలియందగిన 'యొక్క' ముందున్న యికార మాపవిభక్తికము.

సూ. ౬౬. వాని యత్వంబున కిత్వైత్వంబులు పర్యాయంబున నగు. ఆదేశాత్వంబు మీఁది దాని కెత్వంబు రాదు.

ఉ. ఎవ్వరిత్తి, ఎవరిత్తి; ఎవ్వరితె, ఎవరితె; ఒక్కరిత్తి, ఒకరిత్తి; ఒక్కరితె, ఒకరితె; ఒకొక్కరిత్తి, ఒకొరిత్తి, ఒకొక్కరితె, ఒకొరితె.

వ్యా. పూర్వసూత్రోక్త స్త్రీలింగార్థక తవర్ణకమునకు ఇత్వముగాని ఎత్వముగాని కూడ రావచ్చును. ఉదా. ఎవరిత్తి ఎవరితె మొ.

సూ. ౬౭. రేఫ సంయుక్తంబగుచో నొకొక్కాది శబ్దంబులమీఁది తకారంబున కుత్వంబు నగు. ఉ. (ముందు మీఁదను.)

వ్యా. తవర్ణకము పరమగునపుడు రేఫంబుమీఁది యిత్తునకు వైకల్పికలోపము దరువాతి సూత్రమున నే చెప్పనున్నాఁడు. అట్లది లోపింప రేఫ తకార సంశ్లేషము ఏర్పడును. ఒక్క, ఒకశబ్దములమీఁది తకారము రేఫ సంశ్లిష్టం బయినపుడు దాని యత్వముపోయి ఉత్వము వచ్చునని సూత్రార్థము. ఒకొక్కర్తు ఒకొర్తు ఒక్కర్తు ఒకర్తు అనురూపములను మీఁది సూత్రోదాహృతములం జేర్చియున్నాఁడు కావునఁ జెప్పు చున్నాఁడు 'ఉ. (ముం. మీఁదను)' అని.

సూ. ౬౮. తవర్ణకంబు పరంబగుచో రేఫంబుమీఁది యిత్తునకు లోపంబు విభాష నగు.

ఉ. ఎవ్వర్త, ఎవర్త; ఎవ్వర్తి, ఎవర్తి; ఎవ్వర్తె, ఎవర్తె; ఒక్కర్త, ఒకర్త; ఒక్కర్తి, ఒకర్తి; ఒక్కర్తు, ఒకర్తు; ఒక్కర్తె, ఒకర్తె; ఒకొక్కర్త, ఒకొర్త; ఒకొక్కర్తి, ఒకొర్తి; ఒకొక్కర్తు, ఒకొర్తు; ఒకొక్కర్తె, ఒకొర్తె.

వ్యా. యత్కిమర్థకాసైర్ధ్యకార్థక శబ్దంబులు ఔపవిభక్తికములు, ఊరాద్యాదులలోఁ జేరునవి, కావున 'ఊరా మొదలగువాని కిత్వం బగు' నను బాల. అచ్చి. సూ. 30 చే ద్వితీయాద్యేకవచనంబులు పరంబు లగునపుడు 'ఎవరి ఒకరి' యని యుండవలెను. ఆ యిత్వునకు ప్రత్యర్థక తవర్ణకము పరమగుచో వైకల్పికలోపము ఈ సూత్రమునం జెప్పఁబడినది. లోపింప, శేష తకారసంశ్లేషము సిద్ధించును. ఉదాహరించుచున్నాఁడు 'ఎవ్వర్తు'—ఇత్యాది.

సూ ౧౯. కొన్నియెడల రేఫసంయుక్త తవర్ణకంబు ముందటి యొక్కా-దుల కోత్వం బాదేశం బగు.

ఉ. ఓర్త, ఓర్తి, ఓర్తె.

వ్యా. రేఫసంయుక్త తవర్ణకమునకు ముందున్న ఒక్క-, ఒక-ల స్థానమున ఓ యను నేకాక్షరము రాఁగా ఓర్తేత్యాదిరూపములు సిద్ధించును.

సూ ౨౦. ఎవ్వరి తాదులందలి రి వర్ణకంబునకు లోపంబు విభాషనగు

ఉ. ఎవ్వత, ఎవత; ఎవ్వతి, ఎవతి; ఎవ్వతె, ఎవతె; ఒక్కత, ఒకత; ఒక్కతి, ఒకతి; ఒక్కతె, ఒకతె; ఒక్కొత, ఒకొత; ఒక్కొతి, ఒకొతి; ఒక్కొతె, ఒకొతె. [స్వార్థంబునం గ ప్రత్యయంబు రా ఎవ్వతుక, ఎవతుక; ఎవ్వర్తుక, ఎవర్తుక; ఒక్కతుక, ఒకతుక; ఒక్కొతుక, ఒకొతుక, ఒక్కర్తుక, ఒకర్తుక; ఒక్కొర్తుక, ఒకొర్తుక, ఓర్తుక అని రూపంబులు.]

వ్యా. ఎవ్వతుక—ఇట 'క' ప్రత్యయ మనినచో తకారము మీఁది యకారమునకు ఉకారాదేశము అగతిక మగును. ఈ యనుపపత్తిని గుర్తించియే బాలవ్యాకరణకారుఁడు 'ఉ' ప్రత్యయమును విధించిన ట్లున్నది.

సూ. ౨౧. నీ మీ నే మే హల్లులకు లోపంబు విభాష నగు.

ఉ. ఈవు, నీవు; ఈరు, మీరు; ఏను, నేను; ఏము, మేము.

వ్యా. 'దేశ్యాద్ అస్మ ద్యుష్మచ్ఛబ్దాత్ సుజసోర్నుమీ పురూచ స్తః' అను చింతామణిసూత్రముచే నా నీ శబ్దములకు ప్రథమైకవచన బహువచనములలో నేను

లలో ద్విత్వమునకుమాత్రమే వైకల్పికలోపము. ద్విత్వము లోపించిన నమున్ మిమున్ తమున్న నిరూపములు ఏర్పడును.

సూ. ౨౮. తాము తమరు తారు నగు (స్పష్టము)

వ్యా. ఇట తాము అనునది తమరు అనియుం దారు అనియు నగు నని చెప్పు చున్నాఁడు. కాని తమరు అనునదే తాము తమరులగునని సూత్రించిన బాగుండెడిది. తమరులోని రేఫమునకు లోపమును ఆద్యక్షరమునకు దీర్ఘముం జేయు, 'తాము' సిద్ధించును. అందే మలోపంబు నాద్యక్షర దీర్ఘంబుం గల్గ 'తారు' ఏర్పడును.

సూ. ౨౯. నామ పునర్గ్రహణంబున భిన్నంబు నభిన్నంబు నయి తచ్ఛబ్దార్థంబు తత్పర్యాయం బగు.

ఉ. 'వాఁడె సురాసురులెల్ల నడ్డమై వచ్చిన నైన రాక్షస వివాహమునం గొనిపోవు నిన్ను.' భాగ. ౧౦ స్కం. పూ. (వాఁడె భిన్నరూపము, ఆ సుదర్శనాయుధుఁ డనుట అభిన్నరూపము, సుదర్శనాయుధుఁడు నామపదము.) 'ఎ. గీ. వివిధ పుణ్యకథలు వినువేడ్క నతనిఁ బూజించిరి' భార. ఆది. ౧ అ. (అతనిన్ భిన్నరూపము, అక్కథకు డనుట అభిన్నరూపము, కథకుఁడు నామపదము.) సీ. కలహంస పలికిన పలుకులు గణియించు వడిదాని పోయిన వలన చూచు' భార. అర. ౫ఆ. (దాని భిన్నరూపము, ఆకలహంస యనుట యభిన్నరూపము, కలహంస నామపదము.) మొ.

వ్యా. ఒకపరి వచ్చిన పేరునే మఱలఁ గొనునెడం దత్పర్యాయంబుగ తచ్ఛబ్దార్థంబు ప్రయోగింపంబడును. రెండువిధముల నది ప్రయోగంబులం గాననగుచున్నది. భిన్నంబుగ ననఁగా వేఱుగఁ దన్నామస్థానమునం దానుమాత్రము వచ్చుట; అభిన్నంబుగ ననఁ దన్నామపరకమై వచ్చుట. ఉదాహృతములలో ఆ సుదర్శనాయుధుఁడు అక్కథకుఁడు ఆ కలహంస యనునవి యభిన్నరూపములు వాఁడె అతనిన్ దాని___అను నవి భిన్నరూపము లని యెఱుఁగునది.

సూ. ౭౬. ఒక్కొకచో నామంబె యగు.

ఉ. 'సీ. సురవరు లర్థులై చూచుచు నుండగ, నలువరియించిన నాఁటి యొగ్గు, దలఁచి యిట్టి యాపదలు చేసిరో వేల్పు, లమర కోపము వన యయ్యె నాకు, నీ వియోగదుఃఖము' భార. అర. ౨ ఆ. మొ.

వ్యా. నామపునర్గ్రహణమునం దత్పర్యాయముగ పూర్వ సూత్రోక్త తచ్ఛబ్దార్థంబె కాక, నామమె వచ్చుటయుం గలదు. అట్టి యెడల క్వాచిత్కము లగుటం దలఁపించుచున్నాఁడు 'ఒక్కొకచో' నని. సురవరులు వేల్పుఁ అమరులను నామంబులే ఈ సూత్రోదాహృతమునం బరస్పరము పర్యాయత నందియున్నవి.

సూ. ౭౭. నామ తదేత ద్వ్యక్తిమర్థంబులకుం బునర్గ్రహణంబునఁ బ్రథమాద్యంత మయి పూర్వ పదంబులుగ నాత్మార్థం బభిహితంబగు.

ఉ. 'తా వచ్చె సుదర్శనాయుధుఁడు.' భాగ. ౧౦ స్కం. పూ. 'క. విదురుఁ డురు విమార్గుల వలనన్, మానుగ నేమఱకుం డని, తాను ప్రబోధించె.' భార. ఆది. ౬ ఆ. (ఇటఁ దాశబ్దము పాదపూరణార్థకము. 'వచ్చె సుదర్శనాయుధుఁడు.' విదురుఁడు బోధించె' అని యాత్మార్థ విరహితంబుగను జెప్పవగు) 'ఆ. అడవిఁ దన్నుఁ బాసి యరిగిన నలిగి గా, ఉన్న యిట్లు నీ యరుగుదిడకఁడఁగ.' భార. అర. ౨ ఆ. 'వ. అదియును దన కష్టము జేశ్వరుం దపాయంబు సేయునె కాఁ దలఁచి' భార. అర. ౨ ఆ. 'క. కర్మములు మేలు నిచ్చును, కర్మంబులు కీడు నిచ్చుఁ గర్తలు దనకున్, గర్మములు బ్రహ్మాకనను, గర్మకుఁడై పరులఁ దడవఁగా నేమి టికిన్.' భాగ. ౧౦. స్కం. పూ. మొ.

వ్యా. నామమునకును తదేత ద్వ్యక్తిమర్థంబులకుఁ బునర్గ్రహణము గల్గువప్పుడు వానికిం బర్యాయముగ ప్రథమాది విభక్త్యంతమై యుందో వనుకనో ఆత్మార్థము ప్రయోగింపఁబడును. 'తా వచ్చె సుదర్శనాయుధుఁడు' 'అడవిఁ దన్నుఁబాసి యరిగిన నలిగి గా, ఉన్న యిట్లు నీవు నువిడక డఁగ' 'కర్తలు దనకున్, గర్మములు బ్రహ్మాకనను—అను

నుదాహరణంబులం దాత్మార్థము పూర్వంబుగను ఇతరములం బరముగను నభిహితమై యుంట నరయునది.

సూ. ౭౮. ఆత్మార్థం బొకానొకచో నామాస్మదర్థంబులు నగు.

ఉ. 'తే. తనకు మఱి తాన చుట్టంబు తాన తనకు, గతియుఁ దన్నిచ్చుచోఁ దాన కర్త యనఁగా, ననఘ సత్ర గాంధర్వవివాహ మతిరహస్యమును నమంత్రకమును నగుచు నొప్పు.' (తనకుఁ = స్త్రీకనుట) భార. ఆది. ౪ ఆ. 'క. తనతోంటి కర్మరాశికి, ననుచరమై బహువికారమై మనము వడిఁగా, జను నింద్రియముల తెరువులఁ, దనువులు వెక్కుసఁ జెడవు తనకర్మంబుల్.' భాగ. ౧౦ స్కం. పూ. (తన = ప్రాణియొక్క) మొ. 'తన కిష్టుఁడుగా సహాధ్యాయుఁడు సైనవాఁడు.' (తనకు=నాకు) భార. ఆది. ౧ ఆ. 'తన తనుచ్ఛాయ మస్తకహీనమై తోఁచె' (తన తనుచ్ఛాయ=నా తనుచ్ఛాయ) శై. ౪ ఆ. 'నీవు చెప్ప నొడికంబుగఁ బూనిన యీ ప్రబంధము దన కిపు డంకితంబు ప్రమదంబుగఁ జేయుము.' (తనకుఁ = నాకు) రుక్మాం. ౧ ఆ. 'సీ. తమ సొమ్ము తమ కిచ్చె ధర్మరాజని మహీసురులు దానము సేయఁగాంచి నగరె.' (తమ సొమ్ము=మా సొమ్మె, తమకుఁ=మాకు.) శై. ౧ ఆ. మొ.

వ్యా. ఒకానొకచో ననఁగా ప్రయోగములం గ్వాచిత్కముగ నని యర్థము. ఆత్మార్థం బనఁగా తాను శబ్దమును, దాని వివిధరూపములును. ఇది నామార్థంబునం గొన్నియెడలను అస్మచ్ఛబ్దార్థమునం గొన్నియెడలను గాననగుచున్నదని సూత్రార్థము. ఉదాహృతములం దొలిరెండును నామార్థంబున కనియు మఱి నాలుగు నస్మదర్థంబున కనియుం గ్రాహ్యము.

సూ. ౭౯. కర్తృబహుత్వంబునఁ దన తనయుఁ దమ తమయును నగు.

ఉ. 'క. తమతమ పుత్త్రుఁడుగాఁ జిత్తములం జేకొని దయను పృథగ్భావము లేక ముదంబునఁ బెంచిరి.' భార. అర. 3 ఆ. మొ.

వ్యా. సూత్రమందలి సముచ్చయార్థకము చేఁ 'దన తన'యుం, 'తమ తమ'యు నుభయంబును గ్రాహ్యమే.

సూ. ౮౦. ఒక్కొకశబ్దంబుల యత్వంబున కొత్వంబు విభాషనగు.

ఉ. ఒక్కఁడు, ఒక్కొఁడు; ఒకఁడు, ఒకొఁడు.

వ్యా. ఒక్కశబ్దమునం ద్విత్వ కకారము మీఁదిదియు ఒకశబ్దంబున కకారము మీఁదిదియు నగు 'అ'కార స్థానమున ఒకారము వైకల్పికముగ వచ్చును, కాఁగా 'ఒక్కొక' శబ్దముల నొక్కొకదానికి రెండేసిరూపములు. ఉదాహరించుచున్నాఁడు 'ఒక్కఁ' డిత్యాది.

సూ. ౮౧. ఒక్కొకాదులకు డువర్ణకంబు పరంబగునపుడు మహదర్థంబున రువు వుగాగమంబులును, అవి పరంబగుచోఁ గకారమునకు లోపంబును, కకారాదులకు లోపంబుగా డువర్ణకమునకు ద్విత్వయుక్త డువర్ణంబును, అమహదర్థంబునం గకారాదులకు లోప బిందువులును విభాష నగు.

ఉ. ఒక్కరుఁడు, ఒక్కొరుఁడు; ఒకరుఁడు, ఒకొరుఁడు; ఒక్కరువుఁడు, ఒక్కొరువుఁడు, ఒకరువుఁడు, ఒకొరువుఁడు, ఒరుఁడు, ఒరువుఁడు, ఒడ్డు, ఒండు.

వ్యా. ఒక్క—ఒక—మున్నగు శబ్దములకు ప్రథమైకవచన ప్రత్యయంబగు డువర్ణకంబు పరంబగునపుడు రువు వుగాగమంబులు వైకల్పికముగ వచ్చును. కిత్త్వముచే నంతాగమములుగ నని తెలియవలయును. కాఁగా ఒక్కరుఁడు ఒక్కొరుఁడు; ఒకరుఁడు ఒకొరుఁడు, ఒక్కరువుఁడు ఒక్కొరువుఁడు, ఒకరువుఁడు ఒకొరువుఁడు నను రూపములు ఏర్పడును. కానిపక్షమున ఒకఁడు ఒకొఁడు ఒక్కఁడు ఒక్కొఁడు అనియే యుండును. ఈ నాలుగింటిని గ్రాహ్యములుగనే సూత్రమున ఒక్కొకాదుల కనుచోట నాదిశబ్దము గ్రహింపఁబడినది. రువు వుగాగమములు వచ్చునప్పుడు కకారమునకు లోపము వైకల్పికము. లోపించిన ఒరుఁడు ఒరువుఁడు లోపింపకున్న ఒకరుఁడు ఒకరువుఁ డిత్యాదిగా నుండును. కకారాదులకు లోపమువచ్చిన డువర్ణకము స్థానమున ద్విత్వ డువర్ణకము వైకల్పికముగ వచ్చును. వచ్చిన ఒడ్డు అనియు రాకున్న ఒరుఁ డిత్యాదిగను రూపసిద్ధి గ్రాహ్యము. ఇందనుక్తరూపము లన్నియు మహదర్థమున

సని తెలియవలయును. అమహదర్థమున కకారాదులకు లోపమును తత్స్థానమున బిందువును వైకల్పికముగ వచ్చును. వచ్చిన ఒండు అనియును రాకున్న ఒకఁడు ఒకొఁడిత్యాదిగను రూపము లేర్పడును.

సూ. ౮౨. టివర్ణంబు మహదర్థంబున నొక్కఁడాదుల డువర్ణకంబునకు విభాషనగు.

ఒక్కటి ఒక్కొటి ఒకటి ఒకొటి.

వ్యా. అమహదర్థమున ఒకఁడు మున్నగువాని 'డు' స్థానమున టివర్ణంబు వైకల్పికముగ వచ్చును. టివర్ణంబుతో నొకటియుం డువర్ణకముతో నొకటియుం గాన మహదర్థమునం ద్వైరూప్యము గల్గును. మహదర్థంబున నన్నినో డువర్ణకంబుతోడి దొక్కటే రూపము. సూత్రమును డువర్ణకం బనుటకన్న డుఙ్ వర్ణకంబున కని యుండుట మేలు.

సూ. ౮౩. ఎక్కటి యొక్కటి (స్పష్టము.)

వ్యా. ఎక్కటి యనియుం నొక్కటికి రూపాంతరము గలదు. 'పేఁడిమి యెల్ల నెక్కటియై యొడలెత్తె ననఁగ.' లక్ష్మీ. ౧ ఆ.

సూ. ౮౪. ఒకశబ్దం బొక్కచో నల్పార్థకంబగు.

ఉ. 'ఒక మున్నాళ్లు గదల్చి తెచ్చిన లలాటాగ్రాక్షు చాపంబు' భాగ. ౯ స్కం. 'ఒక నూటేఁడుల్' మార్క. ౫ ఆ. 'ఏ మొక కొంద ఱము.' విక్ర. ౫ ఆ. మొ.

వ్యా. ప్రయోగములం దటనట ఒకశబ్దము 'అల్ప' మను నర్థమునం గన్పట్టుచున్నది. ఉదాహరించుచున్నాఁడు 'ఒక మున్నా' ళ్ళిత్యాదిని. రెండ్వాదులకు నీ యర్థము కలదు, 'రెండుమాటలు విని పొమ్ము' మొ.

సూ. ౮౫. ఒకానొకచో ననిర్దిష్టార్థమునందొక శబ్దమునకుం బూర్వాగమం బగు.

ఉ. ఒకానొకఁడు ఒకానొకతె ఒకానొకటి. ఒకానొకచో ననుటచే ఒకఁడు ఒకతె ఒకటి. ఒకశబ్ద మొక్కొడులకు నుపలక్షణము.

వ్యా. నిర్దేశింపఁబడని యర్థమందు ఒకశబ్దమునకు 'ఒకా' నను పూర్వాగమము వచ్చుట గలదు. వచ్చిన ఒకానొకఁడిత్యాదిరూపములు ఏర్పడును. ఈ పూర్వాగమ విధి నిత్యము కామిని 'ఒకానొకచో' ననుట తెలిపెడి సూత్రము 'దొకశబ్దమున' కని యున్నను ఈకార్య మొక్కఁడులకుం గల్గును గానఁ జెప్పుచున్నాఁడు 'ఒకశబ్ద మొక్కఁడులకు నుపలక్షణము' అని.

సూ. ౮౬. సర్వనామంబులకు మహదర్థంబునం దఱచుగ లుల-లకు రుర-లగు.

ఉ. ఎల్లరు, ఎల్లరన్; వారు, వీరు, పేరు. ము. తఱచుగ నను టచే తాము, మేము; తమ్మున్, మమ్ము మిమ్మున్ ఇత్యాదిరూపంబులు నగునని యెఱుంగునది.

వ్యా. సర్వనామములకు మహదర్థమున లుల-లకు బదులు రుర-లు తఱచుగ వచ్చును. తఱచుగ నన్నఁగా బహుళముగానని కొనవలసిన ట్లున్నది. ఈ రేఫాదేశము కొన్నియెడల నిత్యముగను కొన్నియెడల వైకల్పికముగను కొన్నియెడల రానిదిగను ఇట్లు పెక్కురీతుల నున్నది. ఎల్లరు ఎల్లరన్ ఇత్యాదులలో రేఫాదేశము నిత్యము, తాము మేమిత్యాదులలో నిత్యాదేశము రాదు. పెక్కుశబ్దమునకు మహదర్థంబున పెక్కురనియుం అమహదర్థంబున పెక్కులనియు రూపములు.

సూ. ౮౭. ఏండేరేదేవి శబ్దంబు లర్థవిశేషంబునం దీకారాంతంబులగు.

ఉ. 'ఏండీ నా బలుపుంసికంబుల కోటారు.' అప్ప. రా. అ. ౧౦. 'ఏరీ సిరిమూటకట్టుకొని పోవంజాలిరే.' భాగ. ౮ స్కం. 'ఏది యేటి యేటి చాలఁ (...)' కళా. ౧ ఆ. ము. హ్రస్వాంతంబులు నగు. ఉ. ఏండేడు, ఏరేరి. ము. (అర్థవిశేషము: ఎక్కడ, ఎక్కడ నున్నాఁడు. ఇత్యాది.)

వ్యా. ఏండు, ఏరు, ఏది, ఏవి శబ్దములకు 'ఎక్కడ ఎక్కడనున్నాఁ' డను నర్థ విశేషము ప్రయోగములం గానఁబడుచున్నది. అయ్యర్థంబునం దా రూపంబులకు నంత్య దీర్ఘము కొన్నిచోట్లం గనఁబడుచును కొన్నిచోట్ల లేకయు నున్నదని సూత్రోదాహరణముల యర్థము.

సూ. ౮౮. అంతాదులకు వారు పరంబగుచో వాను లోపంబును రుర_ లకు ఉఱ లా దేశంబునగు.

ఉ. అందఱుర్, అందఱర్.

వ్యా. అంత+వారు అనియుండ వాలోపంబును రేఫంబునకు శకటరేఫాదేశం బును గలుగ అంత ఱు అనియు తరువాతి సూత్రముచే తకారమునకు దకారము రాంగా అందఱు అనియు నేర్పడును. ఇట్లే అందఱర్ మొ.

సూ. ౮౯. వాలోపంబుతోటి వాని తకారంబునకు దకారంబగు.

ఉ. అందఱు, ఇందఱు, ఎందఱు, కొందఱు.

వ్యా. అంతాదులకు పరంబగు వారు లోని వాకు లోపము పూర్వసూత్రోక్తము. అది లోపించునప్పుడు అంతాదులయొక్క తకారస్థానమున దకారము తప్పకవచ్చును. అందఱ్వాదులు ఉదాహృతులు.

సూ. ౯౦. ద్వితీయాదులం దసంయుక్త రవర్ణకంబు నత్వంబున కిత్వంబు తఱచుగనగు.

ఉ. వారిర్, వీరిర్, వేరిర్, ఒకరిర్, వాండ్రిర్, వీండ్రిర్, వేండ్రిర్, ఒక్కండ్రిర్. మొ. తఱచుగ ననుటచే ఇరువుర నిత్యాదు లయం దిత్వంబు గలుగదు.

వ్యా. ద్వితీయాది విభక్తులు పరములైనప్పుడు అసంయుక్త రవర్ణకముయొక్క యత్వము పోయి యిత్వమువచ్చును. 'అసంయుక్త' యనుటచే 'వాండ్రర్' ఇత్యాదుల లోను 'రవర్ణకం' బనుటచే ౮౮ సూత్ర విహిత ఱు ఱ లగును ఇత్వప్రాప్తి లేదు. అందఱిర్ ఇత్యాదులసాధువులు. ఇత్వంబు తఱచుగ నగునంటచే 'ఇరువుర' నిత్యాదులగు కొన్నిపట్ల రవర్ణంబు నత్వంబున కిత్వప్రాప్తిలేమి గ్రాహ్యమనుచున్నాఁడు.

సూ. ౯౧. రుర వర్ణకంబులు పరంబులగునపుడు సాధారణంబుగ సంఖ్యా వాచకంబులకు గువర్ణంబు పూర్వాగమంబగు.

తొంబండ్రర్. మొ. పెక్కండ్రు, పెక్కండ్రర్; పెక్కురు, పెక్కురర్; పదుండ్రు, పదుండ్రర్; పదురు, పదురర్; పదుగుండ్రు, పదుగుండ్రర్; పదుగురు, పదుగురర్; వాండ్రు, వాండ్రర్; వారు, వారిర్; మొ.

వ్యా. ఎనమండ్రిత్యాదుల నిరర్యాగమంబు నిత్యమని పెక్కండ్రిత్యాదుల వైకల్పికమని అరసికొనవలెను.

సూ. ౯౪. బిందుపూర్వక డకారంబు పరంబగుచోఁ దుగియంతోత్వాంబుల కత్వంబగు.

వ్యా. పూర్వసూత్రోక్త బిందుపూర్వక డకారము పరమగునపుడు ఎనిమిద్యాదుల యిత్వంబునకును పెక్కుర్వాదుల యుత్వంబునకును అత్వము వచ్చును. ఉదాహరణములం బూర్వసూత్రముక్రింద నే చూచుకొనునది యనుచున్నాఁడు 'ఉక్త' మనుటచే.

సూ. ౯౫. కొండొకయెడ ఱుఱివర్ణకములు పరంబగునప్పుడును నత్వంబగు.

ఉ. చూపఱు, చూపఱిర్, మొ.

వ్యా. రురవర్ణకంబులు పరంబులగునప్పుడు సూ. ౯౩ లో విధింపఁబడిన యత్వమీ సూత్రంబున ఱు ఱి లు పరములగునప్పుడును విధింపఁబడుచున్నది.

సూ. ౯౬. పలుశబ్దంబునకు రురలు పరంబు లగునపుడు గు వర్ణంబును, వలయుచో మీఁద బిందుపూర్వక డకారంబును విభాషనగు.

ఉ. పలుగురు, పలుగురర్; పలుగుండ్రు, పలుగుండ్రర్. మొ.

వ్యా. రు రలు పరములగునప్పుడు పలుశబ్దంబునకు గు వర్ణాగమము నిత్యముగ వచ్చును. పలుగురు పలుగురర్—ఇత్యాది. 'క్వచిద్ గకారోపః' అనుటచే పలువురు పలువురర్—ఇత్యాదులు రూపాంతరములు. గు వర్ణమునీఁద బిందుపూర్వక డకారంబు వైకల్పికముగ వచ్చును. వచ్చిన పలుగుండ్రిత్యాదిగను రాకున్న పలుగురిత్యాదిగను రూపము లేర్పడు.

సూ. ౯౭. ఇరు రెండున కాదేశంబగు. ఉ (ఉక్తము)

వ్యా. రు ర-లు పరములగునప్పుడు గ్వాగమము వచ్చుననుట పూర్వసూత్రముల నుండి యనువర్తింపఁగా రెండు + గు + రు అనియుండ నీ సూత్రముచే రెండునకు ఆదేశముగా 'ఇరు' రాఁగా ఇరుగురు ఇరుగురర్ అనియుం 'క్వచిద్ గకారోవః' అనుటంబట్టి ఇరువురు ఇరువురర్—ఇత్యాదిగను రూపము లేర్పడును.

సూ. ౯౮. ఒకానొకచో నిరుగురున కిద్ద ఱాదేశంబగు.

వ్యా. ఇరుగురు ఇరువురు ననువాని కిట ఇద్దఱను రూపాంతరము చెప్పఁబడినది. ఒకానొకచో ననుట క్వాచిత్కతా ద్యోతనార్థము.

సూ. ౯౯. విభక్తి పరంబగుచో మూఁడు నాలుగుల దీర్ఘంబునకు హ్రస్వంబు బహుళంబుగ నగు.

ఉ. ముగురు (శేషముక్తము)

వ్యా. శేష మనఁగా గ్వాగమమును నలుఁగురు మున్నగు నుదాహరణాంతరములు.

సూ. ౧౦౦. ప్రాప్తహ్రస్వంబులగు మూఁడేల మీఁది వర్ణంబులకు ద్విత్వంబు బహుళంబుగ నగు. ఉ (ఉక్తము.)

వ్యా. మూఁడు శబ్దముమీఁదను ఏ శబ్దముమీఁదను ద్విత్వమువచ్చునని యర్థము ముగ్గురు, ఎవ్వరు. బాహుళకము చే 'నలుగురు'లో ద్విత్వము రాదు.

సూ. ౧౦౧. ఎనిమిదిని వర్ణంబున కత్వంబగు ఉ. (ఉక్తము.)

వ్యా. ఎనిమిది ని వర్ణమున కత్వమువచ్చుట ఎనమండ్రులో గాననగు. 'ఎనుబండ్రులో' ఉత్వము.

సూ. ౧౦౨. పది యుత్వంబున కుత్వంబగు. ఉ. (ఉక్తము)

వ్యా. పది యిత్వంబునకు ఉత్వ మాదేశమగును. ఎప్పుడనుటకు విభక్తిపరంబగు నపుడను జవాబును సూ ౯౯ నుండి యనువర్తింపఁజేసికొనవలెను. పదుగు రను నుదాహరణమును సూ ౯౧ క్రిందఁ జూచుకొనునది.

సూ. ౧౦౩. కొన్నియెడల నవ కగు గానంబడియెడి.

ఉ. 'క. విన నే డగు పర్వము లే, లనఁగా గ్రంథాభిషిక్త మాదిగఁ గల యయ్యనిమిష పర్వములను స, త్యానుకమ్మంతు నూఱగుపర్వ మమరున్ సభలన్' భార. ఆది. ౧ ఆ. 'క. అనుపమ బలులగు కర్ణా, ర్జున వీరుల శౌర్య మహిమ శోభిల్లంగా, నెనిమిదియగు పర్వంబిది, యనఁ బరఁగుం గర్ణపర్వ మతిప్రౌఢ్యంబై.' భార. ఆది. ౧ ఆ. 'చ. పదియగు వేయి నిండుటయుఁ బంక్తిముఖుండు మహాంబునన్ ముదం, బొదవఁగ నిర్వికారమున నున్న శిరంబును గోయఁబూనినన్.' నిర్వ. ౩ ఆ. (ఇట్టి యెడల అవ యనియే యుండవచ్చును. అయినను గ్రంథములయందుఁ బాఠ మిట్లుగపడుచున్నది.)

వ్యా. పూరణార్థమున నవాగమము రాకపోవచ్చుననియు అగు అనునది ప్రయోగింపవచ్చుననియు నీ భారత ప్రయోగములు చెప్పుచున్నవి. అగు ననునది యతి ప్రాసస్థానములం దుండకుండుటచే 'అవ' యని మార్ప వీలున్నను బ్రాచీనగ్రంథము లందలి పాఠము మార్చుట న్యాయముగాదని యిట్లు సూచించియున్నాఁడు. ఇట్టి వానిని మార్ప సాహసించి కాఁబోలు సూరి. బా. అచ్ఛ. సూ ౫౫ లో 'సంఖ్యకుం బూరణార్థంబునం దవాగమం బగు' నని నిత్యముగా విధించెను.

సూ. ౧౦౪. మహద్విశేషణ సంఖ్యావాచకంబులకుం గొన్నియెడల నమహత్కార్యంబు చూపట్టెడి.

ఉ. 'వ. ఇందుఁ బౌలోమ కాలకేయులను నసురు లఱువదివే లుందురు.' భార. అర. ౪ ఆ. 'సీ. జనవంద్యుఁ డగు ధర్మతనయుని బంతి నిత్యంబు పసిఁడి, పళ్లెరంబులఁ గుడుచు బ్రాహ్మణు లతి పుణ్యు లెనిమిది వేలు సమిద్ధమతులు, యతులు పదివేలు వారల కనువినంబు, నన్నపానంబు లందు సహాయ నగుదు.' భార. అర. ౫ ఆ. 'ఎ. కనక భూషణాలంకృతు లయిన పరిచారకులు నూఱువేలు.' భార. అర. ౫ ఆ. 'సీ. వారాకరంబులో వటపత్రశయనుని తో నబ్జనాభులు నూఱు వెగ్గు పదులు.' కాశీ. ౬ ఆ 'సీ. మూఁ డర్బుదములు సముద్యద్భుజాటోప

విజయ గోరియంలు వీరభటులు.' జై. ౫ ఆ. 'వేఁడి వెలుంగు లోలిఁ బది వేల సహస్రము లున్న భంగి స్రవ్యాఁడు వెలుంగు నట్టి బుధవత్సలుఁ డేఁగ నదృశ్యము నొందెను.' భోజ. ౪ ఆ. (కొన్నియెడల ననుటచే పది వేవురు, నూఱు వేఁబం(డ్రు) (లేక) నూఱట యేఁబం(డ్రు) అని యిట్లు మహత్ ప్రత్యయ స్థిరూపంబులుం గలవని యెఱుంగవలయును. కడపటి యుదాహరణములయందలి సంఖ్యావాచకములు తత్సమములు గాన వాని కృత్రిమరూపములు మూఁడర్బుదముల సంఖ్యలవారు, పదివేల సహస్రముల సంఖ్యలవారు అని యేర్పడుచున్నవి.

వ్యా. 'అసురులు...అఱువదివేలు' 'బ్రాహ్మణులు...ఎనిమిదివేలు' 'యతులు... పదివేలు.' 'పరిచారికులు...నూఱువేలు' 'అబ్జనాభులు నూఱు నైదుపదులు.' 'వీరభటులు మూఁడర్బుదములు'—వీనిలో విశేష్యములు మహద్వాచకములయ్యు వాని విశేషణములు అమహత్ప్రత్యయాంతములై యున్నవి. వేఁబం(డ్రు) నూఱట యేఁబం(డ్రు) అని యిట్లు మహత్ప్రత్యయాంతరూపంబులుం గలవు కాన పూర్వంబుల విశేషరూపము లుగఁ గొనుట యుక్తము.

సూ. ౧౦౫. ఔపవిభక్తికాంతంబులగు చేయి నేయి లోనగు శబ్దంబుల యుపధాచ్చునకు హ్రస్వంబును మీఁది హల్లునకు ద్విత్వంబును ప్రథమైకవచనంబునందు వైకల్పికంబుగ నగు.

ఉ. చేయి, చెయి, చెయ్యి; నేయి, నెయి, నెయ్యి; మొ. ఇతర స్థలంబులయందు, ఉ. చేతిలోఁ జేతికి నేతితోఁ, నేతికి మొ.

వ్యా. ఇందని హ్రస్వద్విత్వములను సన్నియోగశిష్టములుగ విధించుటచే రెండు కార్యములను యొకరీతిప్రవృత్తి నొందును గావున "చేయి" అను శబ్దముయొక్క సాధుత్వము సందిగ్ధముగ నుండును. కావున హ్రస్వము వైకల్పికమనియును, దాని భావాభావపక్షములందు ద్విత్వము వైకల్పికమనియు సమన్వయించుకొనవలయును. ఈ సమన్వయమున దీర్ఘపక్షమున ద్విరుక్తంబగు హల్లు పరంబగునపుడు అచ్ఛికంబగు దీర్ఘంబునకు హ్రస్వంబగు' నను బా. సమా. సూ. 13 చే హ్రస్వమువచ్చును గాన చేయి చెయి చెయ్యి యను రూపత్రయమును సరసముగా సిద్ధించును.

సూ. ౧౦౬. ఊరు చోటు మేన్వాదులు స్థగ్విషయంబులు.

ఊరు లోనగువానికిఁ దృతీయయం దత్వము సంప్రాప్తింపదు గాన 'ఔపవిభక్తిక సామాన్యమత్వం స్యాత్సప్తమీ తృతీయార్థే' అను సూత్రమున కవి విషయములుగాక 'కేషాంచి దుదంతానాం వేలివిభక్తౌ పునో లుక్ స్యాత్' అను సూత్రమునకు విషయంబు లగుచున్నవని యెఱుంగ వలయును.

వ్యా. చింతామణిలో 'ఔపవిభక్తిక సామాన్యమత్వం స్యాత్సప్తమీ తృతీయార్థే' యను సూత్రముచే గొడ్డటన్ గోరన్ ఇత్యాది తృతీయా సప్తమ్యర్థములుగల యన్నంతములను సామాన్యముగ సాధించి ఊరన్ చోటన్ ఇత్యాదులలోఁ దృతీయార్థ స్ఫురణములేక ఊరియందు చోటునందు మున్నగురీతిని సప్తమ్యర్థస్ఫురణమే సుప్రసిద్ధమై యుండుటచే 'కేషాంచి దుదంతానాం వేలివిభక్తౌ పునో లుక్ స్యాత్' అను విశేషసూత్రమునకు లక్ష్యములుగా సాధించి తృతీయార్థకత నచ్చట వారించి యున్నాఁడు. చిన్నయసూరి యన్నంతముల నన్నింటిని 'ఔపవిభక్తికముల తృతీయా సప్తముల కత్వం బాదేశంబు బహుళంబుగా నగు' నను అచ్చిక. సం. ౩౭ కి లక్ష్యములుగఁ జేసినాఁడు. ఊరన్—ఇత్యాదులకుఁ దృతీయార్థకతను సూరి వారింపకయున్నందున డాదియనివెంచి ప్రౌఢవ్యాకరణకారుఁడు ఈ విషయమునఁ జింతామణి మార్గమే సమంజస మని బోధించుచున్నాఁడు. కాని సూరి సూత్రమందలి 'బహుళంబుగా' ననుట వలననే ఊర నిత్యాదులకుం దృతీయార్థకత లేమి యాదిగాఁగల సాంప్రదాయముల కును గ్రహణము గలదని ఎంచఁదగును.

సూ. ౧౦౭. సద్రుతం బంతశబ్దంబు తన తమ పూర్వకంబు స్వాయత్తార్థకం బగు.

ఉ. తనయంత, తనంత; తమయంత, తమంత; 'చ. వనితె దనంతఁ దా వలచివచ్చినఁ జుల్కనగాదె యెరికిన్.' స్వా. ౩ ఆ. మొ.

వ్యా. తన తమ శబ్దముల నంటివచ్చు నంతశబ్దము సద్రుతం బైనప్పుడు తమంతటతానే తమ తట తామే యను నర్థమువచ్చును. సద్రుతముకానున్న పరిమాణాదులం దన లేక తమపాటి యను నర్థముగల్గును.

సూ. ౧౧౧. ఆదరార్థంబునం ద్విరుక్తియగు.

ఉ. కృష్ణకృష్ణ, హరిహరి మొ.

వ్యా. ఏయే యర్థములందు శబ్దములు ద్విరుక్తములగునో నాలుగుసూత్రములచేఁ దెలుపువాఁడై ఇందు ఆదరార్థంబునందు శబ్దములకు ద్విరుక్తి గల్గుననుచున్నాఁడు. కృష్ణ కృష్ణ హరిహరి యనుటచే కృష్ణహరులయందలి యాదరాతిశయము గ్రాహ్యమనుట.

సూ. ౧౧౨. అత్యంతార్థంబునందు నగు.

ఉ. ఔరౌర, కటకటా, మొ. కనికని, వినివిని మొ. 'తద్గు ణౌఘముల్ వినివిని, కళా. ౭ ఆ. మొ.

వ్యా. ద్విరుక్తియనుట పూర్వసూత్రమునుండి యనువర్తించును—అత్యంతార్థంబునందును మిక్కిలి యను నర్థమందును ద్విరుక్తి వచ్చుననుట. ఔరౌర కట కటా యనుటలచే నాశ్చర్యసంతాపముల యత్యంతత్వము గ్రాహ్యము. కనికని వినివిని యన్నప్పుడును మిక్కిలి కని మిక్కిలి విని యని యర్థము.

సూ. ౧౧౩. కొన్నియెడలంద్వరితానాదరార్థంబుల వెంటను నగు

ఉ. లే లెమ్ము, పో పొమ్ము. మొ.

త్వరితార్థమనం ద్వరపెట్టు నర్థము. అనాదరార్థమనఁగా ననాదరించు నర్థము. లే లెమ్ము—ఇట ద్విరుక్తి త్వరితార్థకము. పో పొమ్ము—ఇట ద్విరుక్తి త్వరితార్థక మేని అనాదరార్థక మేని కావచ్చును.

సూ. ౧౧౪. కొన్నిశబ్దంబు లర్థవిశేషంబున ద్విరుక్తంబులయి యదంతం బులు నగు.

ఉ. ఒండొండ, తరతరము. (ఇట నర్థవిశేషము క్రమముగా ననుట.

వ్యా. కొన్నిశబ్దములు ద్విరుక్తము లగుటయే కాక యదంతములుకూడ నగును. అప్పుడు వానికి అద్విరుక్తము లైయున్నప్పటి సామాన్యార్థమును కాక విశేషార్థము

భార. విరా. ౧ ఆ. 'క. తనపూర్వ తపస్థానం, బని యనురాగిమున బదరినంతయుఁ జూడఁగ, మనమునఁ దలపోసి యొకం, ను పుణ్య రాత్రమనఁ గడుం గుతుకమునఁ. వ. అచ్చోటం వసియింపం జని.' హరి. ఉ. ౫ ఆ. 'క. ధీర మతు లిట్లు చేసిన, వా రవ్వరుఁ గలరె.' భార. ఆది. ౭ ఆ. 'ఎంతయుం దనరఁ బతులయ్య మన్నంచుండు.' భార. ఆది. ౧ ఆ. 'అనుటయుఁ దిన్న నవ్వనగి.' భార. ఉద్యో. ౩ ఆ. 'మెఱుఁగల విలాస విభ్రమ లక్ష్మిల్, వెక్కటియును నొక యుత్ప్ర, నెక్కొన.' స్వా. ౪ ఆ. మొ. అవ్యయములకు:— సీ. అమృతాశనంబు సేయకయును దేవ నాకజరామరత్వంబు నందుటయును.' భార. ఆది. ౨ ఆ. 'క. పంక్తికంధరు నెట్లుం, జంపఁగఁ జాలక దోషము, పెంపునఁ గారాగృహమునఁ బెట్టఁగఁ బంచెఁ.' నిర్వ. ౭ ఆ. 'క. ఏటు వడి మూర్ఛ వోయిం, బోటరి దైత్యుండు దలిసి.' ఉ. హరి. ౪ ఆ. మొ. (౩) పాదపూరణమునందు నామపదములకు—'అందఱుఁ విభులై' భార. ఆది. ౫ ఆ. 'రేయిపగలు నిద్రయు సెప్పడెఁగఁగ.' భార. ఆది. ౧ ఆ. 'ఇ ప్వీరుల కను నభీష్ట మిదియం మొదలుగాఁ.' భార. ఆది. ౭ ఆ. 'భాసిలుఁ దత్పురి కోట మిక్కిలిఁ మహిమను.' గళ. ౧ ఆ. 'ఎ, గీ. మున్ను ముచ్చిచ్చను విరాళి గొన్నచోటు' స్వా. ౨ ఆ. 'విపంచి నిన్న మొదలుఁ నీవంటమింజేసి.' స్వా. ౩ ఆ. 'ఇ ప్పుడిం ఈ హర్మ్యమునం జరింతు మెపుడుఁ.' స్వా. ౨ ఆ. ఇట్టు లంతయుం, పెద్దయుం, తద్దయుం. మొ. అవ్యయములకు—'ఆధారము లేకను.' (లేకను=లేకయును) భార. ఆది. ౨ ఆ. 'గోలడకం దిగిచి.' (గోలడకం=గోలడకయును) భార. ఆది. ౪ ఆ. 'ఎ. గీ. అనిలుఁ డను దంతి హోయి తోడ్కొనియుఁ దెచ్చె' భార. ఆది. ౩ ఆ. 'సీ. కమలాప్తుఁ డుద యింపకయుం మున్న బుట్టువుని మునుఁగు సంగమతీర్థమునకు జేఁగి.' పాండు. ౫ ఆ. 'క. ఏ నొకటి విన్నవించెద, దానవకులమదన పెద్ద తడవున నుండిం, బూని వినిపింపఁగల పని.' ఉ. హరి. ౫ ఆ. మొ.

తఱచుగ ననుటచే, ను శబ్దము కొన్నిటి కొకప్పుడు వచ్చును, ఒకప్పుడు రాదని యర్థము గ్రహింపవలెను. దీని కుదాహరణములు పాదపూరణము

ణముకై యం. 'మున్ను మచ్చివచ్చును అనుచోట ను శబ్దమునకు అపార్థకత యగపడుచున్నది. కావునం దాని పాదపూరణార్థ నువర్ణయుతముల నడిమినుండి యెడలించి అర్థవిశేషార్థ నువర్ణయుతములలోఁ జేర్చుట మేలు. శేషషష్ఠియందు యుక్తి లోపించినపుడు లాగమాంత బహువచనంబుమీఁద సముచ్చయార్థమున నువర్ణము చూపట్టెడు ననుటకు ఉదా. రెండు కడల సంభోనిధిఁ గడిసియుండు.' 'లాగమాంతమనుట మీమాది పర్యుదాసార్థ' మనుచున్నాఁడు మీమాఘటిత షష్ఠీసమాసములలో నీ నువర్ణప్రాప్తి లేదని యర్థము.

ఇది బాలబోధసుధాపరనామ కుమారదేవపండితీయ మను

ప్రౌఢవ్యాకరణ వివరణమునందు

శబ్దపరిచ్ఛేదము.

గుఱించు ధాతువుల క్త్వాంతరూపము లనుట స్పష్టమైనను వీనిం బృథక్పదములుగ భావించి కాఁబోలును సూరి ప్రత్యయములలో వీనిని స్మరింపలేదు.

సూ. 3. అయ్యది వ్యవహితంబు నగు.

ఉ. 'సీ. అజ్ఞానసనుఁడు తన్ను నస్థితో గుఱిచి యఱించుటగోరి సృజించె సురల.' హరి. పూ. ౧ ఆ.

వ్యా. గుఱిచి, ద్వితీయాంతమున కనుప్రయుక్త మగునని పూర్వసూత్రము. దానికి ముందటి ద్వితీయాంతముతో వ్యవధానంబును ప్రయోగములం గానఁగు నని ఈ సూత్రము. ఉదాహృతమున తన్నను ద్వితీయాంతమునకును 'గుఱిచి'కని 'నస్థితో' వను పదమువలన వ్యవధానము నరసికొనవలెను.

సూ. ౪. కొన్నియెడలఁ జేత విభక్త్యర్థక వర్ణకంబులకును వఁన వర్ణకంబునకును దఱచుగఁజేసి యనుప్రయుక్తం బగు.

ఉ. 'వికవిప్రసంబోధనఁజేసి.' భార. ఆది. ౧ ఆ. 'అభీష్ట వరంబు లిచ్చుటంజేసి.' భార. అర. ౨ ఆ. 'అసహ్య విస్ఫుగ్ర ధూమానేతనహాతిఁ జేసి.' ఆది. ౧ ఆ. 'బహు వేదఘోషములఁ జేసి.' భార. అర. ౧ ఆ. 'సంప్రయోగమునఁ జేసి' 'దీనను జేసి' భార. సభా. ౧ ఆ. 'తే. ఇంద ఱును నిన్నిభంగుల నిడుమ కుడువ, వలసె ధర్మజుదుంభవువలనఁ జేసి.' భార. విరా. ౨ ఆ. తఱచుగ ననుటచే నొకానొకచో నేకవచనంబున నుకారంబుమీఁది ద్వితీయయుఁ దృతీయావిభక్త్యర్థక మగుచుఁ నని తెలియవలయు. ఈ యర్థమునకు 'ఇతరత్ర చ ద్వితీయా.' అను స్థాన నియమశూన్యవిధియుం నవకాశమిచ్చుచున్నది. ఉ. 'ఎ, గీ. తండ్రి పనుపుఁ, జేసి ముదిమిగొని జవ్వనంబిచ్చెఁ, బూరుఁ డను సుతుండు భూరియశుఁడు.' ఆది. 3 ఆ. 'సీ. వెలిఁబెట్టి గేబాడబులు పరాశరుఁ బట్టి దాశకన్యాకేళి తప్పుఁజేసి' స్వా. ౨ ఆ. మొ. ఇట్లనుటచే 'ఇవ్విధము నాననముల్ గలవార.' (నిర్వ. ౪ ఆ) అను నిట్టి ప్రయోగ ములును నిర్దుష్టము లగుచున్నవి.

వ్యా. చేతవిభక్త్యర్థక వర్ణకంబులఁగా 'జడంబు తృతీయార్థమునకు ద్వితీయా బహుళంబుగా నగు' నను బాల. కా. సూ. ౨౭ చేఁ దృతీయార్థమున వచ్చు ద్వితీయ- దీనికిని-పంచమి ప్రత్యయమగు వలనకును చేసి యను ప్రయుక్తమగును.

సూ. ౫. అయ్యర్థది యొక్కచోఁ బెక్కుచోట్ల నొక్కటియె చాలెడి.

ఉ. 'సీ. వలరాజు సచివుల వడుపున బెడఁగగు కర్కశస్తనములఁ
గరము వాఁడి, చూఁచుకల నతిరాగ సురుచిరాధరముల మదవిలాస
లస మందగతుల, వక్త్రాలకంబుల వలంచనకియుందుల దర్పగద్గద భాషిత
ములఁ జేసి.' భార అది. ౭ ఆ. (ఇటఁ జేతవిభక్త్యర్థక లవర్ణకముపై
నెల్లెడల నుండవలసిన చేసి యొక్కచోటనె యున్నది.)

వ్యా. స్తనములఁ జేసి......చూఁచుకలఁ జేసి......సురుచిరాధరములఁ జేసి... గతులఁ జేసి......అలకంబులఁ జేసి......పిఱుందులఁ జేసి......భాషితములఁ జేసి — ఇట్లేడుతావులను పూర్వసూత్రము ప్రకారము ఉండవలసిన చేసి 'భాషితములఁ జేసి' యను నొక్కచోట మాత్రమే యుండియు నర్థభంగము గల్గమికి 'చాలెడి' నను చున్నాఁడు.

సూ. ౬. ఒకానొకచోఁ దోడకుఁ బ్రత్యేక ప్రయోగంబునుం జూపట్టెడి.

ఉ. 'తే. స్తంభగతరత్న పుత్త్రిక తనదుబోఁటి, యని విలోకించి
తోడ మాటాడకునికి, నలుగడలు చూచి తెలిసి యచ్చెలువ బెదరి,
వెడల నుంకింపఁ జేవమ్మి యొడిసిపట్టె.' (తోడక = తనతోడ)
రామా. ౪ ఆ.

వ్యా. తృతీయా ప్రత్యయమగు 'తోడ' వి ప్రాతిపదికమునకుం గూర్పఁబడక తనంత వేఱుగాఁ బ్రయుక్తమై చూపట్టుచున్నదనుచున్నాఁడు. ఇచ్చటితోడ తృతీయా- ప్రత్యయము కాదనియు 'వెంటనె' యను నర్థము గల పదమనియుం దెలంపరాదా ?

సూ. ౭. కొన్నియెడల నుశబ్దప్రయోగమునం దోడకు లోపంబును
వ్యవహితత్వంబును బహుత్వంబునం గానంబడియెడి.

ఉ. 'ఎ, గీ. అతనికిఁ బరలోక, విపుల శాస్త్రదృష్టి వెలయఁజేసె, నాపగాతనూజుఁ డఖిల బాంధవులయు, బ్రాహ్మణులయుఁ దోడ భాను నిభుఁడు.' భార. ఆది. ౪ ఆ. 'క. నెమ్మిని ధర్మజు నలువురు, దమ్ములుఁ దమ వస్త్రములయుఁ దమశస్త్ర వరూ, ధమ్ములతోడను సకల హిరణ్యముగఁ బాయంగ వలయుఁ దాస్యమువలనన్.' భార. సభా. ౨ ఆ. మొ.

వ్యా. 'అఖిల బాంధవులయు' 'తమ వస్త్రములయుం' నన్నయెడలం దోడకు లోపంబును, బ్రాహ్మణులయుఁ దోడనన్నచో యువర్ణ వ్యవధానముం గలదు. ఈ లోప వ్యవధానములు బహువచనముననే గల్గుననుట విశేషము. 'ను' శబ్ద విరహితముగను నిట్టి ప్రయోగము ఉన్నది. ఉదా 'అధిపుల సేనల తోడ సైన్యఁ గొరగా దధిపా.' భార. ఉద్యో. ౨ ఆ.

సూ. ౮. ఒకానొకచోఁ దోడకుఁ దోడుత యని రూపాంతరంబును గలదు. అయినను దానికివలె దీని కితర కార్యంబు గలుగదు.

ఉ. 'చ. పగతుర చేతఁ జిక్కఁబడక ప్రాణముతోడుత నున్నవాఁడవే.' భాగ. ౧౦ స్కం. పూ. మొ.

వ్యా. ఒకానొకచో ననుట క్వాచిత్కత్వ ద్యోతనార్థము. ఇతరకార్యం బనగా లోపవ్యవహితత్వాది.

సూ. ౯. చతుర్థికిం బొంటె వర్ణకంబు నగు.

ఉ. 'క. అనఘుల శాస్త్రవిధిజ్ఞుల, ననురక్తులఁ బితృపితామహ క్రమమున వచ్చిన విప్రుల మంత్రులఁగా, నొనరించితె కార్యసంప్రయోగము పొంటెన్.' భార. సభా. ౧ ఆ. పక్షమునఁ గార్యసంప్రయోగముకొఱకు. మొ.

వ్యా. ఈ ప్రత్యయము బాలవ్యాకరణమునం జెప్పఁబడనిది. సూత్రస్థ నుశబ్దము కొఱకాది సముచ్చీకరణార్థకము.

సూ. ౧౦. ఉండి పదంబు పరంబగుచో వలన కంటె వర్ణకమట్లు నవర్ణకంబు నగు.

ఉ. 'క. సనత్కుమారుఁడు మహాత్మకుఁ, జనుదెంచె బ్రహ్మలోకం

బుననుండి.' భార. ఆది. 3 ఆ. మొ.

వ్యా. సూరి. 'ఉండి శబ్దము పరంబగునపుడు వలనకు ద్వితీయా సప్తములు ప్రాయికముగా నగు' (బాల. కా. సూ. ౧౧) నని సామాన్యముగా సూత్రించినను నా వర్ణకమునకు ఉదాహరణము చూపకుండుటచే నవర్ణ కోదాహరణములు అసాధువులని భ్రమింపఁదగదు అనుటే ఈ సూత్ర ప్రయోజనము.

సూ. ౧౧. వలన కాదేశంబగు ద్వితీయా సప్తములమీఁది యుండికి

లోపంబు బహుళంబుగా నగు.

ఉ. ద్వితీయమీఁది యుండికి—'క. విచ్చేయుము మదిలిగర్భముఁ, జెచ్చెర వెలువడుము మహాత్మ.' భాగ. ౮ స్కం. మొ. సప్తమిమీఁది యుండికి—'ఆ. రక్తంబు, వదనగహ్వరమున వెడలె.' భాగ. ౧౦ స్కం. పూ. 'గీ. ఉదుపథంబున జాఱు నుడుప్రతతి భాతి మెడహారములవెన పుడమిఁ దాఁక.' పాండు. ౫ ఆ. 'నూతిలో వెలువడఁ గోమలిం దిగిచె.' భార. ఆది. 3 ఆ. 'క. నలుఁ దొల్లి యాక్రమించిన, కలి కర్కోటక విషంబు గ్రక్కుచు నోడలన్, వెలువడి.' భార. ఆర. 3 ఆ. 'క. హెచ్చిన సంభ్రమంబున నచేరులు బ్రద్దల వారలెక్కడన్, వచ్చిరియు మోఁదిరా కొలువు వారి.' కళా. ౧ ఆ. మొ. (గర్భమున్ = గర్భమునుండి, ఎక్కడన్ = ఎక్కడనుండి. ఇట్టింతట నూహ్యంబులు.) బహుళగ్రహణముచే నందు మీఁది యుండికి లోపంబు గలుగదని యూహ్యమగునది. ఈ సూత్రము నిట్లు చెప్పుటను నంద్వతర సప్తమ్యర్థక వర్ణకంబులమీఁది యుండికి లోపంబువచ్చుట ప్రయోజనంబు.

వ్యా. పంచమీ ప్రత్యయమగు వలన కాదేశముగ ద్వితీయాసప్తములు వచ్చుననియు నట్లు వచ్చునపుడు దానికంటె పరంబైన యుండికి లోపము వచ్చుననియు సూత్రించుచున్నాఁడు. ప్రదేశవాచకమగు వలన శబ్దము మొందఁగలదు. దానికి ద్వితీయార్థకము లాదేశము లైనను స్థానివద్భావముచే నిగర్థము నే చెప్పఁగలవు. అప్పుడు

ఉండి యనునది బుద్ధిస్థమైయుండుటచే నుండుటకు స్థానికి లోపము విధింప నవసరమే లేదు. ఎల్లి+ఉండి వచ్చెదను. ఎల్లి=రేపు. 'లగ్నంబెల్లి' భాగ. ౧౦ స్కం.

సూ. ౧౨. కొన్నియెడల హేతువునందున్నంత క్రియామీఁదను బట్టి వర్ణకంబు విభాషనగు.

ఉ. 'తే. బ్రహ్మపుట్టించు మనుచు నారాయణుండు, హరుఁడు హరియించు భువనంబు లవసరమున, నెట్టు సమకూరు సీరికి నీ ప్రభావ, మీవు గలుగంగఁ బట్టిగా కిందువదన.' కాశీ. 3 ఆ. పక్షంబునఁ గలుగుటంబట్టి. మొ.

వ్యా. బాల. కార. సూ. ౧౮ చే హేతువులగు గుణక్రియలకుఁ బట్టి వర్ణకము విహితమైయుండెను. క్రియలని సామాన్యముగఁ జెప్పినను ఉదాహరణములలో 'వచ్చుటంబట్టి' యని భావార్థకటాన్వితమును మాత్రమే ఇచ్చియున్నందునను, అన్నంత క్రియలమీఁదఁగూడ హేత్వర్థమునం 'బట్టి' కానగుచున్నందునను ప్రౌఢకారుఁ డిట్లు సూత్రింపవలసివచ్చెను.

సూ. ౧3. షష్ఠీ స్థానికంబగు కు వర్ణకం బొక్కొక్కచో ద్వితీయాది విభక్తులకుమాఱుగాఁ దత్తదర్థంబులం జూపట్టెడి.

ఉ. ద్వితీయకు—వేటకుఁబోయిరి, పొలమున కేఁగెను. పక్షంబున 'వేటఁబోయిరి.' భార. ఆర. ౬ ఆ. 'అవిభుండు పొలమేఁగెను.' వి. పు. ౭ ఆ. మొ. ఇట నొకానొకచోఁ గొఱకు కయి వర్ణకంబులు నయ్యెడి ఉ. 'చ. అతఁ డొకనాఁడు వేటకొఱకై తను నేలినవారు వేడ్కతోఁ, బొంతముగఁ బైన మాటఁగని.' భల్లా. ౭ ఆ. 'అడవికి వేటకై యరిగి,' పాండు. ౫ ఆ. 'చ. చిరముగ బ్రహ్మకుం దపము చేసి.' భార. ఆది. ౨ ఆ. పక్షంబున బ్రహ్మనుగూర్చి తపము చేసి మొ. తృతీయకు—'క. లోకోత్తర చరితుం డగు, నాకాధ్యుతనూజ నీకు నారాధ్యను.' భార. ఆది. 3 ఆ. 'అసురులకును బూజనీయులు.' హరి. పూ. ౨ ఆ. మొ. పక్షమున నీచే నారాధ్యను మొ. 'చ. అరిమును శ్రే... నీకు

ఉ. వీప్సయందు—'మ్రాని మ్రానికి నొరిగి యొరిగి యడుగు.' భార. ఆం. ౨ ఆ. 'ఇండ్లిండ్లకు.' కళా. ౩ ఆ. మొ. కాలపరిమితి యందు—'క. కొండొకసేపునకుఁ దెలిసి,' హరి. ఉ. ౧ ఆ. 'క. నెట్టన వర్షావధికిం, బెట్టంగల యప్పనములు పెట్టియు.' వి. పు. ౭ ఆ. 'ఎ. గీ. అలిగి పార్థుని శిర మాఱునెలల కుర్విఁ ద్రెళ్లఁ గసిమించి దేవి యదృశ్య మయ్యె.' జై. ౮ ఆ. మొ.

వ్యా. బాలలోని 'ఆమ్రేడితంబు పరంబగునప్పుడు విభక్తిలోపంబు బహుళంబుగా నగు' నను సూత్రముచే మ్రానికిన్ మ్రానికిన్ అని యున్నప్పుడు విభక్తిలోపము రాఁగా మ్రాని మ్రానికిన్ అనురూపము సిద్ధించుచునేయున్నది. కావున నీసూత్రము పిష్టపేషణము. ఆమ్రేడితము వీప్సాదులందు సంభవించుచునే యుండునుగదా. కాల పరిమితియందలి క్వాగమమునకును బాల. యందలి బాహుళకముచే గ్రహణము గల్గును. ఐనను స్పష్టార్థ మీసూత్రమని యెంచఁదగును.

సూ. ౧౪. ధాతుజవిశేషణ భావార్థక పూర్వావ్యవహితాఽవ్యవహిత కర్తృపద ప్రథమకుఁ దఱచుగ యొక్కషష్ఠియగు.

ఉ. (౧ లో ౧) ధాతుజ విశేషణపూర్వ వ్యవహిత కర్తృపద ప్రథమకు—'బాహుకు రథంబు గడపు నేర్పున కచ్చెరు వడి.' భార. అర. ౨ ఆ. 'తన మునుపడ్డ బన్నములు.' ఉద్యో. ౩ ఆ. 'చ. కని తన మున్ను గన్నటులు గామికి విస్మయవారిరాశిలోన్, మునుఁగుచు.' హరి. ఉ. ౫ ఆ. 'నా యొనర్పం బూనిన కళాపూర్ణోదయంబు.' కళా. ౧ ఆ. (౧ లో ౨) ధాతుజ విశేషణ పూర్వావ్యవహిత కర్తృపద ప్రథమకు— 'అన్నలభూపాలకు పోయిన వలను.' భార. అర. ౨ ఆ. 'వ. వాని తిన్నన వృషభ గోమయ భక్షణంబు చేసి.' భార. ఆది. ౧ ఆ. 'తే. ఎఱుక గలఁడేని మఱి శక్తుఁడేని నన్య, లన్యులకు హింసగావించు నపుడు దానిఁ, బూని వారింప కున్న నప్పురుషుఁ డేఁగు, హింస చేసిన వారల యేగు గతికి.' భార. ఆది. ౬ ఆ. 'వ. అపార పారావార పర్యంత మహీతలంబు నందు నాయాడని రాజు లెవ్వరును లేరు.' భార. అర. ౨ ఆ. 'తే. ఆ జర

త్కారుఁ గని చెప్ప మయ్య వాని, నెఱుఁగుదేని మా పడియెడు నీ యవస్థ.' 'వ. నీ చేయు వేదన నన్నుం బాఁక నోపదు.' భార. ఆది. ౭ ఆ. 'సీ. హంసచేఁ దన వినినంత కంటెను రూప విభవాతిశయముల వెలుఁగుదాని' భార. అర. ౨ ఆ. (౨ లో ౧) భావార్థక పూర్వ వ్యవహిత కర్తృపద ప్రథమకు—'వ. మన పుట్టు బుద్ధి యెఱుఁగుట మొదలు.' హరి. పూ. ౫ ఆ. (౨ లో ౨) భావార్థక పూర్వావ్యవహిత కర్తృపద ప్రథమకు—'క. సగరుఁ, డుజ్జనపాలుఁడు చనుటఁ గృశుఁ డను, మునిపలన నెఱిఁగి.' భార. ఆది. ౨ ఆ. మొ. తలఁచుగ ననుట చే బాహుకుండు రథంబు గడపు నేర్పునకు ఇత్యాదు లెఱుంగునది. 'క. సేము వ్రతింపని శాస్త్రములే మాపతింపని శ్రుతులే.' అను. ౬ ఆ. మొ.

వ్యా. నలుదెఱంగుల కర్తృపదముల ప్రథమకు యొక్క షష్ఠి బహుళముగ వచ్చునని సూత్రార్థము. నలుదెఱంగు లేవియనఁగా (౧) ధాతుజ విశేషణమునకు ముందుండి ఆవిశేషణముతోఁ గూడ వ్యవధానము నందియుండునది. (౨) తాదృగవ్యవధానంబు లేకయు ధాతుజవిశేషణమునకు ముందుండునది. (౩) భావార్థకమునకు ముందుండి యద్దానితోఁ గలిసియు శబ్దాంతరములవలన వ్యవధానము నందియుండునది. (౪) తాదృగ్వ్యవధానముఁ దొలఁగి భావార్థకమునకుం బూర్వమైయుండునది. 'వారల యోఁగుగలిక' అను భారతోదాహరణమున లేచ్ఛష్టింత్యాత్తను అవధారణార్థకమును గ 'గలిక'నుచోట నన్వయించుకొనవలసినదానింగా సైతము గొననగును. భారతమునందలి అవధారణార్థకముల కన్వయ మిప్పటి మన వ్యవహారమునకుఁ గొంచెము దూరమై పైనఁజూపినరీతి నచ్చటచ్చట నగపడుచుండును.

సూ. ౧౬ యుక్కునకు లోపంబు బహుళంబు.

ఉ. 'ఉ. ఇమ్ముగ సర్వలోకజనులవ్వనిచూని ముఖామృతాంశు బింబమ్మున నుద్భవంబయిన భారత వాగమృతంబు కర్ణరంధ్రమ్మున నంజలిం దవిలి త్రావుదురు.' భార. ఆది. ౧ ఆ. 'ధర్మజు నలువురు దమ్ములు' భార. సభా. ౨ ఆ 'తే. ఇరులు గెలిచిన యంతకు పురేందుముఖుల, కొరులు మరుఁ డను వేఁటకాఁ డురులువేసి, మరులు గొలం

కంగ లేఁడయ్యె మనుజవిభుని, సరులు లేని ద్రుక్షాంజన శాబకముల.' నై. 3 ఆ. 'సీ. వారివ ధమ్మిల్ల భారావకలిత దివ్యామోద నవపుష్ప దామములయం.' భార. ఆది. 3 ఆ. (వారివ=వారి వేయైన. ఇక్కడ నిది షష్ఠ్యంతమునకు విశేషణముగనుక ప్రథమ.) 'ఏ, గీ. అపుడు సమ్మెటకోలల యంకుశముల, చేలు కోలల ప్రేటుల (సమ్మెటకోలలయొక్కయు, అంకుశములయొక్కయు, చేలు కోలలయొక్కయు ప్రేటులచేత నని యర్థము. ఇట అంకుశముల ప్రేటులనఁగా లక్షణచేఁ బోటులనని యెఱుంగునది.) ద్రోణ. 3 ఆ. 'క. నర గో మృగ సింహంబుల, కరుణములగు రోగ వేగ కలితాక్రోశ, స్వరములు పెక్కయ్యె.' హరి. పూ. ౬ ఆ. 'క. తాతల తండ్రుల తరమున నేతెంచిన వృత్తి దక్క.' విజ్ఞా. వ్య. బహుళ గ్రహణముచే ధాతుజ విశేషణ భావార్థకముల ముందటి కర్తృ పదంబులయొక్కకు నిత్యంబుగ లోపంబని యెఱుంగవలయు.

వ్యా. 'సమాస విభక్తికి లోపంబగు లట్టునకుఁగాదు.' అను బాల సమా. సూ. ౨౫ చే విభక్తుల కన్నింటికి సమాసములయందుమాత్రమే లోపము సిద్ధించుచున్నది. యొక్కకు మాత్రము వ్యస్తముగను లోపముండుటచే దానిని సాధింప నీ సూత్రారంభము.

సూ. ౧౭. ఒక్కచో నుదంతంబగు న జడంబు తృతీయకును సవర్ణకంబు గానంబడియెడి.

ఉ. 'ఉ. ఏపునఁ గిట్టియేనుఁగుస నేనుఁగు ప్రైచుచు వాజివాజిచే, రూ పడఁగంగ మోఁదుచును.' రా. యు. కాం. (దీనికి బ్రయోగాంతరంబు మృగ్యంబు.)

వ్యా. ఉదంతజడము తృతీయకుమాత్రమే బాల. కార. సూ. ౨౩ చే సవర్ణకంబు విహితము. ఇట నుదాహృత ప్రయోగమునమాత్రమే న జడంబునకును ఆ కార్యము గల్గియున్నది. ప్రయోగవైరళ్యముంబట్టి సూరి దీని నుపేక్షించియుండును.

సూ. ౧౮. కొన్నియెడల నజడంబు తృతీయాసప్తములకును బహుత్వాం

పూ. ౫ ఆ. 'ఆ. ఎఱుకు నన్నుసుఱక యేసిన శరములు, నెఱకు లాఁడి.' భార. అర. ౧ ఆ. 'చ. పొరిఁబొరి మోము బాష్పజలపూరము గ్రమ్మఁగ నూర్ధ్వబాహుఁడై.' భార. శల్య. ౧ ఆ. 'అవ మిడినఁ బగిలి పోవు టయా.' భార. స్త్రీ. ౧ ఆ. 'ఎ, గీ. ముట్టి కందముల్ పడఁ గత్తి పెట్టి పెట్టి.' హరి. పూ. ౬ ఆ. 'శా. భావంబుల్ భయ ముజ్జగించి చోరుఁ డీ భవ్యాద్రిచా టందఱుఁ.' హరి. పూ. ౭ ఆ. 'మ. కనుగొంటిం బర మేష్ఠిఁదొట్టి సురసంఘం బేకతం బుండగన్.' హరి. పూ. ౫ ఆ. 'ఎ, గీ. లీలఁ బేరోలగంబున్న నీలవర్ణు.' ఉ. హరి. ౪ ఆ. 'శార్ఙ్గ గుణగాఢ రవంబు నభంబు నిండఁగాన్.' నిర్వ. ౩ ఆ. 'అదియుంగా నేను వచ్చి.' రా. అర. కాం. ౨ ఆ. 'జనయిత్రి చిచ్చుఱికిన.' [illegible] ౦ ఆ. 'తే. పంకము గొరిజ దిగఁబడ పఱవ లేవు, మన్న లివ్వేళ నేగటి మన్నులందు.' స్వా. ౪ ఆ. 'మొ. పక్షాంతరమునఁ దీర్ఘమం దాఁడి,' మొ. ఇట్టి ప్రయోగములచేత 'అన్యస్యా క్వచిద్ భవే చ్చేన్నాస్య' అను శబ్ద శాసనుల సూత్రము సార్థక మగుచున్నది.

వ్యా. 'అన్యస్యాః క్వచిద్ భావే చ్చేన్నాస్య' (చింతామణి) 'ఒకానొకచో నొక విభక్తికి మఱియొక విభక్తియు నగు' (బాల. వ్యా)—ఇత్యాది సామాన్యశాస్త్ర మున్నను. 'జడంబు తృతీయా సప్తములకు ద్వితీయ బహుళంబుగా నగు' 'జడంబు ద్వితీయకుం బ్రథమ బహుళంబుగా నగు' 'సర్వనామసంఖ్యాభిధాన తద్విశేష్యంబులయం దెయ్యది ముందు ప్రయోగింపంబడు దాని ద్వితీయాదులకుం బ్రథమ బహుళంబుగా నగు.' 'ఒకానొకచో విశేషణంబుల షష్ఠికిం బ్రథమ విభావనగు' నిత్యాది ప్రత్యేక విధులు సప్తమ్యర్థమునం బ్రథమవచ్చుట బాల. లో లేనందున పాణ్డితకారుఁ డిటం బూరించెనని గ్రహించునది.

సూ. ౨౧. ఒక్కచో సమాసాంతర్గత విశేష్యంబుల కగు విశేషణంబుల షష్ఠికిని బ్రథము చూపట్టెడి.

ఉ. 'పార్థివ ప్రాగ్రసరుండు ధర్మసుతు ప న్నిది నీకు నలం ఘ్యము.' భార. అర. ౭ ఆ. 'లస దగణ్య గుణౌఘు విచిత్రుఁ డ ప్పుణ్యాత్ము చరితంబులు,' 'ఉత్ఫుల్లలోచనుఁ డా విష్ణుని మూర్తిలో.' హరి. ఉ.

౫ ఆ. 'విస్ఫురదస్త్రమహావిక్రముఁడైన దేవుఁడు త్రివిక్రము స్వామ్ములు.' హరి. ఉ. ౬ ఆ. మొ.

వ్యా. 'ఒకానొకచో విశేషణంబులు షష్ఠికిం బ్రథమ విభాషనగు' నను. బాల. కార సూ. ౨౭ చేత నీ ప్రథమసిద్ధించును. కాని సమాసైకదేశముతో వ్యస్తపదము లన్వయింపవచ్చునను విశేష మిందు సూచించుచున్నది. ఇందలి మొదటి యుదాహరణమును మఱి కొన్నిటికని కవిసంశయ విచ్ఛేదకారుఁడు చూపియున్నాఁడు.

సూ. ౨౨. కొన్నియెడల విశేషణంబు ద్వితీయాదులకును బ్రథమ చూపట్టెడి.

ఉ. 'అహీనబాహాబలసార ఘనుల్ మధుకైటభాది దైత్యపతుల నెల్లఁ ద్రుళ్లడఁచె.' నిర్వ. ౫ ఆ. 'క. తండ్రీ ఘటోత్కచుఁడు నీవా, తండ్రీ గలుగఁ గాదె తల్లి ద్రౌపదితోడన్, దండ్రుల హరిదీశ్వరు లెన్నముండ్రు వాగడఁ దెచ్చె గంధమాదనమునకున్.' జై. ౧ ఆ. మొ. 'షష్ఠీవిశేషణానాం.' అను బహువచన సారస్య మిట్టి ప్రయోగముల నుత్పాదకముగా నున్నయది. మఱియు నేతద్విశేషణంబు లనేకవిషయంబులు గలుగాని ప్రామాణిక ప్రయోగములు దొరకమింజేసి యుపి యుదాహృతంబు లయ్యె.

వ్యా. 'భవత్యర్థక వ్యవహితంబులగు విశేషణంబులకుం బ్రథమ యగు'నని బాల. కార. సూ. ౨౦. భవత్యర్థక వ్యవధానము లేనప్పుడును ప్రథమ రావచ్చునని ప్రకృత సూత్రార్థము.

సూ. ౨౩. క్రియాన్వయంబున రెండుపదంబులకు స్వస్వామి సంబంధముగలచో సంబంధిపదంబు షష్ఠికి ద్వితీయ యగు.

ఉ. 'క. కొన్ని పడుమాటలాడుచు, నన్ను నతఁడు చెట్టపట్టినన్.' భార. విరా. ౩ ఆ. 'ఉ. కట్టియవైచె నెన్నుదురు గాఁడ భవత్తనయుండు మాద్రి తేఁ, బట్టిని.' భార. శల్య. ౧ ఆ. 'రాము తమ్ముఁ డవుం డితఁడు మూఁడమ్ముల జాడముం దునుము.' జై. ౬ ఆ.

'క. నరసూను నపుడు కర్ణుఁ, డిరుమూఁడు శిలీముఖంబు లెద సించిన.'
జై. ౭ ఆ. మొ.

వ్యా. 'నాడు చెట్టవట్టినన్' 'లేఁబట్టియొక్క నెన్నుదురు గాడన్.' 'రాము తమ్మునియొక్క చాపమున్' 'నరసూనుని యొక్కయెద'—ఇత్యాదిగాఁ బష్ఠ్యంతరంబున రూపంబు లగునని యెఱుంగునది.

సూ. ౨౮. ఒక్కచో ద్వితీయాంత విధేయ విశేషణంబునకుం బ్రథమయు నగు.

ఉ. 'ఉ. ఎవ్వనిఁ, బ్రకట ధర్మతత్త్వవిదు బ్రాహ్మణ ముఖ్యుఁ బురోహితుండుగాఁ, జేకొనువారము.' భార. ఆది. ౭ ఆ. 'క. రయమున మ్రింగుడుఁ గాలము, క్రియ నెవ్వఁడు కంఠబిలము గ్రంటికిఁ జన కగ్నియుఁ బోలెన్ దహించుచు, భయరహితా వాని నెఱుఁగు బ్రాహ్మణులుఁగాన్.'

వ్యా. 'ప్రథమయునగు' ననుచోట సముచ్చయార్థక మునర్థముచే ద్వితీయయుం గ్రహింపఁబడుచున్నది. ద్వితీయాంతములు విధేయ విశేషణము ద్వితీయాంతముగా నేని ప్రథమాంతముగా నేని యుండఁదగును 'పురోహితుండుగాఁ'—ఇది ప్రథమాంతతకును 'బ్రాహ్మణులఁగాన్'—ఇవి ద్వితీయాంతతకును ఉదాహరణములు.

సూ. ౨౯. కొన్నియెడల విధేయ విశేషణ మొండె బహువచనాంతం బయి విశేష్యంబులు పెక్కిటి కన్వయ యోగ్యంబగు.

ఉ. 'క. ఇది దక్షిణాపథంబున, కిదియు విదర్భాపురమున కిది కోసలకుం, దిది యుజ్జయినికిఁ దెరువులు, మది నిన్నిటిలోన నరుగ మన కెద్దియగున్.' భార. అర. ౨ ఆ. బహువచనాంతము గాక యేకవచనాంత మైనచోఁ దెరువు లై యుండవలెను.

వ్యా. ఉద్దేశ్య మిట ఇది. విధేయ విశేషణము తెరువులు. బహ్వంతతచేఁ బెక్కు విశేష్యముల కదియొక్కటే యుండఁజెల్లననియు ఏకవచనాంతమైనచో నైదుపర్యాయములు 'తెరు'వనునది ప్రయోగింపవలసియుండుననియు సూత్రవృత్త్యర్థము. 'ఈ

# స మా స ప రి చ్ఛే ద ము

---

సమాస మనఁగా సంయోగదశయందుఁ గలిగెడు విభక్తి లోపాత్మక పదస్వరూపసంగ్రహము. (ఇది లుక్సమాస విషయము.)

వ్యా. సమాసమును వివరించుచున్నాఁడు. 'విభక్తి లోపాత్మక పదస్వరూప సంగ్రహ'మని. విభక్తి లోపింపని సమాసములుం గలవు గానఁ దానిట నిర్వచించినది విభక్తి లోపించువానినే అనుచున్నాఁడు. 'ఇది లుక్సమాసవిషయ' మని.

సూ. ౧ షష్ఠీతత్పురుషంబులందు నగాగమంబు విభాషనగు.

ఉ. 'లు ల జవ్వనంబున విలసనంబు' భార. ఆది. 3 ఆ. 'యోగక్షేమంబున తెఱంగు.' భార. ఉద్యో. ౧ ఆ. 'అందంబున యురవడికి...' నిర్వ. ౬ ఆ. మొ.

వ్యా. బాల. లో షష్ఠీసమాసమందు ఉకార ఋకారముల కచ్చు పరంబగు నపుడు నుగాగమము విధింపఁబడియున్నది. ఇందు నిఖిలశబ్దములకును షష్ఠీసమాసమున పరమగు నచ్చున్నను హల్లున్నను నగాగమము వైకల్పికముగ వచ్చుననుచున్నాఁడు. ఇందలి లక్ష్యములను మీఁద ౩౭ వ సూత్రమగు 'కొన్నియెడల సప్తమీతత్పురుషంబులందు నవర్ణకంబు నగు'ననుదానిచే సాధింపవచ్చుం గాని వీనిలో సంబంధార్థవివక్ష యుంటచే వీని నిట్లు వేఱుపఱచి సాధించెనని తోఁచుచున్నది.

సూ. ౨. కర్మధారయంబు బిరుదాద్యుత్తరపదం బయ్యెనేని ద్వ్యక్షరాదంత స్త్రీ పుంసంజ్ఞావాచకం బగు పూర్వపదంబు సంయుక్తాక్షరంబున కంతట దీర్ఘంబు బహుళంబుగా నగు. అంతట ననఁగా సాంస్కృతికాదులు మూఁటనని యర్థము.

ఉ. రామాశాస్త్రి, సుబ్బాశాస్త్రి, రామానాయఁడు, సుబ్బానాయఁడు, రామారెడ్డి, సుబ్బారెడ్డి, ఎల్లాసెట్టి, వీరాసెట్టి, కుప్పాసామి,

సీసారామి, రామారాయఁడు, సుబ్బారాయఁడు, రామారావు, సుబ్బారావు, ఎఱ్ఱాప్రెగ్గడ, చిన్నాదేవి. మొ. బహుళంబుగా ననుటచే రామరాయఁడు, సుబ్బరావు, ఎఱ్ఱప్రెగ్గడ ఇత్యాదులందు దీర్ఘంబు వైకల్పికంబు. కృష్ణశాస్త్రిత్యాదులందు దీర్ఘంబు గలుగదు.

వి. 'తత్పురుషాదులకు లక్షణంబు ప్రాయికంబుగ సంస్కృతోక్తంబ యగు' నని బా. సమా. 3 ప్రాయికంబుగా ననుటచే సంస్కృతలక్షణంబుఁ దొడరని సమాసంబులుం గలవని తెలియవలెను. ఈ సూత్రమునం జెప్పఁబడిన పూర్వపదాంత్యదీర్ఘము సంస్కృతలక్షణముచేఁ గుదరమి ఇట సూత్రింపవలసివచ్చెను. 'కృష్ణశాస్త్రిత్యాదులందు దీర్ఘంబు గలుగ' దనుచున్నాఁడు 'కృష్ణారెడ్డి' 'కృష్ణాపత్రిక' ఇత్యాది వ్యవహారములు గలవు.

సూ. 3. ఇటఁ బూర్వపదంబు నత్వంబున కిత్వంబు బహుళంబుగ నగు.

ఉ. సుబ్బినాయఁడు, ఎల్లిసెట్టి. మొ. రామిసెట్టి, సుబ్బిసెట్టి ఇత్యాదులం దిత్వంబు నిత్యంబు.

వి. ఇట ననఁగా పూర్వసూత్రోక్త విశేషణోత్తరపద కర్మధారయంబునందు, పూర్వపదముయొక్క — కడపటి యందున్న అత్తున కిత్తు బహుళముగ వచ్చును. బహుళకముచేఁ బ్రవృత్తి యప్రవృత్త్యాదులను గ్రహించుచున్నాఁడు. 'రామిసెట్టి' సుబ్బిసెట్టి — ఇత్యాదులందు ఇత్వంబు నిత్యంబని.

సూ. 4. కొన్నిగుణాదుల పిదప న ప ము యాగమంబు లగు.

ఉ. తిక్కనసోమయాజి, నన్నపార్యుఁడు, కృష్ణమనాయఁడు, నన్నయభట్టు. మొ.

వి. ఇచ్చోట + ఇచ్చోటను అనఁగాఁ బూర్వోత్తర సూత్రోక్త విశేషణోత్తరపద కర్మధారయంబునందు, కొన్నిచోట్ల న, ప, ము, య, అనునవి ఆగమంబు లగును. ఉదా. తిక్కన సోమయాజి, నన్న + ప + ఆర్యుఁడు — నన్నపార్యుఁడు, కృష్ణమనాయఁడు, నన్నయభట్టు. ఆగమాంతరములకు సూత్రమునఁ గన్పట్టు దీర్ఘము 'ఒకచో హ్రస్వంబు దీర్ఘంబగు' నను బా. సంజ్ఞ. సూ. 3 చే గల్గినట్టిది.

సూ. ౪. పై యోగంబులు కొన్నియెడల ద్విత్వయుక్తంబు లగు.

ఉ. రామన్న సెట్టి, తిమ్మప్ప నాయఁడు, కృష్ణప్ప పంతులు, మల్లయ్య శాస్త్రి. మొ. కృష్ణమ్మ యనుచో అమ్మ ప్రేమసూచకం బై యుండు నది. 'ఉ. ఆ నరసింగ భూపతి ప్రియాంగన సెజ్జ దిన కొండమాంబయుం, దానమితార్థి లోహిత సమాజుఁ దమేయ గాంచె బంధు సం, తాన సురావనీజు సముదంచిత భోగ బిడౌజు మూరి వైశ్రీ సవభోజు భాను నిభ తేజుని గృష్ణమరాజు నున్నతిన్.' కళా. ౧ ఆ. మొ.

వ్యా. పూర్వసూత్రోక్తములగు షాష్ఠీ సమాసంబులకుం గొన్నియెడల ద్విత్వము నీ సూత్రముచేఁ జెప్పుచున్నాఁడు. ద్విత్వయుక్తములుగ నీ యాగమంబులం దొలుత విధించి పిమ్మట ద్విత్వలోపమును వైకల్పికముగ విధించుట మేలని కొందఱు. ద్విత్వాద్విత్వములకుం దుల్యబాహుళ్యము ప్రయోగములం గానమి నట్లు కాదయ్యెనని గ్రహింపవలయును.

సూ. ౫. కర్మధారయం బిట్టిది మిశ్రంబు సిద్ధసమాసం బట్లయగు.

ఇట్లగుటచేఁ బూర్వపదంబు లుప్తవిభక్తికంబయి యవికృతాంతం బగునని యెఱుంగవలయు. ఉ. కృష్ణరాయఁడు, రామరాజు. మొ.

వ్యా. కృష్ణరాయ రామరాయాది మిశ్రసమాసంబులందలి విభక్తిలోపంబును పూర్వపద మవికృతాంతమై యుండుటను సాధింప వానికి సిద్ధసమాసత్వముం జెప్పుచున్నాఁడు.

సూ. ౬. క్రొత్తాదులు లుప్తశేషంబులు దేశ్యంబులతోడం బలెఁ దత్సమంబులతోడం గొన్నియెడలఁ గర్మధారయం బగు.

ఉ. క్రొంబులకలు, 'క్రొంబులకల్ జనించె సభకున్.' ఉ. రా. ౬ ఆ. క్రొన్నారాచములు, 'క. క్రొన్నారాచములు మూఁడు గొని నుదురేయన్.' రా. ఆర. కాం. ౧ ఆ. నెమ్మనము, 'చ. అనుపమ యోగలీల నమృతాంబుధియం దుదయించు దేవు నెమ్మనమున నావహించి.' లక్ష్మీ. 3 ఆ. పెన్నగము, 'ఏడు పెన్నగములు సంచలించె.

రా. అర. కాం. ౨ ఆ. ముంగోపము, 'ఆ. మొగమునఁ బొడువలేని ముంగోప మింక సెప్పఁడు.' ఉ. రా. 3 ఆ. వింజామరము, 'ఎ, గీ. రమణ శ్రీదేవి వింజామరంబు వీవ.' శేష. ౪ ఆ. సగరాజ్యము, 'నా సగ రాజ్యము.' రా. కిష్కిం. కాం. మొ.

వ్యా. బాలవ్యాకరణంబునఁ బ్రాఁతాది (సంధి, ౩౬, ౩౭, ౩౮, ౩౯) సూత్రముల సందర్భమునఁ గల యుదాహరణంబులం బట్టి ఆసంధి కేవల మాచ్ఛిక సమాసవిషయము అను భ్రాంతివొడమం దగియున్నందున, తదపనయనార్థము ఈ సూత్రము. 'నెమ్మన' మందలి మనము తత్సమమని భావించి వీరిద్దాని నీ సూత్రోదాహరణములం జేర్చిరి. ఇందుంగూర్చి ఆంధ్రలోకైక గురువులు ఆదికళాప్రపూర్ణులు మహామహోపాధ్యాయ వేదము వేంకటరాయశాస్త్రులవా రిట్లు సెలవిచ్చినారు. "ఇందలి 'మనము' తత్సమ శబ్దము కాదు, 'మన' శబ్దము ప్రాకృతమున 'మణ' శబ్దమగును, దానికి 'మనము' వికృతి, కావున ప్రాకృతభవము; అట్టి 'మనము' శబ్దముతో 'నెఱి' శబ్దమునకు సమాసమై మద్విత్వము వచ్చినది...ఇట 'మనము' తద్భవమే గాని తత్సమము గాదనుటకు 'నెమ్మనస్సు' 'నెమ్మనసు' అను ప్రయోగము లెటనుం గనఁబడమియుం తార్కాణము." అని. [చూ. శృం. నై. వ్యాఖ్య. ౨ ఆ. ప. 86, పు. 125.]

సూ. ౮. ధాతుజ విశేషణంబులు తథార్థకావ్యయంబుతోడం గర్మధారయంబగు.

ఉ. 'భూసురోత్తముల్ వేదముల్ సదువునట్లు.' భార. ఆది. ౪ ఆ. 'కడుం బెద్ద సెప్పఁబోయినయట్లు.' భార. ఆది. ౧ ఆ. మొ.

వ్యా. 'అట్లు' అనునది తథార్థకావ్యయము. దీనితో ధాతుజవిశేషణములు కర్మధారయంబునం గూడును. 'సదువునట్లు' 'పోయినయట్లు'—ఇవి కర్మధారయము లనుట.

సూ. ౯. అట్టి యిట్టి యెట్టి విశేషణంబులమీఁది తచ్ఛబ్ద వకారంబునకు లోపంబు విభాషనగు.

ఉ. 'క. విమల తపోవిభవంబునఁ, గమలజు నట్టిండు.' భార. ఆది. ౨ ఆ. 'ఆ. అట్టు గాన నెఱుఁగ మే మేవురము నతం, డిట్టిఁ

డగుట.' భార. శాంతి. ౧ ఆ. 'ఎట్టిఁడు నా నిజేశుఁడు' (ఎట్టిఁడు నా హృదీశుఁడనుట యుక్తము.) రా. సుం. కాం. మొ. పక్షమున అట్టి వాఁడు. మొ. తెనుఁగున సాధారణంబుగ విశేషణంబు లవిభక్తికంబులు.

వ్యా. 'ఉన్న కల సవర్ణకంబులమీఁది తచ్ఛబ్ద వకారంబునకు లోపంబు విభాషనగు' నను బాల. క్రియా. సూ. ౧౧౨ చే వకార వ్యంజనమాత్ర లోపముగల్గి కలాఁడు—ఇత్యాదిరూపములు సిద్ధించును. అట్ట్యాదుల మీఁదనున్నట్టి తచ్ఛబ్ద వకారంబునకు నజ్వ్యవహితమునకే వైకల్పికలోప మిటం జెప్పుచున్నాఁడు. అట్లు లోపముగల్గ నట్టిఁ డిత్యాదు లేర్పడును. ఈ యజ్వ్యవహితవకారలోపము 'కల' మీఁదఁగూడఁ గల్గి 'ఎఱుఁకగలఁడు' ఇత్యాదిరూపములు సిద్ధించునని కవిసంశయవిచ్ఛేదకారుఁడును దెల్పియున్నాఁడు' 'ఎఱుకగలరె మగువ లెంచ.' భార. ఆది.

సూ. ౧౦. ముయ్యేడ్వాదులందు హ్రస్వద్విత్వంబులు నిత్యంబులు.

ఉ. 'రామఁ దలంకకే ముయ్యేడుమాఱుల్ రణప్రీతికిన్ ద్రగ ధరాతలేశ్వరులఁ జంపెన్ బల్విడిన్.' భార. ఆది. ౧ ఆ. 'ముయ్యేడ్వలు మార్గణముల.' రా. యు. కాం. 'దీని ముమ్మడుంగగు గణము.' భార. ఆది. ౧ ఆ. మొ. ఆంధ్రశబ్దచింతామణియందుఁ గల ఇద మద సిత్యాది సూత్రమందలి యదిప్రభృతులు వ్యర్థములగుచు స్వేతరంబులకును నకార్యంబని తెలుపుచున్నవి.

వ్యా. 'సమానాధికరణం బగు నుత్తరపదంబు పరంబగునపుడు మూఁడుశబ్దము డుజ్వర్ణకంబునకు లోపంబును మీఁది హల్లునకు ద్విత్వంబునగు' 'ద్విరుక్తంబగు హల్లు పరంబగునపు డాచ్ఛికంబగు దీర్ఘంబునకు హ్రస్వంబగు' నను బాల. సమా. ౧౨—౧౩ సూత్రములచేత ముజ్జగము లిత్యాదిరూపములు సిద్ధించును. 'మీఁదిహల్లున' కనియుండు టం జేసి హల్లు పరమగునప్పుడే బాల. సూత్రములు ప్రసక్తించుననియు, హ్రస్వద్విత్వములు నిత్యములే యున్నట్లు సూత్రరచన యగపడుచున్నను మూఁడుజగములు మూఁడు లోకములు అనికూడ నుదాహరించియుండుటచేఁ బూర్వసూత్రమునుండి విభాషానువృత్తి చిన్నయసూరి కభిప్రేతమనియుఁ దలంచి ఈతఁ డీసూత్రము రచించినట్లున్నది. అచ్చు పరమగునప్పుడు హ్రస్వద్విత్వములు నిత్యములని గ్రాహ్యము. 'ఇద మద సేతద్ యత్త

చ్ఛబ్ది" శబ్దాంతరాన్వయే బహుళమ్, హ్రస్వం ప్రపద్యదీర్ఘాద్విత్వ ముపర్యక్షరస్యాజ నయన్తి' అను చింతామణిసూత్రమున 'ఇదమ్ అదస్ ఏతద్' అను మూఁటికి నర్థభేదములేకుండుటచే 'అదస్ ఏతత్' అనునవి రెండును వ్యర్థములగుచున్నవి. వానిం జెప్పనేల యన్న 'స్వేతరంబులకును నక్కార్యంబు' అని సూచింప ననుచున్నాఁడు.

సూ. ౧౧. సమాస ఘటితం బీశబ్దం బొక్కచో సూచనార్థకం బగు.

ఉ. 'క. ఈయున్న పౌష్యపాలికిఁ, బోయి.' (ఈయున్న = ఇదిగోనున్న యని యర్థము) భార. ఆది. ౧ ఆ. మొ.

వ్యా. 'ఇదిగోనున్న' అని యర్థము వ్రాయుచున్నాఁడు. ద్రుతాంతత ఎట్లు? పింగళి సూరనాదులు ద్రుతాంతముగనే వాడియున్నారు. వరాహపురాణకారాదులు కళిగ వాడియున్నారట.

సూ. ౧౨. ధ్వన్యనుకరణ శబ్దంబులు కొన్నిటి కిందు నిగాగమం బగు.

(ఇందుకు —కర్మధారయమునందని యర్థము.)

ఉ. 'గనగనని నిప్పులు.' స్వా. ౪ ఆ. 'క. తళతళని తరణి మెఱుఁగులు.' ౫ ఆ. 'సిగసిగని కుందినపుఁ డగడు' ౪ ఆ. మొ.

వ్యా. 'ధ్వన్యనుకరణశబ్దములు కొన్నిటికిన్' అనుచోట 'సర్వనామసంఖ్యాభిధాన తద్విశేష్యంబులయుం జయిన్యదు మొదలు ప్రయోగింపంబడు దాని ద్వితీయాదులకుం బ్రథమ బహుళంబుగానగు' ననుబా. ర. సూ. ౫౬ చే ప్రథమ.

సూ. ౧౩. గుణవాచకంబులు కొన్నింటి నిగాగమంబునకు బరుషంబులు పరంబు లగునపుడు బిందువగు.

ఉ. కెంపుంగదేసె, తెమ్ముండేసె. మొ. 'మరు వాఁడారు శరంబులం దొరఁగు సొమ్ముండేసె.' స్వా. ౨ ఆ.

వ్యా. 'గుణవాచకంబులగు నల్లాదులకుం గర్మధారయంబునందు నిగాగమంబు బహుళంబుగానగు' నను బా. సమా. సూ. ౧౨ చేత న్యాగముగల్గును. ఇదంతత చే నద్రుతమని యెఱుఁగనగునది. కాఁగా మొదటిపరుషములకు గ స ద

దవాదేశము రావచ్చును. ఆ దేశ గ స డ ద వ పరకత కళాత్వానుగుణము, అద్రుత నకారస్థానమున బిందువువిధించుశాస్త్ర మిం దనుక లేనందున నీసూత్రారంభమని ఎఱుఁగ వలయు.

సూ. ౧౮. గుణవాచకంబు క్రియావిశేషణంబగుచో నొక్కెడ నవర్ణకంబునకు బిందువు గానంబడియెడి.

ఉ. 'పసి చక్కంగఁ బ్రియుండు వర్ధిలుటకై.' కాశీ. ౨ ఆ.

వ్యా. 'నవర్ణకంబు గుణవచనంబులగు నల్లాదులకగు' నను బాల. తద్ధి. సూ. 6చే నవర్ణకము వచ్చుచున్నది. ఆ నవర్ణకములోని గుణవాచకము క్రియావిశేషణమైనప్పుడు ఆ 'న' స్థానమున బిందువు నీసూత్రము సాధించుచున్నది.

సూ. ౧౯. ఒకానొకచో గుణవాచక ధాతుజవిశేషణంబు లవయవ విశేష్యపూర్వకంబులై యవయవితో సమసించెడి.

ఉ. 'ఒడలు తెల్లని తురగోత్తము వాలంబు.' (ఒడలు తెల్లని = తెల్లనియొడలుగల యని యర్థము.) భార. ఆది. ౨ ఆ. 'తనువుమీనొ పోలవల్చు జాలరిదాన.' (తనువు మీనొప్పెలవల్చు=మీనొప్పెలవల్చు తనువు గల యని యర్థము.) భార ఆది. 3 ఆ.

వ్యా. అవయవ వాచకములగు విశేష్యముల నంటివచ్చు (a) గుణప్రయుక్తవిశేషణములును (b) ధాతుజవిశేషణములును అవయవితో సమసించును. చూ. ఉదా. (a) తెల్లని—ఇది గుణప్రయుక్తవిశేషణము. ఇది 'ఒడలు' అను నవయవవిశేష్యము ముందుగల్గియున్నది. (b) 'మీనుపోలవల్చ'—ఇది ధాతుజవిశేషణము. దీనికిముందు తనువను నవయవవిశేష్య మున్నది. ఇట్టి వీనికి అవయవితో సమాసము ఘటిల్లినది. తురగోత్తముఁడును జాలరిదియుం నిట నవయవులు.

సూ. ౧౬. తమ్ముఁగుత్తిలు చిలుకమొకరి యిత్యాదులు విశేష్యపూర్వపద కర్మధారయంబులు.

ఉ. 'తమ్ముఁగుళ్లలు నీవుఁ దగవివినంబున కరిగితిరి.' భార. ఆర.
౨ ఆ. 'క. ప్రభావతి, మోదము వలిఁజిలుకఁ జిలుక మొకరింబలికెన్.'
శుక. ౫ ఆ. మొ.

వ్యా. సమాసంబులం బగువసరళంబులు పరంబులగునప్పుడు నుగాగమము పుంపు
లకును ఉదంతంబులగు స్త్రీసమంబులకును నే బాల. సంధి. సూ. ౫౭ చే విహితము. 'తమ్ముఁ
గుళ్లి'—ఇటం బూర్వపదము డుమంతమై యున్నందున నుగాగమప్రాప్తి యగతికము.

సూ. ౧౭. ఆ యీ తాత్పర్యాది ఘటితంబులు విశేషణోభయపద కర్మధార
యంబులు.

ఉ. ఆ యీ నేరములు, 'ఈ యాదేశంబన నేల?' స్వా. ౧ ఆ.
'ఎత్తిన పెంచినవారి.' విక్ర. ౬ ఆ. 'కలిగిన యొప్పని దోషములు.'
విజ్ఞా. ఆచా. 'కొట్టినఁ దిట్టిన యాతఁడు.' భోజ ౬ ఆ 'చలి తెలి
మంచు తుంపరలు.' భాను. ౩ ఆ. 'పడ చల్లని చల్లని గాడ్పు.' రామా.
౧ ఆ. 'తియ్య బెట్టి మాటలు.' క్షేత్ర్రయా. 'తొంగలి తఱచు ఱెప్పల.'
భార. విరా. ౫ ఆ. తొవ ప్రాంత కుప్పసంబు.' జై. ౬ ఆ. 'నిడు వాలిక
కన్నులు.' (వాలిక=వాఁడి) భోజ ౫ ఆ. 'పెను నిట్టతాడు.' జై. ౫ ఆ.
'ముక్కుపోయిన పలిగొమ్ముటేయి.' హరి. ఉ. ౨ ఆ. 'విన్న కన్న
యుగ్మము,' కళా. ౮ ఆ. 'క్రొమ్మించు తేఁజెక్కు టద్దంబు' సై. ౫ ఆ. 'తెలి
నును పొగ వన్నెలల.' రామా. ౫ ఆ. మొ.

వ్యా. ఆ యీ తాత్పర్యాది ఘటితంబులు=ఆ యీ మున్నగువానితోఁ గూర్పబడినవి—
ఇట్లనుట ఒక్కటికన్న నెక్కుడు విశేషణములు కూర్పఁబడిన వానికెల్ల నుపలక్షకము.
కావున నుదాహరించుచున్నాఁడు 'ఎత్తిన పెంచి' నేత్యాదులను.

సూ. ౧౮. కొన్నియెడల విశేషణోభయ పదంబులు త్రిక క్రియాజన్య
విశేషణ ఘటితంబులు సందర్భయోగ్యపద వ్యవహితంబు లగు.

త్రిక క్రియాజన్యవిశేషణ ఘటితంబులు—త్రిక క్రియాజన్య
విశేషణోభయ ఘటితంబులు కేవల క్రియాజన్యవిశేషణఘటితంబులు నని
ద్వివిధములు.

ఉ. 'క. ఈ కన్నులు తెలివని శిశు,వే కీ డొనరించె నీవు.' భోజ. ౬ ఆ. 'ఎ, గీ. నెఱులఁగల మరు నీలంపుటురుల సిరుల, నరులం గొనఁజాలి నరులను మరులుగొలుపు, నిరులు గెలిచిన తుమ్మెద గములఁ దెగడు, కురుల నులిదీర్చి విఱులిడి కొప్పువెట్టె.' భాగ. ౧౦ స్కం. ఉ. 'ఎ, గీ. గగవ మను రుద్రభూమి నేకతమ తిరుగు, నడరు లుమినెడు కొఅవిదయ్యంబు వీఁడె.' నై. ౨ ఆ. 'చ. నే, బలిమిఁ గుబేరునిం గెలిచి బాగుగఁగొన్న రవిప్రకాశమై, యలరుచు నున్న పుష్పకమునందు రమింపుడు కోర్కులారఁగన్.' రా. అర. కాం. ౨ ఆ. 'ఎత్తెడునట్టి యుగ్గ్రగాఁ గాచిన మడ్డు చందము.' ప్రభా. ౫ ఆ. 'సీ. అనక దుందుభి వినరాని వినరాని దుర్వాక్యసూచులఁ దూలఁబుచ్చె.' వి. పు. ౭ ఆ. 'క. చిక్కని చక్కని సున్నని, ప్రుక్కని తో లూడ్వఁబడని గుగ్గిసెగలచే, నొక్కఁబడని దండంబులు, తక్కక యుపనయనవేళఁ దాల్పఁగ వలయున్.' విజ్ఞా. ఆచా. మొ. (ఇట్టి ప్రయోగములు కవిత్రయము వారి గ్రంథములయందు దొరకినవి కావు.

వ్యా. త్రికక్రియాజన్య విశేషణోభయఘటితంబులును కేవల క్రియాజన్యవిశేషణఘటితంబులు నగు కర్మధారయ సమాసంబులం గొన్నియెడల విశేషణంబులు అవ్యవహితములై రాక సందర్భయోగ్యంబులగు కొన్ని పదంబులవలని వ్యవధానంబు గల్గియున్నవి. ఇట్టి ప్రయోగములు కవిత్రయేతరుల గ్రంథములందే గానఁగు నను చున్నాఁడు. ప్రథమోదాహరణమున 'ఈ' 'తెలివని' యను రెంటికి 'కన్ను'లవలన వ్యవధానము. రెండవయుదాహరణమునఁ 'జాలి' 'గొలుపు'లకు 'మరులు'వలనఁ 'గొలుపు' 'గెలిచిన' లకు 'నిరులు'వలన వ్యవధానము. ఇట్లే యన్నింటి నరసికొనునది.

సూ. ౧౯. అలరుఁ బోఁడీత్యాదు లుపమానపూర్వపద కర్మధారయంబులు.

ఇటఁ బోఁడి పరంబగుచో నెల్లెడల నుప్పుగు. అది పదంబుచే తియ్యఁబోఁడి. ననఁబోఁడి, విరిఁబోఁడి, ఇగురుఁబోఁడి, చిగురుఁబోఁడి, తలిరుఁబోఁడి, పువ్వుఁబోఁడి, పూవుఁబోఁడి, పూఁబోఁడి యిత్యాదులు

గ్రాహ్యంబులు. (అలరు + ప్రోఁడి) వీనికిఁ బువ్వువలె మనోజ్ఞురాలైనదని యర్థము. ఇట్లింతట నెఱుఁగవలయు.

ఉ. 'మ. చిగురుం బోఁడి యెఱుంగదే యదుపతి స్త్రీ లెవ్వరే నిందు లే,రు గదా.' కళా. ౩ ఆ. 'శా. ద్రోవదిన్, తీయంబోఁడి వరింపఁగా వసుధ కేతేఁజాఁచు నాదిత్యులన్.' పాంచా. ౩ ఆ. 'వేల్పుం బువుంబోండ్లు.' య. ౧ ఆ. 'క. యౌవనము కలిగినప్పుడ, పూవుం బోఁడులకుఁ బతుల భోగంబులు గాక.' కళా. ౪ ఆ. మొ.

వ్యా. 'బహువ్రీహిని స్త్రీవాచ్యం బగుచో నుపమానంబుమీఁది మేనునకు బోఁడి యగు' నను బా. సమా. సూ. ౨౩ చే. సూరి 'అలరువంటి మేనుఁగల' దను నర్థము వచ్చునట్లు సాధించెను అలరువలె మనోజ్ఞయైనదని యాతని యర్థము. ఇందుకు నుమ్మగు నని 'నుమ్ చోతః' అను చింతామణిసూత్రము ననుసరించి చెప్పుచున్నాఁడు. అంతాగములకుఁ గిత్వము కూర్చుట సూరిగారి యాచారము, మిత్వముంచుట ప్రాకృతవైయాకరణానుసారి చింతామణికర్తృసంప్రదాయము. సిద్ధసరళాదిగా 'బోఁడి' యని గ్రహించిన సూరిమార్గమున అలరుఁబోఁడీత్యాదులౌ సమాసములకుఁ బహువచనపరకోఁడంత స్త్రీసమంబులకు విహితమగు నుగాగమ ప్రవృత్తకార్యములుగల్గిన గల్గవచ్చుంగాని అను వంతంబులగు ననఁబోఁడీత్యాదులం దాకార్యమునకు ప్రాప్తిగల్గదు కావునఁ బహుపాదిగ 'ప్రోఁడి' యని గాని సర్వత్ర నుమ్ము విధించిన ప్రౌఢకారుని మార్గమే వరము.

సూ. ౨౦. ఒక్కచో ద్విగువు మిశ్రం బేకవచనాంతంబు నగు.

ఉ. 'క. తక్కిన సైన్యము లనిలోఁ జిక్కి పరాఙ్ముఖతఁ దోలఁగ శిష్యుఁడును భీతిన్, బొక్కుచు నలసత మెయిన, ద్దిక్కుదిరిగి నిలిచి యూపులించుచు నుండెన్.' ఉ. హరి. ౬ ఆ. 'ఉ. అస్తోక నిజప్రభావములు సూపెదు గద్దియమీఁద నెక్కి ముల్లోకము దాన యేలుగతి లోలవిలోచన యేమి చెప్పుదున్.' హరి. ౧ ఆ. 'మ. సుమహార్ఘము వరు.' జై. ౭ ఆ. మొ.

వ్యా. 'ద్విగువున కేకవచనంబు ప్రాయికంబుగ నగు మిశ్రంబునకుఁ గాదు' అని బాల. సమా. సూ. ౧౮. కాని మిశ్ర ద్విగువునకును ఏకవచనాంతత ప్రయోగములం గన్పట్టుచున్నదని చూపుచున్నాఁడు ప్రౌఢవ్యాకర్త. ఇది యథర్వణులకును సమ్మతమే.

సూ. ౨౧. వారార్థక శబ్దంబుల ద్విరుక్తంబులు తఱచుగ సంఖ్యాపూర్వకంబు లగు.

ఉ. ఒకతడవ, ఒకతూరి, ఒకతేప, ఒకమాటు, ఒకసారి; రెండు తడవలు. ఒకతడవకు, రెండుతడవలకు. మొ. అద్విరుక్తంబు లనుటచే తేపతేపకు; తఱచుగ ననుటచే తడవకు ఇత్యాదు లెఱుంగునది.

వ్యా. తడవ తూరి తేప మాటు సారి మున్నగునవి వారార్థక శబ్దంబులు. ఇవి ద్విరుక్తములుగ వచ్చినప్పుడు తేపతేపకు తడవతడవకు నిత్యాదిగా రూపము లేర్పడును. అద్విరుక్తములుగా నున్నప్పు డివి తఱచుగాఁ దమకుముందు సంఖ్యావాచకములు గల్గి యుండును. తఱచుగా ననుటచే సంఖ్యాపూర్వకములు కాని యద్విరుక్త వారార్థకశబ్దములు అరుదని తెలియవలెను. తడవకు నిత్యాదు లరుదైనవనుట.

సూ. ౨౨. ఒకండ్వాదులు పరంబులగుచోఁ దఱచుగ నుక్ పదికగు.

ఉ. పదునొకండు, పదునొకండ్రు; పదుమూఁడు, పదుమూఁగురు, పదునాలుగు, పదునలుగురు; పదునేను, పదునేగురు; పదునాఱు, పదునాఱుగురు; పదునేడు, పదునేడుగురు; పదునెనిమిది, పదునెనమండ్రు. తఱచుగ ననుటం జేసి పదియాఱు పదాఱు ఇత్యాదిరూపంబులును గ్రాహ్యంబులు. 'క. ఘోరులఁ గర్తుండు పదాఱవ, కళకు సమానుండు గాఁడు కవ్వడితోడన్.' భార. అర. ౨ ఆ. మొ.

వ్యా. ఒకండు+ఆదులు=ఒకండు మొదలైనవి, పరంబులు అగుచున్=క్రిందివి ఐనప్పుడు, పదికిన్=పదియను శబ్దమునకు, తఱచుగన్=ప్రాయికముగా, బహుళముగా; ఉక్, అనుక్ వచ్చును, అంతాగమముగానని శేషము. ఉదా. పది+ఉక్+ఒకండు=పదునొకం డిత్యాదులు. ఉక్కాగమము తఱచనుటచే ఆయాగమము రానియెడలం గలవు క్వాచిత్కములున్. ఉదా. పదియాఱిత్యాదులు.

సూ. ౨౩. పదికి రెండిరుదొమ్మిదులు పరంబులగునపుడు బిందుపూర్వక డకారంబును ద్విరుక్త నివర్ణంబును బిందువును గ్రమంబుగ దివర్ణంబున కగు.

ఉ. పండ్రెండు, పన్నిరుగురు, పన్నిద్దఱు, పందొమ్మిది, పందొమ్మండ్రు.

వ్యా. పదికి (a) రెండు పరముకాఁగా, దివర్ణస్థానమున బిందుపూర్వక డకారంబు వచ్చును. పండ్ + రెండు = పండ్రెండు. (b) ఇరుశబ్దము పరముకాఁగా దివర్ణస్థానమున ద్విరుక్త నివర్ణము వచ్చును. పన్ని + ఇరుగురు, పన్ని + ఇద్దఱు = పన్నిరుగురు, పన్నిద్దఱు (c) తొమ్మిది పరముకాఁగా దివర్ణస్థానంబున బిందువు వచ్చును. పందొమ్మిది — ఇది బాలవ్యాకరణము సంధి 3౯ వ సూత్రము క్రింద సాధింపఁబడినది.

సూ. ౨౪. పది యుత్తరపదం బగుచో నేను దొమ్ములనుమ్ములకు బిందువును, ఎనికైనను, ఏడునకు వర్ణవ్యత్యయంబును, ఆ పరుషంబునకు సరళంబును గ్రమంబుగ నగు.

ఏఁబది, ఏఁబండ్రు; తొంబది, తొంబండ్రు; ఎనుబది, ఎనుబండ్రు; డెబ్బది, డెబ్బండ్రు. మొ.

వ్యా. ఏను పూర్వపదమును పది యుత్తరపదమునుగా సమసించిన 'ను' స్థానమున బిందువును పరుషమునకు సరళాదేశమును వచ్చును. ఏను + పది = ఏను + బది = ఏఁబది. దీర్ఘముమీఁద సాధ్యపూర్ణము లేనందున ఏంబది అని కుదురదు. అట్లే తొమ్ము పూర్వపదముగను పది యుత్తరపదముగను ఒండొంటితో సమసించిన 'మ్ము' స్థానమున బిందువును పరుషమునకు సరళాదేశమును వచ్చును. తొమ్ము + పది, తొమ్ము + బది, తొంబది. అంట ఇంక ముందు శబ్దంబులందుకు నుడి తొలిహ్రస్వముపై ఖండబిందువులేమి తొఁబది అని కుదురదు. ఎని — ఇది ఎనిమిది శబ్దలుప్తశేషము. ఎని పూర్వపదముగను పది యుత్తరపదముగను సమసించిన 'ఎని'కి సర్వాదేశముగా 'ఎను'ను పరుషస్థానమున సరళమును వచ్చి ఎనుబది అని యగును. ఏడు పూర్వపదముగను పది యుత్తరపదముగను సమసించిన, ఏడు + పది అనియుండఁగా ఏడు శబ్దమునకు (a) వర్ణవ్యత్యయము గల్గిను,

డు + ఏ=డే + పది (b) పరుషమునకు సరళమువచ్చును డే + బది (c) మీఁది (౨౫) సూత్రముచే దీర్ఘమునకు హ్రస్వమురాఁగా డెబది. శబ్దపరిచ్ఛేదము సూ. ౧౦౦ చే ద్విత్వమువచ్చిన డెబ్బదియగును.

సూ. ౨౫. పది యుత్తరపదం బగుచోఁ బూర్వపదంబు దీర్ఘంబునకు హ్రస్వంబగు. ఏను నేఁకు రాదు.

ఉ. ముప్పది, ముప్పండ్రు; నలువది, నలువండ్రు; అఱువది, అఱువండ్రు.

వ్యా. సమాసంబులం బది యుత్తరపదం బగునేని, పూర్వపదముల దీర్ఘమునకు హ్రస్వమువచ్చును. మూఁడు + పది; 'బాల. సమా. సూ. ౧౭ చే డులోపము. మూ + పది; ప్రకృతసూత్రముచే హ్రస్వము ము + పది. శబ్ద. సూ. ౧౦౦ చే ద్విత్వము: ముప్పది. ఇట్లే నాలు గు ఆఱులకును హ్రస్వమురాఁగా నలువది అఱువ దిత్యాదులు. ఏను నకు హ్రస్వప్రాప్తిలేమి ఏఁబది యనియే రూపము.

సూ. ౨౬. కొన్నియెడల నీ సమాసపదంబులు యువర్ణవ్యవహితంబులు నగు.

ఉ. 'ఆక్కూర పదమునఁ బదియు రెండేడు లజ్ఞాతవాస మొక్కఁడు, జనపదంబున నుండి.' భార. ఆది. ౩ ఆ. 'లే. ప్రాయపుఁ జెలులు వేలు పులలోన దొరసియున్న, పదియు నొక్కండ్రు రుద్రులఁ బాఱ విడిచె.' కాశీ. ౭ ఆ. మొ.

వ్యా. 'పదియు రెండేడులు' 'పదియు నొక్కండ్రు' ఇత్యాదులలోని యువర్ణ వ్యవధానము సరసిరోనపలెను. వ్యవహితంబులును—ఇచ్చటి నువర్ణము సూత్రాంతర సాధితరూపాంతర సముచ్చాయకము.

సూ. ౨౭. కలకంఠుఁడు బహుప్రిహి.

(చూ. సంజ్ఞా. సూ. ౯ ఉ.) దీని సహోబలపతి పండితుఁడు మిశ్ర బహువ్రీహి యనెఁగాని యది యట్లగుట దుర్ఘటము.

వ్యా. సంస్కృతమున బహువ్రీహి సమాసమగు గరకంఠ శబ్దమే తద్భవమై 'కఱకంఠుఁ' డైనది. ఇద్దానిని మిశ్ర బహువ్రీహి యనినచో నాంధ్ర వ్యాకరణసంస్కారము లేకుండుటచే ననింద్యగ్రామ్య మనవలసియుండును. అనింద్యగ్రామ్యములలో దీని నుదాహరించి తద్భవములలో శకటరేఫ ముండదని చెప్పుటచే సూరిగూడ నహోబిలపండితునే యనుసరించి సామాసిక గ్రామ్యత నంగీకరించినట్లు ఊహింపనగును.

సూ. ౨౮. కొన్నియెడల మహద్ద్వంద్వంబునం బూర్వపదాంత్య స్వర్ణంబునకు దీర్ఘంబునుం జూపట్టెడు.

ఉ. 'అన్నాదమ్ములు' ఉ. హరి. ౪ ఆ. 'అప్పాచెల్లెండ్రు.' నిర్వ. ౩ ఆ. 'తల్లీదండ్రులు.' భల్లా. ౪ ఆ.

వ్యా. 'అపి మాషం మషం కుర్యాచ్ఛన్దోభఙ్గం న కారయేత్' అను న్యాయమున ఛన్దోనిర్బంధమున వచ్చిన ఈద్వంద్వ పూర్వపదాంత్య దీర్ఘములు క్వాచిత్కములు ఉపేక్ష్యములని సూరి యెంచియుండును.

సూ. ౨౯. ఒకానొకచో ద్వంద్వంబునం బూర్వపదంబు క్లీబసమం బగు. అగుచో నాయువర్ణంబునకు లోపంబగు.

ఉ. 'అండపిండములు.' ఆని. ౫ ఆ. 'వెచ్చసచ్చములు' వేం. పంచ. ౧ ఆ. మొ.

వ్యా. 'అప్రాణిశబ్దంబులతోడ స్త్రీసమంబు ప్రాయికంబుగా ద్వంద్వంబగు' నని బాల. సమా. సూ. ౭. కావున మతమతమున ద్వంద్వసమాసంబులం బూర్వపదములు ప్రాయికంబుగ స్త్రీసమములుగ నుండును. ప్రాయికంబుగ ననుటచే నస్త్రీసమంబులుం గ్వాచిత్కముగ నుండునని సిద్ధాంతమున్నది. పూర్వపదము స్త్రీసమముగనే కాక క్లీబసమముగను నుండనగునని స్పష్టముగ నిటం బ్రౌఢవ్యాకరుఁడు సూత్రించె.

సూ. ౩౦. ద్వంద్వం బప్రాణివాచక కృదంతశబ్దఘటితం బేకవచనాంతంబు నగు.

ఉ. 'మూఁడుగుడ్డ' 'మూరగాయము' జై. ౪ ఆ. 'దరిదాపు.' భోజ. ౨ ఆ. 'రేవగలు,' రామా. ౨ ఆ. 'లోఁకుదగులు,' హరి. ఉ. ౫ ఆ.

ను శబ్దంబుచేఁ గూరగాయ లిత్యాదులు బహువచనాంతంబులు నగు నని యెఱుంగవలయు.

వ్యా. బాల. లో ద్విగువునకుమాత్రమే ఏకవచనాన్తత విధింపఁబడియె. ఇందు అప్రాణివాచక ద్వంద్వమునకుఁగూడ కొన్నియెడల ఏకవచనాన్తత గల్గునని చెప్పుచున్నాఁడు.

సూ. ౩౧. భావద్వంద్వంబునం దొలిపదంబు టవర్ణకంబునకు లోపంబగు. టవర్ణకం బిటఁ గృత్ప్రత్యయంబున కుపలక్షణంబు.

ఉ. 'ఔగాములు.' (అవుట+కామి) పర. ౩ ఆ. 'చెల్లు చెల్లములు.' (చెల్లుట+చెల్లమి) వేం. పంచ. ౧ ఆ. 'వచ్చురాములు.' (వచ్చుట+రామి.) పాండు. ౪ ఆ. 'వినివినములు' (వినికి+వినమి.) సా. ౨ ఆ. మొ. (వినికి=వినుట.)

వ్యా. 'టవర్ణకంబు భావంబునం దగు'నని బాల. క్రి. సూ. ౩౫. టవర్ణయంత ముతో శబ్దాంతరము ద్వంద్వంబున సమసించిన భావద్వంద్వం బగు. దానం దొలి పదంబు టాంతంబై యుండుంగదా. ఆ టవర్ణకంబునకు సమాసంబుల లోపం బిట చెప్పఁబడుచున్నది. పూర్వపదంబు ట ప్రత్యయాంతమై ఆ ప్రత్యయము లోపించుటేకాక పూర్వపదంబు కృత్ప్రత్యయాంతమై ఆ ప్రత్యయము లోపించుటయుం గలదు. కావునఁ జెప్పుచున్నాఁడు 'టవర్ణకం బిటఁ గృత్ప్రత్యయంబున కుపలక్షణంబు.' అని. 'వినికి' కృత్ప్రత్యయాంతోదాహరణము 'ఇకి కోర్వాదుల కగు' నని. బాల. కృ. సూ. ౧౬.

సూ. ౩౨. ద్వంద్వంబునం బూర్వపదాంత్యావయవంబునకు లోపం బొండెనగు.

ఉ. 'పుట్టు క్రుంకు గట్లు.' యు. ౫ ఆ. 'తోవదప్పి విందు.' రామా. ౩ ఆ. 'విన్నకన్నది.' వి. పు. ౨ ఆ. పుట్టు క్రుంకు గట్లనఁగా పుట్టుగట్టు క్రుంకుగట్టు. ఇట్లంతట నెఱుంగునది.

వ్యా. ఒండెః=వైకల్పికముగా, అగుః = వచ్చును ఏది వచ్చుననఁగా— 'లోపము.' దేనికనఁగా 'ద్వంద్వంబునం బూర్వపదాంత్యావయవంబునకు.' ఉ. పుట్టు

గట్టు+త్రుంకుగట్టు — ఇట పూర్వపదము 'పుట్టుగట్టు' దాని యంత్యావయవము 'గట్టు' దానికి వైకల్పికముగ లోపము రాఁగాఁ పుట్టు+త్రుంకుగట్టు. గట్టు రెండగుటం జేసి బహుత్వముగల్గి పుట్టుగ్రుంకుగట్లని యైనది. ఇట్టితరము లూహ్యములు.

సూ. ౩౩. ఒకానొకచో ద్వంద్వంబు మిశ్రంబును అందలి పూర్వపదంబు క్లీబసమంబును గాఁ గానంబడియెడి.

ఉ. అవసర మక్కఱలు, 'క. అవసర మక్కఱలం గైదువు కర్జ ములందు వేట దోటలయందుఁ, దవులైన పొంతలెంకల, మవుటఁ గమముఁ జూడు మోపినపు డైనఁ.' రామా. ౨ ఆ.

వ్యా. అవసర మక్కఱలు=కాలపుపనులు. కైదువు కర్జము=ఖడ్గకార్యము — ఈ ప్రయోగములు రెండును మిశ్రద్వంద్వము అనక షష్ఠీతత్పురుషములని చెప్పరాదా? షష్ఠీసమాసమున నుగాగమ మితనిమతమున సార్వత్రికము గాదుగదా.

సూ. ౩౪. ఒక్కొకచో సమాసగత పూర్వపదంబు వ్యవహితోత్తర పదం బొంటితోడను వాని పెక్కింటితోడను నన్వయించెడి.

ఉ. 'రాహుకంఠము దెగి దేహము ధరణిఁబడియె.' భార. ఆది. ౨ ఆ. 'క. ఒక్కొక కన్నును జెవియును, జెక్కును జనుబొబ్బ మూఁపుఁ జెలువగు చేయుం, జక్కయుఁ బిఱుఁదును గాలును, నక్కజముగ నుబుసుకల మసు ఉదయించెన్.' సభా. ౧ ఆ. 'క. పరుల ధనమునకు విద్యా, పరిణతికిం దేజమునకు బలమునకు మనం, బెరియంగ నసహ్యపడు న, న్నరుఁడు దవులుతెవి పదనంబడు నధిపా.' భార. ఉద్యో. ౨ ఆ. 'క. నాయింటం బటిగడపల, నేయుఁ బెరుఁగుఁ బాలుఁ ద్రావె నీ ప్రియ తనయుం,డు.' హరి. పూ. ౩ ఆ.

వ్యా. 'రాహువుయొక్క కంఠము తెగి రాహువుయొక్క దేహము ధరణిఁబడియె' నని వాక్యము రంబు చుకొనవలెను. 'రాహుకంఠ' మనుచోట పూర్వావయవమగు రాహుశబ్దము 'కంఠము తెగ' యను పదములపలని వ్యవధానమున్నను దేహశబ్దముతో సంబంధించుచున్నది. వ్యవహితోత్తరపదం బొంటితోడ నన్వయించుట కిది యుందా

హారణము. వ్యవహితో త్తరపదంబులు పెక్కింటితో నన్వయించుట కుదాహరణములు కడమవి.

సూ. ౩౫. కొన్ని యెడల సిద్ధసమాసమధ్యగత పదంబులతోఁ దద్భిన్న పదంబుల కన్వయంబు చూపఁబడెడి.

ఉ. 'బహు వేదఘోషములఁ జేసి నిరస్త సమస్త కిల్బిషోత్కరు లగుచున్నధన్యులు.' భార. అర. ౧ ఆ. 'వారి యస్మదీయోరు చమూ సమూహములు.' హరి. ఉ. ౨ ఆ. 'అఖండితరూపవిలాస సంపదక్ వంచిత పంచబాణుఁడగు వాని.' నై. ౩ ఆ. 'అం దొకటిచే బనిలోఁ భవ పీడయై.' కళా. ౫ ఆ. మొ.

వ్యా. 'నిరస్త సమస్త కిల్బిషోత్కరు'లను సిద్ధసమాసమున 'నిరస్త' యను నేకదేశముతో 'బహు వేదఘోషములఁ జేసి' యనుదాని కన్వయము. 'అస్మదీయోరు చమూ సమూహములు' అను సిద్ధసమాసమున 'ఉరు చమూ సమూహము'లను నేకదేశముతో భిన్నపదమగు 'వారి' కన్వయము దీని నేకదేశాన్వయమని పేరు.

సూ. ౩౬. ఆచ్ఛికసమాసంబులం దఱచుగ వర్ణలోపాగమాదేశ వికారంబులు నిత్యవైకల్పికములుగాఁ బెక్కులు గానంబడియెడి

ఉ. 'అందాఁక (అంత+దాక), ఇట్లు ఇందాఁక, ఎందాఁక. అచ్చతెల్పు (అచ్చము+తెల్పు), ఆఁదోఁక (ఆవు+తోఁక), అవల (ఆ+పలను), ఇట్లు ఈవల. ఇబ్బంది (ఇరు+బంది), ఇరుసిని (ఇరుగు+చెవి), ఉద్దరి (ఉద్ద+దరి), ఎడవంక (ఎడమ+వంక), ఇట్లు వలవంక. ఎగుదల (ఎగువ+తల), ఇట్లు దిగుదల. ఏటవాలు (ఏటము+వాలు), కప్పురవిడెము (కప్పురము+విడెము), కవ్వడి (కవ+వడి), కుఱుమాపు (కుఱుచ+మాపు), గందవొడి (గంధము+పొడి), గుండ్రకడుపు (గుండ్రము+కడుపు), గొబ్బండు (గొప్ప+బండు), చిత్తరుబొమ్మ (చిత్తరువు+బొమ్మ), చిమ్మనగ్రోవి (చిమ్మనము+గ్రోవి), చిఱుచప్పుడు (చిఱుత+చప్పుడు), చెంద్రకావి (చెంద్రము+కావి), ఇట్లు చందుర

౮౦. చనుమొల (చను + మొలక), చప్పరమంచము (చప్పరము + మంచము), చొక్కసగతులు (చొక్కము + సగతులు), తెగుదారి (తెగువ + దారి), దట్టకెంపు (దట్టము + కెంపు), దొంతర (దొంతి + తరఁగ), నడురేయి (నడుము + రేయి), నాన్నాళ్లు (నాలుగు + నాళ్లు), నాటకసాల (నాటకము + సాల), నిక్కల (నిక్కము + కల), నిడుమోము (నిడుద + మోము), నెత్తపలక (నెత్తము + పలక), పసిపట్టు (పసిమి + పట్టు), పెందుఱుము (పెనుపు + తుఱుము), పెత్తనము (పెద్ద + తనము), పొంగట్టు (పొన్ను + గట్టు), బాపురె (బాపు + పురె), బెబ్బులి (పెద్ద + పులి), బెల్లమండెఁగ (బెల్లము + మండెఁగ), బొందళము (బొంతి + పళెము), బోనపుట్టిక (బోనము + పుట్టిక), మిండతపసి (మిండఁడు + తపసి), ముంగల (ముందు + కలను), ఇట్లు వెనుకల. మున్నేఁడు (మూఁడు + ఏఁడు), ఇట్లు ముయ్యేఁడు మొ. మోసల (మొగ + సాల), పలుపపన్నెల (పలుపము + పన్నెల), వలచేని (వలను + చేని), వాతెఱ (వా + తెఱపి), వాలురమ్ము (వాలు + అమ్ము), వేగురుఁజుక్క (వేగు + చుక్క) సగపాలు (సగము + పాలు), సాఁబాలు (సామ + పాలు), సుంకసరకు (సుంకము + సరకు), ఇత్యాదు లూహ్యంబులు. ఇందు అందఁగోత్యాదులు కొన్నిటియందు వర్ణలోపాగమాదేశవికారంబులు నిత్యములనియు, అందాఁకోత్యాదులయందు వైకల్పికములనియు, తెలియవలయు. వీని కొన్నిటికిఁ బ్రయోగంబులు పెక్కులుగలవు గాని గ్రంథవిస్తరభీతిచే నవి యుదాహరింపఁబడ వయ్యెను.

వ్యా. ఆచ్ఛిక సమాసములలోఁ గొన్నిపట్ల నిత్యములుగను గలుగు వర్ణలోపములు వర్ణాగమములు వర్ణాదేశములు వర్ణవికారములు పెక్కుతెఱఁగుల నుంటచే వాని నొక్క నియమమునకు గట్టుపఱుపరాదని యుంచి వానినెల్ల నిపతించుచున్నాఁడు. అందాఁకోత్యాదులలో వర్ణలోపమును, ఇబ్బంటి గొబ్బండ్లాదుల వర్ణాదేశమును, వాలురమ్ము వేగురుఁజుక్కాదుల వర్ణాగమమును, కప్పడీత్యాదుల హల్లు పొల్లుగ మిగులుట మున్నగు వర్ణవికారములును గల్గినవని యెఱిఁగికొనవలెను.

అలుక్సమాసము.

వ్యా. లుక్కనఁగా లోపము. విభక్తిలోపించు సమాసము లుక్సమాసము. అలుక్కనఁగా లోపింపకుండుట. విభక్తి లోపింపని సమాసము అలుక్సమాసము.

సూ. ౩౭. కొన్నియెడల సప్తమీ తత్పురుషమునందు నవర్ణకంబునగు.

ఉ. 'కువలయంబున వారు.' భార. ఆది. ౨ ఆ. 'వారిజాపతమున వారెల్ల.' భార. ఆది. ౭ ఆ. 'క. ధరణీ, తలనాథ పురుషునకు నిమ్ముల భార్యయు పాచుఁజిత్తమున దుఃఖంబుల్.' భార. అర. ౨ ఆ. 'నిజకులంబున వారికెల్ల.' హరి. పూ. ౧ ఆ. 'క. అనఘ యిటుహూఁ దేవంశంబునవాఁడు.' హరి. పూ. ౨ ఆ. మొ. ను శబ్దంబుచేఁ గువలయమునందలి వారు. మొ.

వ్యా. 'అందలి' యను నర్థమునఁ నవర్ణకయోగము ప్రయోగములం గొండొకకన్పట్టుచున్నను, బాల. లో తత్సాధకవిధి స్పష్టముగ లేనందున ఆకొఱంత యీసూత్రముచే నితఁడు తీర్చినాఁడు.

లుగలుక్సమాసములు.

వ్యా. ఇవార్థక శబ్దఘటిత సమాసంబులం గొన్నిచోట్ల విభక్తి లోపించుటయుఁ గొన్నిపట్ల నది లోపింపకుండుటయుం బట్టి అట్టివానిని లుగలుక్సమాసము లనుచున్నాఁడు.

సూ. ౩౮. అట్లు పోలె బలె వలె శబ్దంబు లివార్థకంబులు ఉపమేయము ప్రథమాంత మగునపు 'డట్లు' పరంబగుచో నుపమానంబు లగు నామ తదస్మ ద్యుష్మ దాత్మార్థములకు షష్ఠియు, పోలె బలె లు పరంబు లగుచో నామ తచ్ఛబ్దార్థములకుఁ బ్రథమయు నస్మదర్థ ప్రభృతులకు ద్వితీయయు, వలె పరం బగుచో నామ తచ్ఛబ్దార్థంబులకుఁ షష్ఠియు నస్మదర్థాదులకు షష్ఠీద్వితీయలయం దెదియే నొక్కటియుఁ గ్రమంబుగనగు. ఉపమేయము ద్వితీయా

ద్యంత మగునపుడు పోలె ప్రభృతులు పరంబులగుచో నుపమానంబుల కుపమేయవిభక్తుల యగు. పోలినయెడఁ దచ్ఛబ్ద మేతదాదులకు నుపలక్షణముగా గ్రహించునది అట్లు కరణాద్యులకు గ్రాహకము.

ఉ. క్రమముగాఁ జూచునది. ఉపమేయము ప్రథమాంత మగునపుడు.–నారాయణునట్లు, 'ఉ. పాయక పాకశాసనికి భారత ఘోర రణంబునందు నారాయణు నట్లు' భార. ఆది. ౧ ఆ. (ఉదాహరణములు కొన్ని కొంత కొంత ప్రయోగింపబడును గాన వానిని సందేహముదీఱ నాయా గ్రంథములం దక్కడక్కడఁ దడవుట్టఁ జూచుకొనునది). బకుని యట్లు, 'తే. మనుజ భక్షణంబు చేసితిరేని బకునియట్లు, చత్తురు.' భార. ఆది. ౬ ఆ. ఇట్లు నలునట్లు. మొ. 'జలధరసమితియట్లు' భార. అర. ౨ ఆ. 'గజమునట్లు' 'ఆ. పుత్ర దార బంధు మిత్ర సక్తుఁడు రోంపిఁ, బడిన గజమునట్లు యుడరు నొందు.' భార. శాం. ౨ ఆ. ఇట్లు, వాని యట్లు, నాయట్లు, నీయట్లు, తనయట్లు.—'చంద్రికయుఁ జంద్రుండు వోలె.' కళా. ౪ ఆ. పేదవోలె, అగ్నివోలె, అమృతమువోలె. 'క. అని పలికెడు చెలిపలుకులు, తన కమృతమువోలె హృదయతాపము నడఁపఁగ.' కళా. ౬ ఆ. 'పరికొండువోలె.' భార. ఆది. ౪ ఆ. 'పాముల వాఁడువోలె;' కళా. ౨ ఆ. నన్నుఁబోలె, నిన్నుఁబోలె, 'శా. కానీరా యిటువంటి నీతము ల నేకంబుల్ నినుంబోలె వి,న్నా నేనుగా.' శశాం. ౩ ఆ. ఇట్లు తన్నుఁబోలె. మొ.—రాముఁడుబలె, 'వేల్పు బలె,' కళా. ౧ ఆ. 'తామరపాకుసీరుబలె.' హరి. ౩ ఆ. 'గోరుబలె.' కళా. ౭ ఆ. ఇట్లు వాఁడుబలె, నన్నుబలె, నిన్నుబలె, తన్నుబలె. మొ.—రాముని వలె, వానివలె; నావలెఁ నన్నువలె, నీవలె, నిన్నువలె, తనవలె తన్ను వలె.—బహుత్వంబున.—బకులయట్లు, చంద్రులువోలె, రాములుబలె, రాములవలె. మొ. 'క. పూరు పురూరవులట్లు భగీరథరఘుపతులయట్లు.' భార. అర. ౨ ఆ. 'ఎ, గీ. పరిభవంబులఁ, బడిలి నిట్టి నన్నుఁ బొంద

వుల్ సూచుచు, నుండి రొరులువోలె నుక్కుడఁగి.' భార. అర. ౧ ఆ. 'క. మాయ ట్లిడుమలఁబడిన నరులు గలరె యొరులు పరమమునీంద్రా.' భార. అర. ౨ ఆ. 'వ. మమ్ముంబోలె నొడ్డ నాదరాధిక్యంబున భరంపడి సవిశేషంబుగా నధ్యయనంబు సేయింపకుండుట మాకు వరంబు.' భార. శాంతి. ౬ ఆ. ఇత్యాదు లెఱుఁగునది. (ఇప్పటికిఁ దగినవి దొరకమింజేసి యిందుఁ గొన్నింటికిం బ్రయోగంబులు వ్రాయఁబడవయ్యె.) ద్వితీయాంత్యంత మగునపుడు—ఉ. 'భీరులఁబోలె నేల వఱపించెదు మాటల మమ్ము.' భార. అర. ౬ ఆ. 'క. జ్ఞానులచే మానులచే, దానులచే యోగసంవిధానులచేతన్, బూనిన బద్ధం దగు నే, శ్రీనాథుఁడు భక్తియుతులచేతం బోలెన్.' భాగ. ౧౦ స్కం. పూ. 'సీ. ఏ మహాత్ములజేత సీఁగత్రయము నాప్యాయితం బయ్యె నయ్యమృతకరుని, చేఁబోలె.' భోజ. ౧ ఆ. 'చ. వెనుకఁ గ్రమక్రమంబున నవీనముగా నుదయంబునొందెఁ జెం, పౌనర నృపాల యీతనికి నుత్తమ మధ్యమ వృద్ధ ధర్మ దర్శనమున ద్రవ్య కర్మ గుణ జాతివిశేష వివేచనంబు బాలురకును బోలె మానసములో నిఖిలవ్యవహారహేతువై.' కళా. ౩ ఆ. 'నీవు ననుంబలె నారవీరలన్ వేడుకఁ జూతువో.' కళా. ౬ ఆ. 'దేవరయుంబలె నవ్వధూటికిన్ దొత్తగుచుం బనుల్ సలుపుదున్.' కళా. ౪ ఆ. ఇట్టితరంబు లూహ్యంబులు.

వ్యా. ఇవార్థకంబులం జేర్కొనుచున్నాఁడు 'అట్లు పోలె బలె వలె శబ్దంబు'లని. కరణి కైవడి క్రియాదు లివార్థకశబ్దము లింకనుం గలవు. వానింగూర్చి చెప్పుచున్నాఁడు 'అట్లు కరణ్యాదులకు గ్రాహకము' అని. ఇవి పరమగునప్పుడు ఉపమేయమునకు గల్గు విభక్తిపరిణామములం జెప్పుచున్నాఁ డీసూత్రమున. ఉదాహృతములం గొన్నిట విభక్తికిలోపంబును (ఉదా. నారాయణునట్లు, నావలె, మొ.) కొన్నిట విభక్త్యలోపమును (ఉదా. చంద్రుండువోలె పరికాఁడువోలె, మొ.) గల్గుటచే నివి లుగలుక్సమాసములని నెంతయుం దగియున్నవి. ఈ సూత్రమువలన నేర్పడు రూపముల కన్నింటికిని ప్రయోగములు వ్రాయఁబడనందులకు హేతువుఁ జెప్పుచున్నాఁడు 'ఇప్పటికిఁ దగినవి దొరకమింజేసి' అని, 'ఇట్టితరంబు లూహ్యంబులు.

సూ. ౩౯. ప్రథమాంతములమీఁద పోలె బలె పోనిశబ్దంబులు ద్రుత పూర్వకంబులు విభాషనగు.

ఉ. 'సమిద్ధ హవ్యవహుఁడుం బోలెన్.' హరి. ఉ. ౧౦ ఆ. 'లెండికాఁడునుబోలె.' భార. స్త్రీ. ఆ. 'నిధిఁగన్న పేదయుంబోలె.' భార. ఆది. ౪ ఆ. 'అగ్నియుంబోలె.' భార. ఆది. ౨ ఆ. 'తగరును బోలె.' నిర్వ. ౪ ఆ. 'బూడిదపండునుబోలె.' పాండు. ౫ ఆ. 'అమృత ధారాపాతంబునుబోలె.' భార. ఆర. ౨ ఆ. 'తే. అనిన విని యేమిచెప్పఁగ నెఱుఁగకున్న, వారలెల్లఁ జిత్తరువున వ్రాసినట్టి, ప్రతిమలును బోలె నతి నిశ్చలత నొకింత, తడవు గనుపట్టి రత్యద్భుతంబునొంది.' కళా. ౫ ఆ. 'పెనుపడంపుఁ జుట్టలుఁగుఁ బందమునుం బలె.' యా. ౫. ఆ. 'ఉ. మత్తత విప్రయోగిజనమగ్నమఁ ద్రైన ప్రసూనధన్వికిం, గత్తులొసంగినట్టి జన ఘాతుక సుంభవనామధేయ మ, త్యుత్తమ మేగతిం గలిగెనొకడ |నీకు సుధాఖ్యగారవ్మెన్, హాత్తినలీల రక్కసుల కంచిత పుణ్యజనాఖ్యయుం బలెన్.' శశాం. ౪ ఆ. 'ఘూమణి విశేషములుం బలె.' కళా. ౩ ఆ. ఇత్యాదు లెఱుంగునది.

వ్యా. విభక్తులలోఁ బ్రథమాంతపట్టి యొక్కలు కళలని సూర్యుక్తము. పోలె బలె పోని—యను నిపాతశబ్దములు పరములగునప్పుడు ప్రథమాంతములపై ద్రుతము వైకల్పికముగఁ గల్గునని యిటఁ జెప్పఁబడినది. ద్రుతముగల్గు నుదాహరణము లిచ్చుచున్నాఁడు—'హవ్యవహుఁడుంబోలె' నిత్యాది. ద్రుతముగల్గని యుదాహరణములం 'బరికాఁడువోలె' 'చంద్రుండువోలె' నిత్యాదులం బూర్వసూత్రముక్రిందఁ జూచుకొనునది.

సూ. ౪౦. కొన్నిగొడల నుపమానంబులు పెక్కులగుచో నివి కడదాని కొక్కటికే చూపట్టెడి

ఉ. 'ఎ. గీ. కమలమండంబు నాగలోకంబు దలిరుఁ, బాన్పు కల్పాంతమున జము బానసంబునింటిలోపలవోలె.' నిర్వ. ౪ ఆ. 'సింధురను వారిధ్రుమునబలె' ప్రభా. ౧ ఆ. మొ.

వ్యా. ఇవి యనఁగా పూర్వ పూర్వతర సూత్రోదాహృతోపమావాచకములగు నివార్థకములు. ఉపమానములు పెక్కులుండుచోట నివార్థకము లొక్కొక్క దానికిని వేఱ్వేఱుగ ననుప్రయుక్తము గాఁదగియున్నను కొన్నియెడలం గడపటి యుపమానమునకు మాత్రమె యనుప్రయుక్తమై యున్నదని చూపుచున్నాఁడు.

సూ. ౮౧. పోలె ప్రభృతులు తఱచుగఁ బ్రథమాదివిభక్త్యంత నామంబులకంటెను తాదర్థ్యార్థక క్రియలకంటెను బరంబులయి యుత్ప్రేక్షాద్యోతకంబు లగు.

ఉ. 'ఎ. గీ. గచ్చు చమరిన దారు చక్రంపు బిల్ల, వోలె.' స్వా. ౫ ఆ. (ప్రకారాంతరము—బిల్ల వోయన. ఇట్లంతట నెఱుంగునది.) 'వ. 'శోకతప్తంబయిన తనహృదయంబు దడుపుచున్నదియుం బోలె.' భార. ఆర. ౨ ఆ. 'ధవుఁ గూర్మిఁ గొసరుచున్నవివోలె.' స్వా. ౫ ఆ. 'క. దినదినమునకుఁ గృశించెను, గనుకనియును ద్రపయును నిరవకారతఁ బోలెన్.' కళా. ౭ ఆ. 'సీ. తనుఁబాసి శశి దవ్వుచనిన నెవ్వగఁ బోలెఁ దొలిదిక్కు జవరాలు వెలుకఁ బాఱె.' స్వా. ౫ ఆ. 'గారయిచ్చు టకును బోలె.' స్వా. ౬ ఆ. 'తే. కలయ జగమునఁ గల యట్టి నలుపు లెల్లఁ, దెలుపులుగఁ జేసి నీడలు తెలుపుసేయఁ, గా వశముగామిఁ బొడము దుఃఖమునఁబోలె, సాంద్రచంద్రిక తుహిన బాష్పములు గురిసె.' స్వా. ౩ ఆ. 'పయ్యెట కొంగది మాన్పఁగఁ బోలెఁ గాళ్లపైఁ బ్రబ్బి కొనన్.' కళా. ౮ ఆ. 'సాహసపు టగ్గలికం బలె.' చంద్ర. ఇట్లితరంబు లెఱుంగునది.

వ్యా. పోలె ప్రభృతులనఁగా నివార్థక శబ్దంబులు. ఇవి యుపమావాచకము లగు నెడలం బూర్వసూత్రములం జూపఁడినవి. ఇవే యుత్ప్రేక్షావాచకము లగుటెప్పుడో ఈ సూత్రమునం జెప్పుచున్నాఁడు. ఎప్పుడనఁగా—(a) ప్రథమాది విభక్త్యంతనామము లకు అనుప్రయుక్తములైన కొన్నిపట్టులఁగా. ఉదా. బిల్లవోలె (ప్రథమ) నిరవకారతఁ

బోలెన్ (తృతీయార్థక ద్వితీయ) (b) తాదర్థ్యక క్రియలకు పరములైనప్పుడు తు మున్నర్థకము లే తాదర్థ్యకములు ఉదా. ఇచ్చుటకునుబోలె, మాన్పఁగఁబోలెన్.' మొ.

సూ. ౯౨. మఱి యవి కొన్ని యెడల నామంబుల ప్రథమాది విభక్తులు కొన్నింటికిఁ బరంబులై తథార్థకంబు లయ్యెడి.

ఉ. 'ఇపుడువోలె. కళా. ౭ ఆ. 'మున్నవోలె.' కళా. ౨ ఆ. ఎప్పుడు బలె.' కళా. ౭ ఆ. 'ఆ. మథనసమయఘూర్ణ మానాబ్ధిఁబోలెఁ బెల్, మ్రోఁతలదర.' కళా. ౬ ఆ. 'వ. శరధి తరంగలమీఁదనుంబోలె.' స్వా. ౩ ఆ. ఇత్యాదు లూహ్యంబులు.

వ్యా. పోలె ప్రభృతిశబ్దములు కొన్నిచోట్ల 'తథా=ఆప్రకారముగా' ననునర్థము నిచ్చునని సూత్రార్థము. కొన్నియెడల నుపమావాచకంబులును కొన్నియెడల నుత్ప్రేక్షావాచకంబులు ననుటయే కాక, మఱికొన్నియెడల ప్రకార మాత్రార్థకము లగు ననుట.

సూ. ౯౩. అట్టి పోని బోఁటివంటి శబ్దంబులు వదర్థకంబులు. బోఁటి తె నలతెఁ బ్రత్యయార్థంబు నగు. అట్టి ప్రభృతులు పరంబు లగుచో నట్టు ప్రభృతి పరకనామాదులకుం బలెఁ బూర్వ పదంబులకు విభక్తులు త్రివిధంబులం బరఁగు. అందు బోఁటి వంటులు సమానంబులు అవి పరంబు లగుచో నాత్మార్థమునకు నామ తచ్ఛబ్దంబులకుం బోలెఁ గార్యంబు పోని పరం బగుచో డు వర్ణకంబు మీఁద ద్రుతంబు నిత్యంబు.

ఉ. రామునియట్టి, వానియట్టి, నాయట్టి, నీయట్టి, తనయట్టి, 'నీయట్టి పుణ్యాత్ములు గలరే.' భాగ. ౧౦ స్కం. పూ.—'వ. రెండవ మన్మథుండునుంబోని వాని.' భార. అర. ౨ ఆ. సురకన్యవోని, సురకన్యయుంబోని, 'అవనినాథుండు గనియెను సురకన్యవోని కన్నియ"

భార. ఆది. ౪ ఆ. దేవిపోని చెలియంబోని, 'ఎ, గీ. వరుణేంద్రు దేవియుం, బోనిదాని దేవయానింగనియె.' భార. ఆది. ౩ ఆ. నికుంజంబుం బోని, నికుంజంబునుబోని.' భార. ఆది. ౬ ఆ. పిడుగులువోని, పిడుగులంబోని; 'ఘోరపుం బిడుగులువోని తూపులు.' కళా. ౧ ఆ. నన్నుం బోని, నిన్నుంబోని, తన్నుంబోని. మొ. రామునిబోంటి, వానిబోంటి, తన బోంటి, నాబోంటి, నన్నుబోంటి, నీబోంటి, నిన్నుబోంటి. మొ. 'క. వీం డెల్ల బోంటి బాలుండు, గాండు.' హరి. పూ. ౫ ఆ. ఇట్టి నాబోంటి భీతుని నీకుం దోడనం బోలునే.' రా. అ. కాం. ౨ ఆ. 'నినుబోంట్లను నమ్మక యేనును బ్రతికెద' భార. శాంతి. ౩ ఆ. ఇట్లు మాబోంట్లు; మముబోంట్లు; మీబోట్లు, మిముబోంట్లు; మొ. 'ఉ. బోటుందనాలు చన్నె మిముబోంట్లకుం దక్కినవారికిన్ బలెన్.' కళా. ౭ ఆ. రాముని వంటి, వానివంటి, తనవంటి, నావంటి, ననువంటి, నీవంటి, నినువంటి. మొ. 'దేవా దేవరవంటి నీకు కరుణాదృష్టిన్.' వి. పు. ౭ ఆ. 'కార్చిచ్చువంటి శాపంబు' భార. ఆది. ౨ ఆ. 'పెనునిట్ట తాటివంటి గుదియ.' జై. ౨ ఆ. 'నీవంటిఘనుండు.' వి పు. ౨ ఆ. 'నినువంటి నీతి పరులున్.' శకాం. ౩ ఆ. 'నిన్నువంటి పుణ్యనిరతుండు.' వి. పు. ౪ ఆ. ఇట్లు మావంటి, మమువంటి, మీవంటి, మిమువంటి యిత్యాదులు గ్రాహ్యంబులు. 'క. నావుడు ముని యిట్లను వత్సా విను మావంటి తీర్థ శావలికెల్లన్, మీవంటి గృహస్థుల సుఖజీవనమునం గాదె తీర్థసేవయుం దలంపన్.' స్కా. ౧ ఆ 'ఎ, గీ. నాకు మిమ్మువంటి లోకోత్తరుల కియ్యం, గలిగె నింతకంటె ఘనతగలదె.' వి. పు. ౭ ఆ. ఇతరంబులు ప్రయోగంబుల నెఱుంగునది.

వ్యా. అట్టి పోని బోంటి వంటి శబ్దంబులు వదర్థకములు. 'వత్' ప్రత్యయార్థము నిచ్చునవనుట. వత్ ప్రత్యయార్థమనంగా 'పోలిన' యనునర్థము. బోంటి శబ్దమునకు ప్రత్యయములం గూర్పనగు ననుచున్నాండు. ఉదా. బోంటిని బోంటిచేత బోంటికొఱకు నిత్యాది. అట్ట్యాదులకు స్వయము ప్రత్యయార్థ్వా తలేదు. వానికిం దదర్థకాదుల వ్యవధానముతో ప్రత్యయములం గూర్పంజనును ఉదా. నాయట్టివానిని నీయట్టివానిచే

ము. 'అట్టు, మున్నగునవి పరములగునపుడు పూర్వపదములకుం బూర్వసూత్రములం జెప్పంబడిన విభక్తులే అట్టి మున్నగునవి పరములగునపుడును గల్గునని యీసూత్రము. పోతె బంతి పోని శబ్దంబులు ప్రథమాంతములమీఁదివి ద్రుతపూర్వకంబులు విభాషనగునని ముందు సూత్రించియున్నాఁడు. ఇటం బోని శబ్దమునకీసూత్రము డుమంతము మీఁదిదానికి ద్రుతపూర్వకత నిత్యమనుచున్నాఁడు.

ఇది బాలబోధసుధాపరనామధేయ కుమారదేవపండితీయం బను

ప్రౌఢవ్యాకరణ వివరణమందు

సమాసపరిచ్ఛేదము.



---

# తద్ధితపరిచ్ఛేదము

---

తద్ధితము లనఁగా విశేష్యవిశేషణములగు శబ్దములమీఁద భావాద్యర్థములయందు రాఁదగిన ప్రత్యయవిశేషణములని యర్థము.

వ్యా. తద్ధితములను వివరించుచున్నాఁడు 'ప్రత్యయవిశేషము' లని. ఇవి వేనికిం గూడుననఁ 'విశేష్యములకు విశేషణములకు' ననుచున్నాఁడు. ఏ యే యర్థములం దన 'భావాద్యర్థంబులం' దనుచున్నాఁడు. భావార్థమునే సూరి త్వార్థ మన్నాఁడు. ఆదిశబ్దముచే అభావార్థము మతుబర్థము స్వార్థము మానార్థము దఘ్నార్థము మున్నగునవి గ్రాహ్యములు.

సూ. ౧. తద్ధిత ప్రత్యయములు పరంబు లగునపుడు పదంబుల డు వర్ణకాదులకు లోపంబగు.

వ్యా. చిన్నయసూరి సమాసవిభక్తికిమాత్రమే లోపము చెప్పియున్నను నది తద్ధితవృత్తికిని ఉపలక్షణము. కావున స్పష్టార్థ మాయర్థమును ప్రౌఢకారుఁ డిట సూత్రించుచున్నాఁడు.

సూ. ౨. తనవర్ణకంబు పరంబగునపుడు తచ్ఛబ్దార్థమునకు లోపంబు విభాషనగు.

ఉ. ఆఁకొన్నతనము, ఓర్వలేనితనము. మొ. పక్షమున ఆఁకొన్నవానితనము, ఆఁకొన్నదానితనము, ఓర్వలేనివాని తనము, ఓర్వలేనిదాని తనము. 'వెల్లాఁకొన్నతనాన.' భీమ. ౨ ఆ.

వ్యా. ఆఁకొన్నవానియొక్క తనము మొ. మొదటిరూపములు. ముందటిసూత్రముచే యొక్కకు నిత్యలోపము. ఈ సూత్రముచే 'వాని'కి వైకల్పికలోపము. ఇట్లే అంతట నెఱుంగునది.

సూ. ౩. మతు బర్థంబునం దరి వర్ణకంబు పరంబగునపుడు పూజ సొన్నములకడయచ్చునకు వైకల్పికముగాను నిత్యముగాను దీర్ఘంబగు.

ఉ. పూజారి, పూజరి; సొన్నారి.

వ్యా. అరివర్ణకము మతుబర్థంబున జాలాదుల కగునని బాల. తద్ధి. సూ. ౧౭. ఆ వర్ణకము పరమగునప్పుడు పూజశబ్దముయొక్క కడయచ్చునకు దీర్ఘము వైకల్పికముగ వచ్చును. కావునఁ బూజారి పూజరి యను రూపద్వయము, సొన్న శబ్దాంత్యాచ్చునకు దీర్ఘము నిత్యము, కావున సొన్నారి యని ఏకరూపము.

సూ. ౪. మతుబర్థంబునం జెంచునకుఁ త వర్ణకంబు పరంబగుచో నిత్వం బగు.

ఉ. చెంచిత 'క. చెంచితలక్ బింఛపత్ర చేలాంచితలక్' భాగ. ౧౦ స్కం. పూ. (గ్రామ్యజనుల పాటలయందును జెంచీత యని యికార దీర్ఘంబ వినంబడియెడి.)

వ్యా. కులవాచకంబునకు స్త్రీవాచ్యం బగునపుడు మతు బర్థంబునందు 'త' వర్ణకము వచ్చునని బాల. తద్ధి. సూ. ౧౯ త వర్ణకము వచ్చునప్పుడు చెంచు మాల శబ్దములకు సూరిగారు ఎత్వము మాత్రము చెప్పియున్నారు. చెంచెత, మాలెత. ఇచ్చట చెంచు శబ్దమునకు మాత్రము ఇత్వమును జెప్పఁబడుచున్నది.

సూ. ౫ చెడుగు దుడుకు నిడుపులకుం బుంస్త్వంబున మతు బర్థం బకారం బగు.

ఉ. చెడుగండు, దుడుకండు, నిడుపండు.

వ్యా. 'చెడుగు' 'దుడుకు' 'నిడుపు' అను శబ్దములు మహద్వాచకములైనప్పుడు వానికి మతు బర్థంబున 'అ' కారము వచ్చును. అ ప్రత్యయాంతమునకు మగాది గణ గణనంబునం జేసి డుమ్ము వచ్చును.

సూ. ౬. వేలునకు డ వర్ణకంబు స్వార్థంబునం దగు.

ఉ. వేలుడము.

వ్యా. 'వేలు' శబ్దమునకు 'అడ' అను ప్రత్యయము వచ్చును. 'స్వార్థంబునం' దనుటం జేసి ఆ ప్రత్యయము కూడినప్పుడు వేలుశబ్దార్థము మారదని గ్రాహ్యము. వేలు

+అడ—అనియుండ అమహన్నపుంసకముల కదంతములకు విహితమగు 'ము' ప్రత్యయము రాఁగా, వేఱడ మని రూపము.

సూ. ౭. వెల్ల కడి వర్ణకంబు స్వార్థంబునం దగు.

ఉ. వెల్లడి.

వ్యా. ఇట 'డి' వర్ణకమనినను చాలును.

సూ. ౮. తెలివి విరివి వినికి లేమి రాపులకు స్వార్థంబునం దిడి వర్ణకంబగు.

ఉ. తెలివిడి, విరివిడి, వినికిడి. లేమిడి, రాపిడి.

వ్యా. సూత్రపఠితశబ్దము లైదింటిలో నైదవది యుండంతమగుటచే నిట ప్రత్యయమును 'ఇడ' యనవలయునేగాని 'డ' యన్నంజాలదు.

సూ. ౯. ఇతవర్ణకంబింపు బిగు పోరులకు స్వార్థంబునం దగు.

ఉ. ఇంపితము; బిగితము, పోలితము.

వ్యా. ఇట బిగువు శబ్దమునకుం గడ వ్రాయి లోపించునని యొుఁ జెప్పనగు. ముఁవర్ణకాగమము మీఁద నాఱవసూత్రము క్రింద వ్యాఖ్యాతము.

సూ. ౧౦. ఇదవర్ణకం బొప్పు తప్పు పెల్లులకు స్వార్థంబునందును క్రొవ్వు బెట్టులకు మతు బర్థంబునందును నగు.

ఉ. ఒప్పిదము, తప్పిదము, పెల్లిదము; క్రొవ్విదము, బెట్టిదము.

వ్యా. 'ఇద' ప్రత్యయము వచ్చు తెలుఁగులం జెప్పుచున్నాఁడు—'ఒప్పు, తప్పు, పెల్లు' శబ్దములకు స్వార్థమందనియు, 'క్రొవ్వు బెట్టు' శబ్దములకు మతు బర్థమునందనియుం.

సూ. ౧౧. స్వార్థంబునం దిరి వర్ణకంబు వాఁపున కగు.

ఉ. వాఁపిరి.

వ్యా. వాఁపు—అనఁగా ఉబ్బుదురోగము. దానికి రూపాంతరమగు 'వాఁపిరి'లోని 'ఇరి' యనునది స్వార్థక తద్ధిత ప్రత్యయ మనుట.

సూ. ౧౨. కర వర్ణకంబు నాయఁక శబ్దమునకు భావంబునం దగు.

ఉ. నాయఁకరము.

వ్యా. కర ప్రత్యయము పరమగునపుడు నాయఁక శబ్దాంత్య కకారము లోపించును. కర ప్రత్యయము భావార్థమునందు వచ్చును. నాయఁకరము=అధిపత్యము.

సూ. ౧౩. కారవర్ణకంబు చెలి నయములకు భావంబునందును నుడి కొలతలకు స్వార్థంబునందు నగు. ఈ కకారమునకుఁ గొన్నియెడల గకారం బగు.

ఉ. చెలికారము, నయగారము; నుడికారము, కొలగారము.

వ్యా. 'కార' ప్రత్యయము రెండర్థములలోఁ గల్గుననుచున్నాఁడు—(౧) చెలి శబ్దమునకును నయము శబ్దమునకును భావార్థమునను (౨) నుడి శబ్దమునకును కొలఁతశబ్దమునకును స్వార్థమునను. నయము కొలతశబ్దములకు నంత్యవర్ణలోపమును వానిమీఁది కార ప్రత్యయమందలి పురుషంబునకు సరళాదేశమును అరసికొనవలెను.

సూ. ౧౪. చలికి మిరి వర్ణకంబు స్వార్థంబునం దగు.

ఉ. చలిమిరి.

వ్యా. మిరి ప్రత్యయము స్వార్థంబునం దనుటంజేసి చలి చలిమిరులు పర్యాయరూపములు.

సూ. ౧౫. టి వర్ణకంబొండు నంత్యవర్ణకంబునకు భావంబునం దగు.

ఉ. ఒంటి.

వ్యా. అంత్యవర్ణమున కను వష్ఠింజేసి తత్స్థానంబున నని యర్థము.

సూ ౧౬. పరిమాణార్థంబునం బ్రథమైక వచనంబునందె యెఁడు వర్ణకం బగు.

వి శేష్యంబు భిన్నవచన విభక్తికం బయ్యును మానార్థక శబ్దములమీఁదఁ బరిమాణార్థంబునం బ్రథమైక వచనంబునందే యెఁడు వర్ణకంబు వచ్చునని యర్థము.

ఉ. మూరెఁడు తోఁక, తూమెఁడు బియ్యము, పుట్టెడు తవిఁదలు, పుట్టెఁడు తవిదలకు, రెండుపుట్లు గింజలు. మొ.

వ్యా. మానార్థంబున నేకత్వంబుఁ దెల్పెఁడు వర్ణకం బగునని బాల. తద్ధి. సూ. ౫౯. 'ఏకత్వమునం'దనుటకు ప్రథమైక వచనమం దనునర్థము సూర్యాద్యాహృతములం బట్టి తెలియుచున్నను స్పష్టార్థ మిట మఱల సూత్రింపఁబడినది. మానార్థక ఘటిత విశేషణము దద్విశేష్యము ప్రథమేతర విభక్తికంబయినప్పుడును బహువచనయుతం బైనప్పుడుంగూడఁ దాఁ బ్రథమైకవచనాంతంబయి యుండుననుట ఇట విశేషము.

సూ. ౧౭. దఘ్నార్థంబునం దత్సమపదంబులమీఁదను బంటి గానంబడియెడి.

ఉ. 'కటిబంటి నెత్తురు కాలువల్' రామా. ౭, ఆ.

వ్యా. 'దఘ్నార్థంబున బంటి కొలఁదు లగు'నని బాల. తద్ధి. సూ. ౫౭. సూర్యాద్యాహృతములం బట్టి బంటికొలఁది ప్రత్యయములు ఆచ్ఛికంబులమీఁదనే గల్గునని యేర్పడును. క్వాచిత్కముగఁ దత్సమశబ్దములమీఁదను 'బంటి' చూపట్టుచున్నందున నీ సూత్రము.

సూ. ౧౮. ప్రాచుర్యార్థంబునం దెనుఁగు పదంబులమీఁదను మయట్ ప్రత్యయము చూపట్టెడు.

ఉ. తనమయము. 'వ. విచ్చల విడిని దనమయంబుగా గగనంబున నిగుడు నచ్చక్రంబుం గనుంగొని.' ఉ. హరి. 3 ఆ. తమమయము. 'ఎ. గీ. సమదవృత్తిఁ గేలి సలిపెఁ జకోర చయంబు చదలు దమమయంబుగాఁగ.' నిర్వ. ౬ ఆ. మెదడు ప్రోవులమయము. 'తే. ప్రథన భూమి, మెదడు ప్రోవుల మయ మయ్యె మిక్కుటముగ' హరి. ఉ. ౧౦ ఆ. మొ.

వ్యా. సంస్కృత శబ్దములు ఆంధ్ర విభక్తి ఘటితములై తత్సమంబు లగుట కలదు కాని యాంధ్రశబ్దములు సంస్కృత ప్రత్యయఘటితము లగుట యరుదు. మయట్ ప్రత్యయఘటితార్థ శబ్దములకు గతిఁ గల్పింప నీ సూత్రము.

సూ. ౧౯. ఒకానొకచో మతుబర్థంబున నవర్ణంబు చూపట్టెడి.

ఉ. 'క. అనిలజ నీ [illegible] ట్టని ప్రల్కెను జనునే తలఁప లేడి కడుపునఁ బులి పుట్టునె యిట్టి దివ్యతేజంబునవాఁ డధమాన్వయమునఁ బుట్టునె చెపుమా?' (దివ్యతేజంబున వాఁడు = (దివ్యతేజము గలవాఁడు). భార. ఆది. ౬. అ.

ఇతరంబులు ప్రయోగదృష్టంబులు గ్రాహ్యంబులు.

వ్యా. "దివ్యతేజంబు'న'వాఁడు" ఇట 'న' వర్ణము మతుబర్థకము. ఒకానొకచో' ననుట ప్రయోగ ప్రాచుర్య సూచనార్థము. ఇన్నింట సపూర్వవిశేషంబులం జెప్పియుం గడపట వీరు "అర్థవిశేషంబుల వర్ణకాంతరంబులను మహత్ప్రయోగంబుల నెఱుంగునది." యనిన [బాల. తద్ధి. సూ. ౨౫.] సూరిగారి ననుసరించి 'ఇతరంబులు ప్రయోగ దృష్టంబులు గ్రాహ్యంబు' లనుచున్నారు.

ఇది బాలబోధసుధాపరనామధేయ కుమారదేవపండితీయం బను

ప్రౌఢవ్యాకరణ వివరణంబున

తద్ధితపరిచ్ఛేదము.

# క్రియాపరిచ్ఛేదము.

---

సూ. ౧. తద్ధర్మార్థక విశేషణం బసహాయతం త్రికాలవాచి యగు.

ఉ. 'వారి యనువయించు సిత కృష్ణతంతురాజిత తంత్రమది' (అనువయించు = అనువయించుచున్న) 'వ. నా నేర్చువిధంబున' (నేర్చు = నేర్చిన) భార. అది. ౧ ఆ. 'నాపడు ప్రయాసము లూరకపోక యుండ' (పడు = పడిన) కళా. ౪ ఆ. 'ప్రపదు వీటిలోన ద్రోహి కయ్యము రేచె. బసులఁ బట్టె విరటు పట్టణమున, హాటిపోం నెన్ని లేవు మాస్తిండ తనయుండు, తోడరి మనకుఁ జేయు దుండగములు.' (చేయు = చేసిన) జై. ౧ ఆ. 'ఆ. జనమేజయుం చేయం సర్పయాగమున' (చేయు = చేయఁగల) భార. అది. ౧ ఆ. మొ.

వ్యా. ఇట నసహాయ త యనఁగాఁ బత్తికాలబోధక ప్రత్యయము లేవియుం లేకుండుట.

సూ. ౨. ఒకానొకచోఁ దద్ధర్మార్థకంబులగు నుండు చను చేరుకొనులు ప్రశ్నార్థ కైకారపదకంబు లగునపుడు వాని కడ యుచ్చులకు లోపంబు విభాష నగు. అగుచో నుండు డకారంబునకు నకారం బగు.

చేరుకొను అనఁగా ననుప్రయుక్త మనుకొను ధాతు వని యర్థము.

ఉ. 'క. అమ్మరియాద దప్ప మెలఁగినఁ, బురుషార్థంబునకు హాని పుట్టక యున్నే?' భార. విరా. ౧ ఆ 'మునీంద్ర నీకుఁ జన్నె నలినాక్షులందు మది నిల్పఁగ' భార. ఆది. ౫ ఆ. 'అహితముగా భయముగా దొరకొన్నె నాకు నా పుత్రులకుఁ' భార. సభా. ౨ ఆ. పక్షమున ఉండునే. మొ.

వ్యా. వైకల్పికలోపము చెప్పుచున్నాఁడు, దేనికనఁగా 'కడయచ్చులకు. వేని కడయచ్చులకనఁగా దద్ధర్మార్థకములగు 'ఉండు' 'చను' 'కొను' ధాతువుల కడయచ్చులకు. 'కొను' ధాతువునుమాత్రము విశేషించుచున్నాఁడు 'చేరు', వివరించుచున్నాఁడు 'అనుప్రయుక్తమగు' అని. వాని కడయచ్చులకు లోప మెప్పుడనఁగా చెప్పుచున్నాఁడు 'ప్రశ్నార్థమున ఏకారము పరమైనప్పుడు చను+ఏ, కొను+ఏ—అని యుండ కడయచ్చులకు లోపమును అచ్పరకద్రుత ద్విత్వమునురాఁగా చన్నే కొన్నే—అగును. ఉండు ధాతువునకు 'ఉ' స్థానము నాదేశము గల్గును. ఉండు+ఏ—అని యుండఁగా 'న'కారదేశము రాఁగా ఉన్+ఏ=ఉన్నే. ఆదేశ నకారమునకుఁ జొటిచ్చి మఱిగిపోవు డకారమును బిందుపూర్వమని విశేషించుట మెఱుఁగు.

సూ. 3. తద్ధర్మభూతక్రియ లార్యాద్యర్థపరకంబు లయి ప్రశ్నార్థకంబు లగు.

ఉ. 'సీ. మీవంశమున నరదేవోత్తములలైన సద్ధర్మమార్గంబు నలుపు పయ్య.' 'క. సన్మానితు లయి వర్తింతురయ్యా నీ సైవఙ్ఞులు.' 'పంచితయ్య.' భార. సభా. ౧ ఆ.

వ్యా. అయ్య అమ్మ మొదలగునవి యార్యాద్యర్థకములు. తద్ధర్మక్రియలకును భూతక్రియలకును ఆర్యాద్యర్థములు పరములైన ప్రశ్నార్థ మిచ్చును. ఉదాహృతములలో నలుపుదు+అయ్య, వర్తింతురు+అయ్య—ఇవి తద్ధర్మకాలక్రియలు, పంచితి—ఇది భూతక్రియ.

సూ. ర. ఒక్కొకచోఁ దద్ధర్మక్రియ యార్యాద్యర్థపరకంబయి వ్యతిరేక వ్యంజక ప్రశ్నార్థకంబగు.

ఉ. 'చ. తనయుఁడు తండ్రి యగ్రజుఁడు తమ్ముఁడనం జనునయ్య రాజ్యముం గొను నెడ.' నిర్వ. 3 ఆ. 'సురాంగనలెల్ల నిట్టి నీచేతకు మెత్తు రమ్మ.' స్వా. 3 ఆ. మొ.

వ్యా. ఆర్యాద్యర్థపరకతచేఁ బూర్వసూత్రమున ప్రశ్నార్థముమాత్రమే చెప్పఁ

బడినది. ఈసూత్రమున వ్యతిరేక వ్యంజకప్రశ్నార్థము చెప్పఁబడుచున్నది. చను నయ్యా=చనదు; మెత్తురమ్మా=మెచ్చరు—అని యర్థము.

సూ. ౫. ఆర్యాద్యర్థ మొక్కచో నటుశబ్దపూర్వకంబు నగు.

ఉ. చెల్లునటయ్యా, చెల్లునటమ్మ, 'ఉ. దయసేయఁగ విన్నని మేను వెన్నెలన్, వేఁతు రటమ్మ యింత కను వేఁదురు సెల్లునటమ్మ యింతికిన్.' స్వా. 3 ఆ. మొ.

వ్యా. తద్ధర్మక్రియను అర్థానికిం బ్రశ్నార్థమీనను ప్రయుక్తమగు సార్యాద్యర్థములకును 'అటు' శబ్దము వలన వ్యవధానము కొన్నియెడలఁ గలుగుననుట ఈసూత్రమందలి విశేషము.

సూ. ౬. మహద్బహుకర్తృక క్రియకు నేకవచనంబు విభాష నగు.

ఉ. 'క. తన యెఱిఁగిన యర్థం బొరుఁ, డనఘా యిది యెట్లు చెప్పు మని యడిగినఁ జెప్పనివాఁడును సత్యము చెప్పనివాఁడును ఘోర నరక పంకమునఁ బడున్' భార. ఆది. ౧ ఆ. పద్యమున 'క. బలసంతుఁడు పయి నెత్తిన బలహీనుఁడు ధనము గోలుపడిన యతఁడు ముచ్చిలి వేఁగునతఁడుఁ గాముఁ, కులచిత్తుండు నిద్ర లేక యుండుదు రధిపా.' భార. ఉద్యో. ౨ ఆ. మొ.

వ్యా. ఒకటే క్రియకు మహద్వాచకంబులగు కర్తృపదంబులు పెక్కు లుండి నప్పుడు ఆ క్రియకు ఏకవచనముగాని బహువచనముగాని గల్గవచ్చును.

సూ. ౭. కొన్నియెడలం ద్వరితార్థ సూచకం బయి భావిని భూతంబు చూపట్టెడి.

ఉ. 'తావచ్చె నుదగ్రసాయకుఁడు.' భాగ. ౧౦ స్కం. పూ. మొ.

వ్యా. వచ్చు నను నర్థమున నిట వచ్చె నని ప్రయుక్తము. అట్లు భావికి బదులు భూతమును వాడుట త్వరితమును సూచించును. 'త్వరగా వచ్చు' నని యర్థము.

సూ. ౮. వ్యతిరేక క్రియ యర్థత్రయ బోధకం బగు.

అర్థత్రయము=వర్తమాన భూత భవిష్యదర్థములు.

ఉ. వర్తమానమునకు—'పోఁడు లేచి దిక్కులకు.' (పోఁడు=పోవుచున్నవాఁడు కాఁడు.) భాగ. ౩ స్కం. 'పలుకదు సఖులతో లలితాంగి (పలుకదు=పలుకుచున్నది కాదు. భార. ఆర. ౨ ఆ. భూతమునకు— 'క. నలుఁగాన మిప్పనంబున.' (కానము=కనినవారము కాము) భార. ఆర. ౨ ఆ. 'లెక్కలు రావు సిల్లలకు.' (రావు=వచ్చినవి కావు) భాగ. ౭, స్కం. భవిష్యత్తునకు—'వాసుదేవుఁడుఁ రాఁడను.' (రాఁడు=రాఁగలవాఁడు కాఁడు) భాగ. ౧౦. స్కం. పూ. 'ఆ. నలుని గాని నళినదళనేత్ర వరియింప, దట్టె.' (వరియింపదు=వరియించునది కాదు) భార. ఆర. ౨ ఆ. ఇత్యాదుఁ దెలియునది.

వ్యా. వర్తమాన భూత భవిష్యత్సూచనార్థము వ్యతిరేక క్రియలు రూపభేదము చెందవని యతత్సూత్ర తాత్పర్యము.

సూ. ౯. ప్రార్థనంబునం బన్ప్రత్యయాంత క్రియలమీఁదఁ గద కదవు పూర్వకంబు లన్నాదు లనుప్రయుక్తంబు లగు.

ఉ. పోవఁగదన్న, పోవఁగదవన్న; పోవఁగదయ్య, పోవఁగదవయ్య, పోవఁగదమ్మ, పోవఁగదవమ్మ, పోవఁగదె; పోవఁగదవె, పోవఁగదవే. 'సుకీర్తి మనఁగదన్న.' భాగ. ౧౦ స్కం. పూ. 'చెప్పఁగదయ్య.' భాస్కరశతకము. 'తుది యెప్పుడు మద్విరహాంబురాశికిన్ జెప్పఁగదమ్మ.' భాగ. ౧౦ స్కం. పూ. 'శా. తంత్రీ నాకు సనుగ్రహింపఁగదె ప్రైద్యం బంచుఁ బ్రార్థించినన్.' స్వా. ౫ ఆ. 'క. నీపాద కమల సేవయు, నీపాదార్చకులతోడి నెయ్యమును నితాంత, తాపార భూతదయయును, దాపసమందార నాకు దయసేయఁగదే.' భాగ. ౧౦ స్కం. పూ. 'పురంబుఁ జేరసిం గవ్విధి గాంతుఁ దెల్పఁగదవే తెరువేది.' స్వా. ౨ ఆ. మొ.

వ్యా. సంస్కృతమున నేయర్థమున ధాతువులకుం దుమున్ ప్రత్యయము గూడునో, అదే యర్థమునం దెలుఁగున క్రియలకు 'అన్' ప్రత్యయము వచ్చును.

తత్పరక క్రియలు అన్ ప్రత్యయాంత క్రియలు. వానికిం 'గద' 'కదవు' శబ్దములలో నేదే నొకటియుం దానికిం బరముగ అన్నాదులును కూడి ప్రార్థనార్థ మిచ్చునని సూత్రార్థము.

సూ. ౧౦. ప్రార్థనాదులం దన్ప్రత్యయాంత క్రియలమీఁది యిమ్ము కీకారంబు విభాష నగు.

ఉ. 'సీ. ఓర్పమై నుప్పిండి యుపవాస ముండనీ, మగనాలి సరిఁ బోల్పఁ దగదు విధవ.' (ఉప్పిండి=ఉప్పిండిగ) కాశీ. ౨ అ. 'మ. ముని ధర్మంబుల కెల్ల దవ్వని జనంబుల్ నవ్వినన్ నవ్వనీ.' కళా. 3, అ. 'స్రగ్ధర—కననీ గోడ్రాలు బిడ్డన్, గగన కుసుమముం గల్ల నీటాయి మాటల్, విననీ ముక్తుండు వెండిన్ విపులఁబోడమనీ.' పాండు. 3 అ. వెం.

వ్యా. ఇందలి లక్ష్యములలో మధ్యమపురుష మువర్ణకమునకు లోపము జేసిన పిమ్మట నిమిత్తాపాయ పరిభాష నాశ్రయించినచో నివి యన్నియుం సరిపడును.

సూ. ౧౧. ఒకానొకచో రండు పొండులకు రాపొండని రూపంబు గానంబడియెడి.

ఉ. 'క. నిండు దలంపునఁ దగ రా, పొండను గౌరవము లేని పొరపొచ్చెమునం, గొండంత పసిఁడియిచ్చిన, నుండంగాఁ జనునె వారి యొద్దను వంద్రీ.' య. 3 అ.

వ్యా. రండు+రండు = రారండు, పొండు+పొండు=పోపొండు—అనురూపము లామ్రేడిత శాస్త్రముచేఁ గుదురవచ్చునుగాని, రండు+పొండు=రాపొండు అను రూపమున కిందనుక శాస్త్రము లేదు. కావునం దానిని నిపతించినాఁడని యెఱుంగునది.

సూ. ౧౨. కొన్నియెడల భావార్థకరూపమును శబ్దపరకం బయ్యేనం తదర్థకం బయ్యెడి.

ఉ. 'అనుటయుం లుబ్ధకుం డి ట్లనియె.' భార. అర. ౪ అ. వెం.

వ్యా. 'ట వర్ణకంబు భావంబునం దగు' నను బాల. క్రి. సూ. 3౪ చే టపరక ధాతురూపములు భావార్థకము లగుచున్నవి. భావార్థకరూపమునకు 'ను' శబ్దము, కళ

మీఁదిది గాన యొకవర్ణపూర్వకము, పరమైన ఆనంతర్యార్థము గల్గునని సూత్రార్థము. 'ఆనంతర్యంబున డు వర్ణకంబు క్త్వాంతంబగు' నను బాల. క్రి. సూ. ౪౨న కిది పూరకము.

సూ. ౧౩. భావంబునం దనుప్రయుక్తంబగు కొనుటకుం గోలు విభాష నగు.

ఉ. ఇచ్చుకోలు, పుచ్చుకోలు. మొ. పక్షమున ఇచ్చుకొనుట, పుచ్చుకొనుట. మొ.

వ్యా. క్రియాఫలంబు కర్తృగామి యగుచోఁ గొనుధాతు వనుప్రయుక్తమగు. అద్దానికి భావార్థంబున ట వర్ణముం గూడి 'కొనుట' అని యగును. ఆ 'కొనుట' కు వైకల్పికము కోలాదేశ మీ సూత్రవిషయము.

సూ. ౧౪. కొనుకు కంటె పొంటెలు పరంబు లగునపుడు భావార్థక 'ట' వర్ణకంబునకు లోపంబు విభాష నగు.

ఉ. క. దానిఁజూపుకొనుకనె కాదే, యీయయ్యంబట్టి తెచ్చుట. కళా. ౩, ఆ. 'తే. భూమిపాలించుకొనుకనె పుట్టినాఁడ.' వి. పు. ౧, ఆ. 'క. పతి కలుగు కంటె సౌఖ్యము, సతులకు నొండొకటి కలదె చర్చింపంగా, బతిలేమి సర్వశూన్యము, పతి గలిగిన సతికి నింద్ర పదవది యేలా.' విక్ర. ౬ ఆ. 'క. ఏ పగిదిని బ్రదుక రాదె యిటు చెడు కంటెన్.' హరి. పూ. ౭ ఆ. 'అన్యుల విక్రమముం బ్రకటించు కంటె.' నిర్వ. ౭. ఆ. 'ఎ, గీ. అఖిల తృణలతా తరు నిచయంబు జీడ, పట్టె నిట్టలంబుగ జటి పట్టు పొంటె.' హరి. పూ. ౭ ఆ. మొ. పక్షమున చూపుటకొనకు, కలుగుటకంటె, పట్టుట పొంటె. మొ.

వ్యా. చూపుకొనుకు మొదలగు నిత్యసమాసములలో భావార్థక 'ట' వర్ణ ముండి లోపించినట్లు చెప్ప నేల యనిన టాంత రూపముననే క్రియలకు నబాధ ప్రత్యయార్థత కావున.

సూ. ౧౫. ఒకొక్కచో భూతార్థకాసమాపక క్రియ హేత్వర్థకంబు నగు.

ఉ. 'రాహుకంఠము దెగి దేహము ధరణిం బడినౌ.' భా. ర. ఆ. ౭౧ ఆ. 'బిట్టడలు మనంబునం గదిరి పోయెదువారును.' భా. విరా. ౭ఆ. 'ఏడ్తెఱ వేసిన మోము దాఁకి తిరిగె గరుడి. నిర్వ. 3 ఆ. 'అదియుం దేసె నచ్చి వో లక్ష్మణా యంచుం గూలె.' రా. అర. కాం. ౨ ఆ. 'సీ. పార త్తెత్తి ఘనసార తరువులఁ దనుదాన దొరఁగిన పచ్చ కప్పురపు రజము.' స్వా. ౨ ఆ. మొ.

వ్యా. 'భూతంబునం దిగాగమంబగును.' అని. బా. క్రి. సూ. ౧౭ చే, తెగి, కదిరి మున్నగు సెడల నున్నట్టి యిత్వ భూతార్థకమని మాత్ర మేర్పడుటం జేసి, వానికిం గల హేత్వర్థంబునుంగూడఁ జూప నీ సూత్రము.

సూ. ౧౬. కవిత్రయేతర ప్రయోగంబులం గొన్నియెడల నిన్ ప్రత్యయాదులు పరంబు లగునపుడు పకారం బించుకచ్చకారంబున కేనిఁ గానఁబడదు.

ఉ. 'క. ఎవ్వారిసిఁ జోరించని జణమొకకొటియుఁ దరింపఁగ వశమే.' కళా. ౨ఆ. 'క. ఉపోహించ నొక నాల్గు గడియల, సంచారను వలయు.' కళా. 3 ఆ. అపి శబ్దార్థముచే 'అంగన భీతుల కెల్ల ఖీణి దీర్చుము వెసఁ బొమ్ము నమ్ము మనుచుం గదలెన్.' కళా. ౬. ఆ. మొ.

వ్యా. బాల. క్రి. సూ. ౭౭, ౭౮, ౭౯. ౯౦ లలో పత్వశాస్త్ర మిమిడియున్నది. 'ఇంచుకచ్చకారంబున కేని' యనుట సించుకచ్చకారమునకు నుం బత్వమును సూరిగారు నిత్యముగ విధించి యుంటచే పత్వశాస్త్రమున కవ్యాప్తిం జూపుట ఈ సూత్రోద్దేశము.

సూ. ౧౭. పకారంబు కొన్నియెడల శత్రర్థక చు వర్ణంబునకుం గానంబడెడి.

ఉ. 'మోవి జేరుపుచును' కళా. ౭. ఆ. 'గట్టింపుచు' జై. ౨. ఆ. మొ.

వ్యా. బాలవ్యాకరణమున ఆగమాన్య చకారంబులకు మూత్ప్రకంబులకే 'పవ'లు వచ్చునని సూత్రితము. శత్రర్థ చు వర్ణపరకంబగు చు వర్ణంబునకును పత్వము ఇట

జూపుచున్నాఁడు. సూత్రమున 'శత్రర్థక చువర్ణంబున' కను కువర్ణ్యస్తమునకు 'శత్రర్థ చువర్ణము పరమైనప్పుడు' అను నిమిత్తము నర్థముగాఁ గొనవలెను.

**సూ. ౧౮. అన్నంతక్రియ చేయు యోగంబులం బ్రేరణార్థకం బగు.**

ఉ. 'చొక్కుచుఁ జొక్కఁజేయుచున్.' కళా. ౭. ఆ. 'ఉ. కేశవుఁ డవ్విరాడ్తనువుఁ గృష్ణసమాఖ్య వహింపఁజేసెనో' కళా. ౮. ఆ. మొ. (చొక్కఁజేయు=చొక్కించు, ఇట్లంతట నెఱుంగునది).

వ్యా. 'సర్వంబునకుం బ్రేరణంబునం దించుక్కగు' 'చుగాగమం బాచ్ఛికంబున కసంయుక్త నలడరాంతంబునకుం బ్రేరణంబున బహుళంబుగా నగు' 'అట్లు పుగాగమంబును మాన్యాదుల కగు' అనునవి బాలవ్యాకరణమున క్రియల ప్రేరణార్థక రూపములం దెలుపు సూత్రము ప్రేరణార్థము ఇంచుక్ప్రత్యయాంతములకే కాక, అన్నంతములకును 'చేయు' యోగంబునం గల్గుట ఈసూత్రవిషయము.

**సూ. ౧౯. వ్యాపారోన్ముఖత్వంబున నన్నంతక్రియలకుఁ బాఱు ధాతు వనుప్రయుక్తం బగు.**

ఉ. 'సీ. పయిఁ బఱమరికఁ జొప్పడమిఁ బాకముతప్పి పండఁ బాఱిన పాల మెండఁ బాఱె! స్వా. 3 ఆ. మొ.

వ్యా. వ్యాపారోన్ముఖత్వముం దెలుప నన్నంతక్రియలకుం 'బాఱు' ధాతువను ప్రయుక్త మగుట మాత్ర మిందు చెప్పినాఁడు. ఆయర్థమున నితర ధాతువులు కొన్నియు ననుప్రయుక్తంబు లగు. ఉదా. చెప్పఁబోవు మొ. తావుల 'పోవు;' 'పెరుఁగఁగ నున్నది' మొ. తావుల 'అగు'; 'రానున్నది' మొ. తావుల 'ఉండు'.

**సూ. ౨౦. తిగుచు ధాతువు నన్నంతరూపములు తివ్వఁ దివ్వ ననియు.**

ఉ. 'క. ఎవ్వరికని మోపెట్టను, దివ్వను శక్యంబుగాని దృఢకార్ముకము …' భా. ఆది. ౭ ఆ. 'కొప్పు పట్టి తివం బోవ.' కళా. 3 ఆ.

వ్యా. బాల. క్రి. సూ. ౭౮ చే 'తిగువన్' అనురూపము మాత్రమే సిద్ధించుం గాన దానికి ఈ సూత్రము పూరకము.

సూ. ౨౧. కంటె వర్ణకంబు పరం బగునప్పుడు విశేషణాన వర్ణకంబు మీఁది యమహత్తచ్ఛబ్దార్థమునకు లోపంబు విభాష నగు.

ఉ. 'క. లో, శత్రుయరాజ్యము మును నిర, మిత్రముగాఁ గనిన కంటె.' లక్ష్మీ. 3, ఆ. 'విభుని పంచినకంటె.' హరి. ఉ. ౪, ఆ. 'తే. శరణు చొచ్చిన రక్షింపఁ జాలియుండి, మనుపకుండిన కంటెఁ గల్మషము కలదె!' విక్ర. 3 ఆ. 'క. కుడిచినకంటెను క్షేత్రము, పడసిన లెఱ్ఱ వధిక మంద్రు పాడికి జనుచోన్.' విజ్ఞా. వ్య. పక్షమున కనిన దాని కంటె. మొ.

వ్యా. 'ఉన్న కలజెన వర్ణకంబులు భవద్భావిశతృక్త్వవదర్థంబులం దగు'నని బాల. క్రి. సూ. ౪౬ చే క్త్వవదర్థంబున నవర్ణము విధింపఁబడినది. అదే ఇట విశేషణ నవర్ణకంబు నాఁబడినది. దానికిం బరముందు మహత్తచ్ఛబ్దార్థ ముండిన దానికి లోపము లేదు. ఆమహత్తచ్ఛబ్దార్థముండిన నద్దానికి వైకల్పికముగ లోపము గల్గునని ఈసూత్రము. ఉండి లోపించు నన నేల యన్న తచ్ఛబ్దార్థయోగము లేనిదే క్త్వవదర్థక నాంతరూపంబునకు కంటె మున్నగు ప్రత్యయాగ్వాత లేదు.

సూ. ౨౨. క్రియావిధేయ విశేషణంబుల మీఁది యగు ధాతువున కన్నంతమునకు లోపంబు విభాషనగు.

ఉ. క్రియా విశేషణములకు—'క. పెల్లు దొరఁగు నెత్తురున్నె.' భార. భీష్మ. ౧. ఆ. 'క. సౌందర్యవిలాసాదుల, యందునె తగులు వడి యితర మరయుని మగవా, రుం దఱచు గలర.' కళా. ఆ. 'క. తెల్లము నా కెఱిఁగింపుము.' వి. పు. ౨ ఆ. విధేయ విశేషణములకు. 'క. లవణాబు కప్పు మడుగుము.' ఉ. హరి. ౭ ఆ. 'తగు నస్తువు లప్పన మంపు వారు' కళా. ౮ ఆ. 'వరుని పేర్చు నడుమఁ దెరవాటు గొట్టె.' కళా. ౭ ఆ. 'చ. భవజ్జనకుఁ బరిక్షితుఁ భుజగజాల్మఁ దసహ్య విషోగ్ర ధూమారే, తనహాలిఁజేసి చేసె నతిదాంతుఁ గృతాంత నికేత నాతిథిన్.' భార. ఆది. ౧ ఆ. పక్షమున పెల్లుగఁ దొరఁగు, కప్పుముగ నడుగుము. కృతాంత నికేత నాతిథిగఁ మొ. 'మంత్రులఁగా నొనరించితె.' భార. సభా. ౧ ఆ. మొ.

వ్యా. 'నఞ్వ్యంతం బగు నగు ధాతువు క్రియావిశేషణంబుల కనుప్రయుక్తం బగు'నని బాల. క్రి. సూ. ౧౧౫. విధేయవిశేషణంబులకును నయ్యది యనుప్రయుక్త మగునని బాల. లాఁ జెప్పుచున్నను అగును ఆ నఞ్వ్యంతమునే ఇతఁ డిట అన్నంత మనుచున్నాఁడు. కాను, కాక, కను, కక — అనునవి నఞ్వ్యంతంబగు నగు ధాతువు రూపములు. బాల. సూత్రసరణిం బడి విశేషణంబులకు దీని యనుప్రయోగము నిత్య మని తోఁచునట్లుండుటం జేసి ప్రయోగంబుల నట్టి నిత్యత యర్థానికి లేమిం జేసియుం వైకల్పిక లోపము నిట సాధించినాఁడు.

**సూ. ౨౩. ఒకానొకచో నన్నంత మగు నగు ధాతువు దీర్ఘంబునకు భావ్యర్థంబున నున్న పరం బగు నపుడు హ్రస్వమును గానంబడియెడి.**

ఉ. 'క. తరుణీ యేరికిఁ జెల్లును, యరయఁగ నే మింతవార మన కొన నిదిగో బిరుపీఁకుగ నున్నది తాఁ, గర మద్భుతమైన సవతి కయ్యముచేతన్.' (కనున్నది కానున్నది యని యర్థము. పిరుపీఁకు కర్త.) కళా. ౧ ఆ. నీకు నాథుఁడుగ నున్న-మహామహు నా నృపాలు నా కెప్పుడు చూడఁగాఁ గలుగు.' (నాథుఁడుగ నున్న=నాథుఁడు కా నున్న యని యర్థము.) కళా. ౫ ఆ. మొ.

వ్యా. అన్నంత మగు నగుధాతువునకుం గ్రియావిశేషణపూర్వకమునకే సూరి ప్రభాషిత హ్రస్వతం జెప్పినాఁడు. భావ్యర్థమందును హ్రస్వత నెనయుట గలదని ప్రౌఢ కారుఁడు. 'ఒకానొకచో' ననుట ప్రయోగవైరళ్య సూచనార్థము.

**సూ. ౨౪. శబ్దపల్లవ క్రియలు కొన్ని ద్విరుక్తంబు లగుచో నుత్తర పదంబు పూర్వావయవంబునకు లోపంబు విభాష నగు.**

ఉ. 'సీ. చటులఖురోద్ధత టాశ్వశ్రేణిఁ బొదివి రయంబునఁ దునిమి కొట్టాడి యాడి.' భార. విరా. ౫ ఆ. 'సీ. ఇందు రా రావయ్య విందులు విందు లం చర్థిఁ బిల్వఁగ నడరాడి యాడి.' హరి. పూ. ౫ ఆ. 'పోరాడి యాడి చేసొన్ని దవ సేని.' హరి. పూ. ౭ ఆ. 'వ. పరస్పర

జయార్థు లగుచు వా దడిచి యడిచి.' కాశీ. ౫ ఆ. 'సీ. ఎడ నెడను గవ్వ్లఁ బడఁబడ ఖండంగ గుఱులు మదిఁ బాదు గ్రోలిపి గ్రోలిపి.' కళా. ౪ ఆ. 'తదీయ రూపముఁ మదిఁ దలపోసి పోసి.' పర. ౨ ఆ. మొ. పక్షమున తూఁటాడి తూఁటాడి మొ.

వ్యా. సూర్యుక్తమైన యామ్రేడిత శాస్త్రమున పరరూప పూర్వాంగ్యయవ లోపం బునకు గ్రహణము గల్గి యుండనందున నిట బృహత్సూత్ర కరణ మరి గ్రాహ్యము.

సూ. ౨౫౫. శబ్దపల్లవ క్రియలును ద్వ్యక్షరయావ క్రియలును సమాప్తంబు లయి పునర్గృహీతంబు లగుచోఁ దత్పూర్వావయవంబులకు లోపంబు విభాష నగు.

ఉ. 'ఆలలితాంగిఁ దోడ్కొని చనుదెమ్ము తే నను గూడని పక్షమునందు.' భోజ. ౩ ఆ. 'ఇలకుఁ దివికం జన నిచ్చు నిచ్చి యే నని వెస నార్చు.' రా. అర. కాం. ౨, ఆ. మొ. పక్షమున చనుదే, చన నిచ్చి. మొ.

వ్యా. అసమాప్తిం బునర్గ్రహణము పూర్వసూత్ర విషయము. సమాప్తంబు లయి పునర్గృహీతము లగుట ఈసూత్ర విషయము. ధాతువులు రెండు (a) స్వార్థనాశ పూర్వకముగ నేక క్రియఁగఁ గూడు నేని యట్టి క్రియ శబ్దపల్లవము; (b) స్వార్థత్యాగపూర్వకముగ నేక క్రియఁగఁ గూడు నేని యట్టి క్రియ ద్వ్యవయవము.

సూ. ౨౫౬. ఒకానొకచోఁ సహార్థంబున యుష్మదస్మదర్థంబు లభిహితంబు లగు నపుడు క్రియలు తత్ కర్తృకంబులు విభాష నగు.

ఉ. 'ఉ. విప్రకులుండ వెల్వడుము వేగమ నీవును నీ నిషాది యుఁగా,' భార. ఆది. ౭ ఆ. 'క. మన కాప్తుఁడు సంజయుఁడీ,తని యుపదేశంబు పట్టి ధర్మమున మునుకొం,దుని నాక్రమింప వయ్య య, తనిఁ బొందిన బ్రదుకు దీవుఁ దమ్ములు సుతులున్' భార. ఉ. ౨ ఆ. 'నేను నా సేనయుం దాఁడి పెట్టెద విశృంఖలతన్.' హరి. ఉ. ౩ ఆ. 'ఆ. ఎలుఁగు రాలు పడఁగ నిట్లనుఁ బడు నాలు, గేండ్లు రాఘవుండు

## క్రియాపరిచ్ఛేదము.

నీవు న న్న,రణ్యభూములందు రక్షించి తేఁడు కా,అడవి చెట్టు లాంటి విడిచెదనిన.' శ్రీ. ౬. ఆ. మొ. పక్షమున 'మోహాంధుండు భీష్ముండుఁ గెలవ నీవుం గడఁగుండు.' భార. సభా. ౨ ఆ. మొ.

వ్యా. ఇట బాలవ్యాకరణముచే సహార్థమందు తోడ వర్ణకము రావలసియున్నది. ఇచ్చట నిషేధిపదమునకుం బరమునను న్న సముచ్చయము సహార్థవ్యంజకము. తదనుగుణముగ నేకవచనాంతక్రియ నుపయోగింపవచ్చునని తెలుపుచున్నాఁడు. సముచ్చయస్థలములందు సాహిత్య మైచ్ఛికము.

**సూ. ౨౮. కర్తృభూతక్రియతోడం దత్కర్త కన్వయం బగు.**

ఉ. నీవు రావచ్చును పోవచ్చును. మొ. ఇందు రాఁబో నను 'కర్తృభూతకర్తృభూతక్రియలతో' వానికిఁ గర్తయగు నీవనుదాని కన్వయంబరి యుంగవలయు.

వ్యా. వలయ్వాది పరకమైనప్పుడు ధాతువునకుం గర్తృభావము బాల. క్రి. సూ. ౧౨౨ లో చెప్పఁబడినది. వలయును, వలదు, కూడును, కూడదు, చెల్లును, చెల్లదు, తగును, తగదు—ఇత్యాదులు వలయ్వాదులు. నీవు రావచ్చును నీవు పోవలయును—మున్నగువాక్యములలో 'నీవు' మొదలగు కర్తృపదముల కన్వయము వలయ్వాదితోనా లేక కర్తృభూత రాఁబో నాదిక్రియలతోనా యన్నం దొలిది కాదనియుం రెండవది యగుననియుం నీ సూత్రార్థము.

**సూ. ౨౯. ఒ ఓ లకు సందేహార్థకంబులకు వలయుచోఁ గొన్నియెడలఁ గదా కదే లనుప్రయుక్తంబులగు. ఉద్దేశంబు ద్వ్యవయవం బేని విధానం బం దొక్కటి కడదాని కగు.**

ఉ. 'ఎంత కృతార్థుల మో కదా.' వి, పు. ౭ ఆ. 'శాంతంబు కాదో కదే.' భోజ. 3 ఆ. 'అవునో కాదో కదా.' రామా. ౬ ఆ. మొ.

వ్యా. 'వలయుచోఁ గొన్నియెడల' ననుటచే విధానం బసార్వత్రిక మనియు 'సందేహార్థముల' ననుటచే ప్రశ్నాద్యర్థకంబు లగునప్పుడు 'ఒ ఓ' లకి య్యాను

ప్రయోగ ముండదనియు గ్రాహ్యము. ద్వ్యర్థపయుపం బనఁగా వికల్పార్థయము వచ్చినపు డని యర్థము.

సూ. ౨౯. తెలచుగం గ్రియల మీఁది కద కదవుల కన్నాదులు పర్యాయంబున ననుప్రయుక్తంబు లగు.

ఉ. 'ఊ. అలసితివి గదన్న యాఁకొంటివి గదన్న,' భాగ. ౧౦. స్కం. పూ. 'వీయపురాల పైతిగఁదవేయిపుడు' విజ. 3 ఆ. తెలచుగ ననుటచే, 'ఉ. పూఁతసపిండి పంట వలపుం బచరించు కులంబు నీతికిన్, లేఁతగదమ్మ యిత్తెఱఁగు లేమ' స్వా. 3 ఆ. 'దయాంబురాశివి గదమ్మ,' భాగ. ౧౦ స్కం. పూ. ఇత్యాదు లూహ్యంబులు.

వ్యా. తెలచుగనంట బహుళార్థకము గావున అన్నాదుల యనుప్రయోగము క్రియేతరంబులమీఁది కద కదవులకున్నను వానికి నిటనే ప్రమాణము గల్గునని తెలియం నది. ఉదా. లేఁతగదమ్మ, దయాంబురాశివి గదమ్మ.

సూ. 3౦. అన్ ప్రత్యయాంత మగు నగు ధాతువు కొన్నియెడలఁ బెక్కు చోట్ల కొక్కటియు నగు.

ఉ. 'తే. ధర్మజుఁడు తూర్పు భీముఁడు దక్షిణంబు, నప్తసుఁడు పడమరఁ గవ లర్థి నుత్తరంబుఁగా వేటఁబోయిరి రాజముఖ్య, లనఘు లింతకువత్తురు వినుత బలులు.' భార. అర. ౬ ఆ. పక్షమునఁ దూర్పుగ, దక్షిణంబుగ, పడమరగ ననియు నుండవచ్చును.

వ్యా. పెక్కుచోట్ల కొక్కటి గలుగునపుడెల్లఁ గడపటనే గల్గుచుండును.

సూ. 3౧. కాదె కదార్థకం బగు.

ఉ. 'ఏ, గీ. కౌరి కృపగాదె నాకు నక్షయబలంబు.' జై. ౨ ఆ.

వ్యా. కదా ఖల్వర్థకము, ప్రసిద్ధిం దెలుపు నవ్యయము. ఈ యవ్యయంపు నర్థ మునవే 'కాదె'కు ప్రయోగము జూపుచున్నాఁడు. కాదె—ఇది యగు ధాతువు

యొక్క ముత్తరక రూపము, ఏకారముతో వ్యతిరేక వ్యంజక ప్రశ్నార్థకముతో ఘటితము.

### సూ. 32. అయి కా నవ్యయంబులు స్వయ మర్థకంబులగు.

ఉ. వాఁడయి వచ్చెను, వాఁడుగా వచ్చెను—వాఁడు తనంత వచ్చె ననుట, 'ఉ. తలంపరు నీవుఁ దెల్ప నీవై పరికింపవంచు దురహాంకృతి నాయమఁ గన్నదంపతుల్.' కళా. ౭ ఆ. 'అక్షీణప్రభావుండు సర్వకళాసంజనకుండు నారదుఁడుగా రాఁజూచి.' నిర్వ. ౫ ఆ. మొ.

వ్యా. అగు ధాతువుయొక్క క్త్వాంతరూపము - అయి; ణిజ్యంతరూపము- కాఁగా; ఈ యవ్యయంబులను రెంటికిని 'తనంత' యను నర్థమును లక్ష్యములలోఁ జూపుచున్నాఁడు. సర్వత్ర నదే యర్థ మని తలంపరాదు. 'ఆద్యుఁడయి యప్రమేయుఁడై యఖిలసేవ్యుఁడై యొసంగెడు దేవుని నభినుతింతు.' 'పిరులేఁతుఁ(గ) కానున్నది' ఇత్యాదులలో నాయర్థము లేదు.

### సూ. 33. అకానిత్యర్థకం బగు.

ఉ. 'అపజయము కా లక్షించి.' భార. అర. ౨ ఆ. మొ.

వ్యా. ఇతి+అర్థకము='అని' అను నర్థ మిచ్చునది. అగుధాతువుయొక్క ణిజ్యంతరూపంబగు 'కా' ననునది అవధారణార్థకావ్యయంబగు 'అ' మీఁద ప్రయుక్తమైనప్పుడు 'అని' యను నర్థమిచ్చును.

### సూ. 34. కరఁగు తలఁగు మెఱయ్యాదు లంతర్భావిత ప్రేరణంబులు.

వ్యా. ప్రేరణించు నుచుపుగాద్యాగమములు లేకయే ప్రేరణార్థ మిచ్చును. ఉ. 'ఎ. గీ. కుసుమబాణుని బాణముల్ గూడ సైదుఁ, గరఁగి నేరిమి వాటించి కరువు గట్టి, ప్రోది చేసె చైతన్య సంపుటము తగ ఘటించి లోకాక యుట్టి చేడియలుగలరె.' భార. విరా. ౨ ఆ. 'సీ. ఉత్తమక్షత్రియుం డొరుల దుఃఖంబులు తలఁగంగ బుట్టిన ధర్మశీలుఁడు.' భార. ఆది. ౬ ఆ. 'అపారబలంబుల్ మెఱయించెడ భీమునకు నం, దొఱుఁ

గిద్దఁడు దొడఁగి యుద్ధతులు రాజసుతుల్'' భార. ఆది. ౫ ఆ. ౯౦. కురియు, అఁగు నిత్యాదు లాదిపద గ్రాహ్యములు.

సూ. ౩౫. అడుగ్వాదులు ద్వికర్మకంబులు.

వ్యా. అడుగు=ప్రశ్నముచేయు, అడుగు యాచించు మున్నగునవి యడుగ్వాదులు. ద్వికర్మకంబులు=రెండుకర్మలు గలవి. 'ఇవ్విషయమును రాము నడిగితి.' విషయమును రాముఁ—రెండుకర్మలు.

ఇది బాలబోధసుధాపరనామధేయ కుమారదేవపండితీయం బను
ప్రౌఢవ్యాకరణ వివరణంబునందుఁ
క్రియాపరిచ్ఛేదము.



---

# కృదంతపరిచ్ఛేదము.

వ్యా. ధాతువునకు భావకర్త్రాద్యర్థంబుల విహితంబగు దు ఇఖ్కిన్న ప్రత్యయంబు కృత్తనంబడునని సూరి.

సూ. ౧ డయ్యు దయ్యు నొచ్చు ప్రుచ్చుల కి వర్ణకం బగు అగుచో వాని కడ వ్రాల్లులు పకారంబు లగు.

ఉ. డప్పి, దప్పి, నొప్పి, ప్రుప్పి.

వ్యా. 'డక్కు లోనగు వాని దాను డకారంబు విభాష నగు' నను బాల. ప్ర. సూ. ౧౮ చే డయ్యు దయ్యులు ఒండొంటికి రూపాంతరములు. వీనికిం గృదంతరూపంబులు బాల. లో లేదు. నొచ్చునకు నోవనియుం, ప్రుచ్చునకుం బ్రువ్వనియుఁ గృదంత రూపంబులు 'ప్రువర్ణకంబు మన్నాదుల కగు' నను ౧౭ వ సూ. క్రింద సూరిగారొసంగియున్నారు. ప్రుచ్చుయొక్క రూపాంతరము పుచ్చు. కాని ఈ యిదాగమ పాదేశయుత రూపములు బాల. లో సాధింపఁబడనివి.

సూ. ౨ రాచున కిడి వర్ణకంబు నగు.

ఉ. రాయిడి, రాపు.

వ్యా. 'ఇడి వర్ణకంబును'—ఇట సముచ్చయార్థక 'ను' వర్ణము. బాల [కృ. సూ. ౧౧] ప్రోక్త ప్రువర్ణకమును గలుపుకొనుటకు. ఉదాహరించుచున్నాఁడు 'రాపు' అనియుం. బాల. కృ. సూ. ౨౦ క్రింద రాపుడు అనియు రూపముగలదు.

సూ. ౩. ఈర్చు ఉబ్బు కందు దువ్వు వడ్డించుల కైన వర్ణకం బగు. అగుచో ఈర్చు ఉబ్బుల చకార బకారంబులు పకారంబు లగు; వడ్డించు నించు లుప్తం బగు.

ఉ. ఈర్పన, ఉప్పన, కందన, దువ్వన, వడ్డెన.

వ్యా. ఈర్చు=గీఱుచు; ఉబ్బు=పొంగు; కందు=నలుసగు; దువ్వు=చిక్కుదీర్చు; వడ్డించు=భోజ్యపదార్థము పళ్లెమునందుంచు. వీనికి ఐన వర్ణకంబును విధించి ఈర్పెన ఇత్యాదిరూపముల నిట సాధించెను. కాని ఈర్పుపు అని. బాల. కృ. సూ. ౨౦

చేతను, ఉబ్బుకొను అని. బాల. కృ. సూ. చేతను రూపాంతరము లేర్పడునని తోఁచుచున్నది.

సూ. ౪. పురవర్ణకంబు కాఁచు దాఁచు దాయ్యాదుల కగు.

ఉ. కాఁపురము, దాఁపురము. దాపురము మొ.

వ్యా. పురవర్ణకాంతము క్లీబసమంబుగాన మ్వాగమ మరి తెలియవలెను. దాఁపురము=దాఁగఁజేఁత. దాపురము=చేరువు—అని సబిందు నిర్బిందురూపముల కర్థభేదము.

సూ. ౫. ఎక్కు దిగులకుం బ్రేషణార్థంబున మతి వర్ణకం బగు. అగుచో నెగు ఎక్కున కాదేశం బగు.

ఉ. ఎగుమతి, దిగుమతి. ఇట్లు ఎగువ.

వ్యా. మతివర్ణకముకూడుట చేనికన్న పైకి (=పరదేశములకు) పంపఁబడిన దగు నను నర్థముగల 'ఎక్కు'నకును, క్రిందికి (=మనదేశమునకు) పంపఁబడినదగు నను నర్థముగల 'దిగు'నకును, 'మతి'కి ముందు 'ఎక్కు'నకు 'ఎ' గ్వాదేశమును—వీనికే 'మతి' వర్ణకమేకాక 'వ' వర్ణకమును అర్థాంతరమునం గూడును. ఉదా. ఎగువ, దిగువ.

సూ. ౬. వు వర్ణం బులియ్యాదుల కగు

ఉ. ఉలివు. మొ.

వ్యా. వు వర్ణకంబని యుండవలసినది. వు వర్ణంబని లుప్తకమగుట లేఖక ముద్రాపకుల ప్రమాదహేతుకమై యుండనోపును. 'ఉలివు' బాల. కృ. సూ. ౧౭ చేతనే కుదురఁగలదు. ఈసూత్ర మక్కఱయుండదు.

సూ. ౭ కాచు వీచులకు వలి వర్ణకం బగు.

ఉ. కావలి వీవలి.

వ్యా. కాచు=కాపాడు. వీచు=విసరు—వలి వర్ణకపరకము లైనప్పుడు వీవలి = గాలి, [వీచునతఁడు] కావలి=రక్షణము [రక్షకుండని కాదు]—అను నీవ దర్థభేదము గలదు. కావలికి కాపను రూపాంతరముం గలదు.

ఇది బాలబోధసుధాపరనామధేయ కుమారదేవపండితీయం బను
ప్రౌఢవ్యాకరణ వివరణమందు
కృదంతపరిచ్ఛేదము.

# వాక్యపరిచ్ఛేదము.

---

సూ. ౧. వాక్యమనఁగా యోగ్యతాకాంక్షాసహితం బగు నర్థము గల యాసత్తియుక్త పదసముదాయంబు

యోగ్యత యనఁగాఁ బదార్థములకుఁ బరస్పరసంబంధమునందు బాధ కలుగకుండుట. ఆకాంక్షయనఁగా నిలుపుదల లేక పయిఁ బయిఁ బోయెడి పదార్థముల మీఁది యాదరము, అది వినువారికిఁ దెలిసికొనవలయు ననెడి యపేక్షారూప మయినది. ఆసత్తి యనఁగాఁ బదముల చేరిక. యోగ్యతయు, ఆకాంక్షయు, ఆసత్తియు లేక 'నిప్పుచేఁ దడుపుచున్నాఁడు', 'గోవు, గుఱ్ఱము' అని యిట్లు చెప్పుటచేతను, బుద్ధి మఱపు లేక నేఁడు దేవదత్తుఁ డని చెప్పి మఱియొకనాఁడు పోవుచున్నాఁడని చెప్పుట చేతను పదసముదాయము వాక్యముగా నేర్పడినను నది వాక్యమని చెప్పఁదగినది కాదని తాత్పర్యము. వాక్యములందు గొన్ని క్రియాన్వయముగలవి, కొన్ని తదితరాన్వయము కలవి. వాని యుదాహరణములు మీఁద స్పష్టములు గాఁగలవు. క్రియ లనఁగా వర్తమానాద్యర్థకము లయిన సమాపక క్రియలు. క్త్వాత ద్వ్యతిరేక శతృ తుమున్ చే దానంతర్యార్థకము లసమాపక క్రియలు. ఇందు మొదటివి మూఁడు క్రియావిభిన్న కర్తృకంబులు, వెనుకటివి మూఁడు క్రియాభిన్నకర్తృకంబులు.

వ్యా. వాక్యమనఁగా నేమి యనిన 'పదసముదాయం' బనుచున్నాఁడు. 'ఈవాక్యము' తరువాత సూ. 5 చేతను మఱల నిర్వచింపనున్నాఁడు. వాక్య మనిపించుకొను పదసముదాయ మెట్టి దనం దానికి రెండులక్షణములఁ జెప్పినాఁడు. (a) యోగ్యతతోను ఆకాంక్షతోను గూడుకొన్న యర్థము. (b) ఆసత్తి—ఈరెండు లక్షణములు లేని పదసముదాయము వాక్యము కానేఱదు. యోగ్యతాకాంక్షాసత్తు లను మూలకారుఁడే వివరించియున్నాఁడు. క్రియాన్వయయుతములు తదితరాన్వయయుతములు—అను ద్వైవిధ్యమును వాక్యమునకును, సమాపకములు అసమాపకములు—అను ద్వైవిధ్యము క్రియలకును, క్రియావిభిన్నకర్తృకములు క్రియాభిన్నకర్తృకములు నను ద్వైవిధ్య మసమాపక క్రియలకును అరసికొనవలెను. అసమాపక క్రియలలో 'తద్వ్యతిరేక'— అనఁగా

తద్ (శేషః) = ఆ క్త్వాంతములలో, వ్యతిరేక = వ్యతిరేకార్థకములు—వ్యతిరేక క్త్వార్థక ములు. వీనికి వీరు సంజ్ఞ. సూ. ౨లో అకప్రత్యయాంతము లని యున్నారు. క్రియా విభిన్న కర్తృకము లనఁగా తాముండు వాక్యములందలి సమాపకక్రియల కేవో అవే తమకును కర్తలుగాఁగలవి—క్త్వార్థకములు, వ్యతిరేక క్త్వార్థకములు, శత్రర్థకములు. క్రియాభిన్నకర్తృకము లనఁగా తా ముండు వాక్యములందలి సమాపకక్రియల కేవో అవికాక వేఱైనట్టి కర్తలు గలవి—తుమున్ చేదానంతర్యార్థకములు. వీ రిట్లన్నను తుమున్నంతములకుం గ్రియాసమానకర్తృకత ప్రయోగంబుల గాన నగు.

సూ. ౨. పద మనఁగాఁ బ్రయోగార్హంబు ననన్వితంబు నేకంబు నర్థ
బోధకంబు నైన వర్ణము, లేక వర్ణ సముదాయము.

ఉ. ఖంబు, లేక ఘటంబు. మొ. ప్రయోగానర్హము—ఖ, ఘట. మొ. అన్వితము-ఖంబుఘటంబునం దోఁచెడి. మొ. అనేకము—ఖంబును ఘటంబును, మొ. అనర్థబోధకము—క, చ, ట, త, ప, మొ.

వ్యా. వాక్యమొకవిధంపుఁ బదసముదాయం బని పూర్వోక్తము. పద మన నేమో ఇటఁ జెప్పుచున్నాఁడు—'వర్ణము, లేక వర్ణసముదాయము' అని. పద మనిపించుకొను వర్ణమునకుఁ గాని వర్ణసముదాయమునకుఁగాని లక్షణములం జెప్పుచున్నాఁడు వాట్లిం టిని (i) ప్రయోగార్హత (ii) అనన్వితత్వము (iii) ఏకత్వము (iv) అర్థబోధకత్వము. ప్రయోగార్హత యనఁగా ప్రత్యయ ఘటితత్వము. ఒండొంటిం గూడక ప్రాతిపదిక ములు, ప్రత్యయంబులును వేర్వేఱుగాఁ బ్రయోగింప నర్హములు గావు. అనన్వితత్వ మనఁగా అన్వితత్వము లేమి. అన్వితత్వ మనఁగా అన్వయము గలిమి అన్వయమును నాల్గవసూత్రంబున మూలకారుఁడే వివరింప నున్నాఁడు. 'పదములకుఁ బరస్పరము గల సంబంధ' మని. పరస్పరసంబంధముచేఁ బదముల పదత్వము వాక్యత్వమునం బర్యవసిం చును. ఏకత్వ మనఁగా నవిభాజ్యత. పదమును విభజించినం బ్రాతిపదికమును ప్రత్యయ మును వేర్వేఱై పదత్వమే నశించును. 'ఖంబును ఘటంబు' అను నక్షరసముదాయమున నవిభాజ్యత లేదు. ఖంబును ఘటంబును వేఱుచేయఁదగియున్నవి. వేఱుచేయఁ దగకుండు టే పదలక్షణము గావున వేఱుచేయఁ దగియుండుట అపదలక్షణ మగును.

సూ. 3. పదము లవి నామములు క్రియ లవ్యయంబు లని త్రివిధంబులు.

నామములు నా వస్తువాచకశబ్దములు. సందర్భవశంబున నవి కొన్ని కర్తలనియుఁ గర్మములనియుఁ జెప్పబడును. ధాత్వర్థ వ్యాపారాశ్రయము కర్త. ధాత్వర్థఫలాశ్రయము కర్మము. క్రియలనఁగా వ్యాపారావబోధకము లయినవి. అవి సకర్మకములు అకర్మకము లని ద్వివిధములు. కర్మముగలది సకర్మకము, కర్మములేనిది యకర్మకము. కర్తృకర్మక్రియలుగూడఁ బ్రయోగ మనంబడు. అది కర్తరిప్రయోగము, కర్మణిప్రయోగము నని ద్వివిధము. క్రియచేఁ గర్త చెప్పఁబడు నేని యది కర్తరిప్రయోగము, కర్మము చెప్పఁబడు నేని కర్మణిప్రయోగము. కర్తరిప్రయోగము సకర్మకక్రియగలచో సకర్మక కర్తరిప్రయోగమనియు, అకర్మకక్రియగలచో నకర్మక కర్తరిప్రయోగమనియుఁ జెప్పఁబడును. అవ్యయము లనఁగా విభక్తివచనశూన్యములు, అవి ప్రతిపదోక్తములు లాక్షణికములని ద్వివిధములు. ప్రకృతిసిద్ధములు ప్రతిపదోక్తములు, లక్షణసిద్ధములు లాక్షణికములు.

వ్యా. అకర్మక కర్తరిప్రయోగమునం గర్మముండదుగదా, ఇఁక 'కర్తృకర్మక్రియలుఁగూడఁ బ్రయోగ మనంబడు'నను లక్షణమునకు సామగ్ర్యమెట్లో! సంస్కృతంబునఁ 'గర్తరిప్రయోగః' 'కర్మణిప్రయోగః' అనునవి వ్యస్తములు, అలుక్సమాసములు గావు. వానిని సమాసములుగ నైకైకప్రాతిపదికములుగఁ గొని ము ప్రత్యయముం గూర్చి కర్తరిప్రయోగము కర్మణిప్రయోగము—అనురూపము లేర్పఱచుటకు మహాజనుల వ్యవహారమే యాధారము. ఇట్టిదే—భావేప్రయోగము, శుచిర్భూతుఁడు మొ.

సూ. 4. పదములకుఁ బరస్పరముగల సంబంధ మన్వయ మనంబడు.

వ్యా. పదలక్షణములలో నన్వితత్వ మొక్కటిగఁ బూర్వతర సూత్రోక్తము. అనన్వితత్వ మన నన్వయము లేమిగదా! అన్వయమన్న నేమో ఇట వివరించుచున్నాఁడు.

సూ. ౫. విషయబోధకము వాక్యము.

[విషయము=తెలియఁదగిన యంశము.]

వ్యా. తెలియఁదగిన యంశమును బోధించునట్టిది వాక్యమనుట.

సూ. ౬. ఉద్దేశ్యవిధేయభిన్నంబు విషయంబు.

విషయ ముద్దేశ్యవిధేయములతోఁ గూడినది, అనఁగా విషయమునం దుద్దేశ్యము, విధేయము నని రెండుగలవని యర్థము. ఉద్దేశించి చెప్పఁదగినది యుద్దేశ్యము, మీఁదఁ దెలియఁదగినది విధేయము. ఉద్దేశ్యము వక్తృశ్రోతల కుభయులకుఁ దెలియును, విధేయము వక్తకు మాత్రము తెలియును. విశేష్యాదిక ముద్దేశ్యము, క్రియాదికము విధేయము. విశేష్యాదికము—విశేష్యము, విశేషణము, సర్వనామము. క్రియాదికము—క్రియ, విశేష్యము, విశేషణము, సర్వనామము. అది పదద్వయముచే అన్నంతక్రియలును నేలాద్యవ్యయములును గ్రాహ్యములు. విశేష్యాదు లుద్దేశ్యవిధేయములు రెండునగు. క్రియ లుద్దేశ్యములం గా నేరవు.

ఉద్దేశ్యవిధేయములకుఁ గ్రమముగా ఉదాహరణములు—'ఈ హాయంబులు పవనగతిం బఱచు.' భార. అర. ౧ ఆ. ఇందు హాయంబులు విశేష్యము. ఉద్దేశ్యము, పఱచున్ క్రియ విధేయము. 'వాగ్భూషణమే సుభూషణము.' భర్తృ. విద్వత్పద్ధతి. ఇందు వాగ్భూషణము విశేష్యము ఉద్దేశ్యము, సుభూషణము విశేష్యము విధేయము. 'వీరభోజ్యముసుమ్ము రాజ్యము.' భార. అర. ౧ ఆ. ఇందు రాజ్యము విశేష్యము ఉద్దేశ్యము, వీరభోజ్యము విశేషణము విధేయము. 'బాహుకుం డనువాఁ డెవ్వండో' భార. అర. ౧ ఆ. ఇందు బాహుకుండు విశేష్యము ఉద్దేశ్యము, ఎవ్వండో సర్వనామము విధేయము 'అవివేకి చెడున్.' స్వా. ౩ ఆ. ఇందు అవివేకి విశేషణము ఉద్దేశ్యము, చెడున్ క్రియ విధేయము. 'వచ్చినవాఁడు ఫల్గునుఁడు.' భార. ఉద్యో. ౩ ఆ. ఇందు వచ్చినవాఁడు విశేషణము ఉద్దేశ్యము, ఫల్గునుఁడు విశేష్యము విధే

యును. 'అప్రాధకుఁడు కరం బధికుఁడు.' భార. ఆది. ౩ ఆ. ఇందు అప్రాధకుఁడు విశేషణము ఉద్దేశ్యము, అధికుఁడు విశేషణము విధేయము. 'మూఁడవవాఁడు దేవ్వఁడు' భార. అర. ౨ ఆ. ఇందు మూఁడవవాఁడు విశేషణము ఉద్దేశ్యము, ఎవ్వఁడు సర్వనామము విధేయము. 'కొందఱు శిలాపదంబని పలికిరి.' భార. అర. ౨ ఆ. ఇందు కొందఱు సర్వనామము ఉద్దేశ్యము, పలికిరి క్రియ విధేయము. 'ఇది సలురథఘోషము.' భార. అర. ౨ ఆ. ఇందు ఇది సర్వనామము ఉద్దేశ్యము, ఘోషము విశేష్యము విధేయము. 'ఇది మర్త్యులకవిషయము.' భార. అర. ౨ ఆ. ఇందు ఇది సర్వనామము ఉద్దేశ్యము. అవిషయము విశేషణము విధేయము. 'వీరెవ్వరయ్య.' భార. ఆది. ౬ ఆ. ఇందు వీరు సర్వనామము ఉద్దేశ్యము, ఎవ్వరు సర్వనామము విధేయము. 'మృగాతురోగ్రవనంబుల కరుగనేల.' భార. అర ౨ ఆ. 'ఏలా వాలాయము సేయ.' స్వా. ౩ ఆ. ఇందు అరుగన్, చేయన్ ఇవి అన్నంత క్రియలు ఉద్దేశ్యములు. ఏల, ఏలా ఇవి యవ్యయములు విధేయములు. మఱియును 'నీ వితరులఁ గొలువ నేటికి.' భార. ఉద్యో. ౪ ఆ. ఇత్యాదు లూహ్యంబులు.

వ్యా. దేనినిగుఱించి ఏవిషయము నైనను జెప్పుదుమో అది యుద్దేశ్యము, ఆ యుద్దేశ్యమును గూర్చి చెప్పఁబడు విషయము విధేయము. విశేష్య విశేషణ సర్వనామములు మూఁడును ఉద్దేశ్యవిధేయములు కండునగుచును. క్రియలు విధేయములుమాత్రమగుచునుండ నట్లేల చెప్పియుండరాదా? విశేష్యాదిక ముద్దేశ్యము క్రియాదికము విధేయమునని యుభయత్ర అతిశబ్దఘటన మేలయన్నఁ దత్ప్రయోజనముం జెప్పుచున్నాఁడు—విశేష్య విశేషణ సర్వనామములు మూఁడు నేగాక అన్నంతక్రియలును ఉద్దేశ్యములు కానోపు. క్రియలును విశేష్య విశేషణ సర్వనామములు నేగాక ఏలాద్యవ్యయంబులును విధేయంబు లగు—నని.

సూ. ౭. సంపూర్ణ మసంపూర్ణమని వాక్యంబు ద్వివిధంబు.

సమాపక క్రియలుగల వాక్యము సంపూర్ణవాక్యము, అసమాపక క్రియలు గలవాక్యము అసంపూర్ణవాక్యము.

ఉ. 'ఆ. దాని విడిచిపోవంగా నోపక యలచుచు, నంతరిక్షమునను హంసలెల్లఁ, బిండుగట్టి తిరుగుచుండె.' 'క. నలుఁడును ధరణీరాజ్యము, దలఁగఁగ సర్వంబు నపహృతంబైన గడుం,దలరి దమయంతిఁ దోడ్కొని, వెలువడియె నశేష రాజ్య విభవచ్యుతుఁడై.' 'మధ్యాక్కర. నన్ను, నా రాజునకు నెఱిఁగించి కరుణ నాయందుఁ గావింపు, మారంగ ననుడు నిషధ విషయమున కరిగి యూహంస, వీరసేనజునకు దాని గుణరూప విభవముల్ సెప్పె.' భార. అర. ౨ ఆ. మొ. ఇందు విడిచి, ఓపక, అలచుచు నిత్యాది క్రియాభిన్న కర్తృకంబులగు నసమాపక క్రియలుం గల ఉండెన్, వెలువడియెన్, చెప్పె నిత్యాది సమాపకక్రియలతోడి వాక్యము సంపూర్ణవాక్యము. తలఁగఁగన్, ఐనన్, అనుడున్ ఇత్యాది క్రియాభిన్న కర్తృకంబులగు నసమాపక క్రియలతోడి వాక్య మసంపూర్ణ వాక్యము నని యెఱుంగవలయు.

వ్యా. క్రియలు సమాపకక్రియలు అసమాపకక్రియలు నని రెండువిధములు. కార్యము కొంతలేక ముగియునట్లు చెప్పునది సమాపకక్రియ, కార్యము పూర్ణముగ ముగియనట్లు చెప్పునది యసమాపకక్రియ. వాక్యమందు సమాపకక్రియయున్న నది సంపూర్ణవాక్య మగును, అసమాపకక్రియయుండి సమాపకక్రియ లేకున్న నది యసంపూర్ణ వాక్యమగును.

సూ. ౮. వాక్యసముదాయము మహావాక్యమనఁబడు అయ్యది రామాయణాదికము.

వ్యా. వాక్యముల, సముదాయమున కనఁగా సమూహమునకు, మహావాక్యమని పేరు. రామాయణాదిక గ్రంథంబులం బర్యాయంబున మహావాక్యంబులనియేని వాక్యావళులనియేని వ్యవహరింప జనుసనుట.

సూ. ౯. క్రియాన్వయవాక్యంబులు కొన్ని వ్యంగ్యార్థద్యోతకంబులగు

భావక్రియలుగల వాక్యము వ్యతిరేకక్రియలుగల వాక్యమునకును వ్యతిరేకక్రియలుగల వాక్యము భావక్రియలుగల వాక్యమునకును, ఉభయము లుభయములకును వ్యంజకము లగునని యర్థము. అప్పుడు

క్రియలేని వాక్యములు తద్ధర్మకములుగాను లేక యుపన్యస్తములుగాను ధర్మాధర్మములుగాను, వ్యాపారక్రియ లేనియంత వ్యతిరేకార్థకములు గాను వ్యతిరేకార్థములుగాను నుండును.

ఉ. వాఁడు వచ్చునేని (లేక) వాఁడువచ్చిన వీఁడువచ్చును, వాఁడు వచ్చునేని (లేక) వాఁడువచ్చిన వీఁడురాఁడు (వీనికి వ్యతిరేకార్థములు—వాఁడు రాఁడేని వీఁడు రాఁడు, వాఁడు రాఁడేని వీఁడు వచ్చును.) నీ విద్యయేని నే నిత్తును, నీ విత్తువేని నే నియ్యను.) అని పదములచే నితరంబు లూహ్యంబులు.

ఇది యేతద్వ్యర్థసూచనాక్రమము. ఇట్లు దీని నింక ననేకప్రకారంబులఁ జెప్పనువచ్చును.

వ్యా. ఏని—ఇది పక్షాంతరమును దెలుపు దేశ్యావ్యయము వచ్చునేని వచ్చు పక్షమున నని యర్థము. 'భూతంబునం డిగాగమం బగు'నను బాల. క్రి. సూ. ౧౭ చేతను, 'చేదర్థంబునందు వృత్తంబగు భావలక్షణంబునందు నవర్ణకంబు ద్రుతాంతంబగు' నను బాల. క్రి. సూ. ౪౧ చేతను ఇవన్నంతములు సిద్ధించును.

సూ. ౧౦. ఇట్లనియె, అనిన నని భావ్యర్థకథన ప్రారంభ పరిసమాప్తులం గ్రమంబు నగు.

భావ్యర్థకథన ప్రారంభంబునఁ బూర్వ వాక్యాంతమునందు 'ఇట్లనియె' అనియును, ప్రారబ్ధవాక్య పరిసమాప్తియందు 'అనిన' అనియును పదంబులు క్రమంబుగఁ బ్రయుక్తంబు లగునని యర్థము.

ఉ. 'వ. అయ్యింద్రునకుఁ గలి యిట్లనియె. తే. గీ. అవనిలో దమయంతీ స్వయంవరంబు, విస్తరిల్లుట విని కడు వేడ్కతోడ, నేను దమయంతిచే వరియింపఁబడుదు, నని తదర్థమై యరిగెద నాసఁజేసి. వ. అనిన నందఱు నగి.' భార. అర. ౨ ఆ. ౯౦.

వ్యా. 'భావి'ని 'అర్థము'తోఁ గాక 'కథనము'తో నన్వయించుకొనవలయును. 'ప్రారంభపరిసమాప్తులం గ్రమంబుగ' ననుటం జేసి, ప్రారంభమున 'నిట్లనియె' ననునదియుఁ బరిసమాప్తియందు 'అనిన' అనునదియును వచ్చునని తెలియవలెను.

సూ. ౧౧. కొన్నియెడలం దదాదులు విశేషణంబు లధ్యాహార్యంబు లగు.

ఉ. 'క. కలకంఠ కంఠి కన్నీ, రొలికిన సిరి యింట నుండ నొల్లదు సుమతీ.' (ఇంటన్ = ఆయింట) 'క. పురుషుండు రెండుతెఱంగుల, ధర నుత్తముఁ డనఁగఁ బరఁగుఁ దా నెయ్యెడలన్, బరుసములు పలుక కునికిన్, దురితంబులు వొరయం బనులఁ దొఱఁగుటవలనన్.' (రెండు తెఱంగులన్ = ఈ రెండు తెఱంగుల చేత.) భార. ఉద్యో. ౨ ఆ. మొ.

వ్యా. తదాదులనఁగా 'ఆ, ఈ' మున్నగునవి. అధ్యాహార్యంబు లనఁగా వాక్యమున లేకున్నను అర్థవివరణసందర్భమునం దెచ్చుకొనవలసినవి. మొదటి యుదాహరణంబు మఱుటమగు 'సుమతి' తదాకరగ్రంథముం దలఁపించుచున్నను, తద్గ్రంథనామమును సైతము గ్రహింపవలెను. దాని జాఱుపాటు లేఖనముద్రణములం గల్గియుండును.

సూ. ౧౨. కొన్నియెడల సంబంధంబునం బూర్వవాక్యంబునందలి పదం బధ్యాహార్యం బగు.

ఉ. 'గొంతి సంకటపాటుఁ గోడలి ఖన్నంబు.' భార. భీష్మ. ౨ ఆ. 'పంక్తిముఖు నాతని తమ్మునిఁ గుంభకర్ణునిం దనయుని మేఘనాదుని.' 'దానవేశ్వరునకుఁ దమ్ములకును.' నిర్వ. ౨ ఆ. ఆ. మొ.

వ్యా. సంబంధంబునం దనఁగా చుట్టఱికముగలచోట నని యర్థము. 'కోడలి' యనుటకుం బూర్వము 'గొంతియొక్క' అనునదియు, 'తనయుని'కి ముందు 'పంక్తిముఖుని' అనునదో 'అతని' యనునదో, 'తమ్ములకుం' బూర్వము 'దానవేశ్వరుని' యనునదియు నధ్యాహార్యంబులు.

సూ. ౧౩. న్యూనవచో వాక్యంబునఁ దద్వచనంబు లధ్యాహార్యంబు లగు. (న్యూనవచనంబులు ఐన, ఏని, ఎ, ఓ మొ.)

ఉ. 'ఎత్తెఱఁగున ధర్మక్రియఁ, జిత్తంబునఁ జేర్పవలయు జీవించు తఱిన్.' భార. అను. ౪ ఆ. (ఎత్తెఱఁగునన్ = ఎత్తెఱఁగున నైనను, లేక ఎత్తెఱఁగుననేని అని యిక్కడ ఐన ఏని యవ్యయంబు లధ్యా

హార్యములు. ఇట్లు మీఁదను తెలియంగునది) 'అక్కట మందభాగ్యనకు నట్టి తనూభవ రత్న మెవ్విధిఁ దక్కెనె.' భార. ద్రో. ౨ ఆ. 'తరుణీ యోరికిఁ జెల్లునె, యరయఁగనే మింతవారమనుకొన.' కళా. ౧ ఆ. 'వీని నెమ్మియిన్ బట్టి వధింతు,' వి. పు. ౭ ఆ. 'అన్నం బొండొకలేదు.' పాండు. ౪ ఆ 'దైవ మకటా యిటఁ దెచ్చెనె యేమి వచ్చెనే.' చంద్ర.—'కర్మములు మేలు నిచ్చును' భాగ. ౧౦ స్కం. పూ. (కర్మములు=కర్మములేయని యిక్కడ నేవార్థక మధ్యాహార్యము) 'దప్పిఁ జెందును.' (చూ. మీఁదు.) దప్పిఁ జెందునో యని యిక్కడ నో యధ్యాహార్యము. మొ.

వ్యా. ప్రయోగవశమునం దక్కవఁబడిన మాటలను అర్థవివరణ సందర్భమునం బూరించుకొనవచ్చును. అర్థవివరణసందర్భమునం బూరించుకొన నన్నవై స్ఫుటముగ స్ఫురించునట్టి వానిం బ్రయోగవశంబున మానినను వాక్యత్వహాని గల్గదనుట. ఊహాసందేహములను దెలుపు 'ఓ' అధ్యాహార్యమనుటకు 'దప్పిఁజెందును'— ఇటఁ గర్తయుం నధ్యాహార్యము కావున నిది మీఁదిసూత్రంబునకును లక్ష్యముకాఁదగినది. కావునం జెప్పుచున్నాఁడు 'చూ. మీఁదు' అని.

**సూ. ౧౪. కొన్నియెడలం గర్తృకర్మక్రియ లధ్యాహార్యంబు లగు.**

ఉ. కర్తకు—'నన్నుఁ జూచి నగరే.' (జనులు కర్త అధ్యాహార్యము.) భార. అర. ౨ ఆ. 'శ. నరకు గొనరు సురవరులను, గురు శక్తిని భీమ్మ బాహ్లికులఁ గైకొన రుద్ధరత జరాసంధుని వెర, వరిగా మెచ్చరు మహేశ వర గర్వమునన్.' (హంస డింభకులు కర్త అధ్యాహార్యము.) ఉ. హరి. ౪ ఆ. మొ. కర్మమునకు—'దవదహనం బుదగ్రతను దాహముసేయుచు నున్నఁజూచి.' (దాహముచేయుంటను కర్మము అధ్యాహార్యము.) భార. అర. ౨ ఆ. మొ. క్రియకు—ప్ర. అక్కడ నెవఁడున్నాఁడు? ఉ. రాముఁడు. (ఉన్నాఁడు క్రియ అధ్యాహార్యము.) మొ.

వ్యా. కర్తృకర్మ క్రియలుగూడఁ బ్రయోగ మనంబడునని పూర్వోక్తము. కాన తదన్యతమాభావముచే వాక్యత్వహాని ప్రాప్తమగుడు, దేని కెచ్చుట అర్థవివరణసంద

ర్థమున సద్యః స్ఫూర్తిగల్గునో దాని నచ్చట మానినను వాక్యత్వహాని గల్గదనుట ఈ సూత్రభావము.

సూ. ౧౫ అనేక కర్తృక క్రియకు సమీప కర్తయొక్క లింగవచనంబు లగు.

ఉ. 'ఏవాని బంధుమిత్రులు, జీవధనంబులును దప్పిఁజెందును గృహునిం గావాని నెన్నఁగాఁదగు.' భార. శాం. ౧ ఆ. 'క. సురగంధర్వ ప్రభృతులు, ధరణీశైలాపగాబ్ధి ధాత్రీజాదుల్, నరవర నీకే యుపకృతి, నరయఁగఁ గావించె.' రా. అర. కాం. ౨ ఆ. 'శమసేనలు వారను విక్రమించిరి.' ఉ. హరి. ౪ ఆ. 'వ. భూతంబులు దేవాసురులు వినాశగతులు కారె.' రా. అర. కాం. ౨ ఆ. మొ.

వ్యా. క్రియా. సూ. ౨౬ క్రిందఁ జూపఁబడిన 'నేను నాసేనయు దాడిపెట్టెద విశృంఖలతన్' [హరి. ఉ. 3 ఆ] మున్నగు లక్ష్యములు ఈ సూత్రమునకు బాధకములు. కావునఁ బ్రథమపురుషమందే యీసూత్రము వర్తించునని వ్యవస్థ చేసికొనవచ్చును.

సూ. ౧౬ భూతార్థ కాసమాపక క్రియ వలయుచో వాక్యాంతర జనిస్థానం బగు నగుచో, కర్త తత్కర్తలందలిదియ యొద్దియే నొండగు.

వలసినప్పుడు కొన్నియెడల భూతార్థ కాసమాపక క్రియనుండి వాక్యాంతరము పొడమును. అప్పుడు దానికిఁ గర్త యా యసమాపక క్రియా కర్తృసముదాయంబునం దుండునదియే యేదైన నొక్కటి యగునని యర్థము.

ఉ. 'మ. ధవళాక్షుల్ చని కాంచి రంత నెదురన్ దక్షిణ దేశంబునం, దవదాతాంబుజ ఫేనపుంజ నిభున య్యశ్వోత్తమున్ దవ్వులన్. వ. కని కద్రువ వినతం జూచి.' (ఇక్కడ 'కని' 'కనఁగా నందు' నను నర్థము నిచ్చుచున్నది.) భార. ఆది. ౨ ఆ. 'వ. దేవలోకంబున కరుగు

నా కెదుర ద్వారంబులో వచ్చు కలిం గని శత్రుం డిది యేమి యెందులకుం బోయెడువని యడిగిన నయ్యింద్రునకుం గలి యిట్లనియె." (ఇక్కడ 'కని' 'కనిరి అందు' నను నర్థము నిచ్చుచున్నది.) భార. అర. ౨ ఆ. ఇట్టింతటి నూహ్యంబులు. 'వ. శుంభ నిశుంభు లుగ్రకోపను లయి యంసి శుంభుండతి భైరవ సైన్యసమేతుండై రయంబున గవిసెన్.' మార్క. ౬ ఆ. మొ. ఏతల్లక్షణానుక్త విశేష ప్రయోగంబులుం గలవు. ఉ. 'వ. నలుండు...దమయంతీ ద్వితీయుండై యుండి బుభుక్షాపీడ సహింప నోపక హిరణ్యపక్షంబులతోఁ దమముందటఁ దిరుగుచున్న పక్షులం గని యవి భక్ష్యంబగు నని యప్పక్షులం బట్టికొన సమకట్టి కట్టిన పుట్టంబు వానిపై వైచిన నవి పుట్టంబుతోన గగనంబున కెగసి నవ్వుచు విగతవస్త్రుండైన నలున కిట్లనియె.' (ఇందు ఉండి అనునంత వఱకుఁ గల యసమాపక క్రియలకుఁ గర్తలు నల దమయంతులు, ఓపక అనునది మొదలు వైచినన్ అనునంతవఱకుఁ గల యసమాపక క్రియలకుఁ గర్త నలుఁ డధ్యాహార్యము.) భార. అర. ౨ ఆ. 'సీ. ఆహవ సన్నద్ధులై భీమ కర్ణనందన మేఘవర్ణులు ధర్మతనయుం, పాదంబులకు మ్రొక్కి పంకజాక్షునకు దండము పెట్టి యంతఃపురమున కరిగి, కుంతికి నెఱఁగి వీడ్కొనివచ్చి పివ్వచ్చుఁ గ్రుచ్చి కౌఁగిటఁ జేర్చి కుస్తరించి, యనఘసేఁ దురగంబు గొనివచ్చు నంబాలక నంగరక్షకుఁడవై యధిపుఁ గాచి, యుండుమని మాద్రిపుత్రుల నుపచరించి, ద్రౌపదికిఁ జెప్పి మఱియును దానవారి, యడుగులకు వ్రాలి యద్దేవు ననుమతమున, నరిగె నను మోదమున యౌవనాశ్వపురికి.' (ఇందు వచ్చి అనునంతవఱకుఁ గల యసమాపక క్రియలకుఁ గర్తలు భీమ కర్ణనందన మేఘవర్ణులు. క్రుచ్చి యను నది మొదలు అరిగె ననునంతవఱకుఁ గల యసమాపక క్రియలకుఁ గర్త భీముఁ డధ్యాహార్యము.) జై. ౧ ఆ. ఇట్టివి ప్రయోగంబులవలన నెఱుంగునది.

వ్యా. మూఁడవలక్ష్యమున 'డాసి' 'డాసిరి అందు' నను నర్థ మిచ్చునది ఏతల్లక్షణానుక్త విశేష ప్రయోగములుగాఁ జూపఁబడినవానిలో విశేష మేమనఁగా—పరం

పరగనుండు క్రియలలోఁ గొన్ని యనేక కర్తృకములుగనుండఁ గొన్ని పూర్వోక్త క్రియల కర్తలలో నొక్కటి కర్తగాఁ గలిగియుండుటేగాక అన్వయము నభావ్యవార్యమై యుండుట.

సూ. ౧౭. కొన్నిచోటులం దవయవ కర్తృక క్రియ తదవయవి కర్తృకం బగు.

ఉ. 'తల వడఁకుచునుండు తన పితృవరులు.' (తల వడఁకుచునుండు=తలవడఁకుట గలవారగుచు నుండునని యర్థము.) భార. ఆది. ౨ ఆ. 'తేఁకువ చెడియె నీ పాఱుఁడు.' (చెడియెన్=చెడుట గలవాఁడాయెనని యర్థము.) భార. అర. ౪ ఆ. ఇట్లంతట నెఱుంగునది. 'చెలు వేదెఁ జందురుండు.' భార. ఉద్యో. ౨ ఆ. 'ఎ, గీ. సుభట వర్గంబు లొక్కట సొబగుమాలె.' రా. యుం. కాం. 'అక్కట యిం లతాంగి హృదయంబున నీ దెసఁగూర్మి యెంతయుం, నెకొ్ని యున్నది.' మార్క. ౨ ఆ. 'తే. బడలికలు వాసి చనుము.' స్వా. ౨ ఆ. మొ.

వ్యా. వడఁకుచు, చెడియెన్, ఏదెన్, మాలెన్, నెకొ్ని, వాసి—వీనికి వరుసగా తల, తేఁకువ, చెలువు, సొబగు, కూర్మి, బడలికలు అనునవి కర్తలు. ఐనను ఈ ప్రకరణంబులలో 'ఎవ్వరిను నాకాంక్షవాడమి తల, తేఁకువ మున్నగునవి గలవారు ఉపస్థితు లగుదురుగావున నర్థవివరణసందర్భమున తలవడంకుట గలవారగుచుండి త్యాది విపరిణామములు గల్గును.

సూ. ౧౮. వాక్యసంగ్రహాంబునం దినన్నంత క్రియాపూర్వకంబులగు కాక కాన్యవ్యయంబు లనుక్త వాక్యపదగ్రాహకంబు లగు.

ఉ. కాకను—'తే. నీవు నలునకుఁ బేర్మితో దేవివైనఁ, గాక నీ సముజ్జ్వల రూపకాంతి విభవ, నిత్యసౌభాగ్య భాగ్యాభిజాత్య భద్ర, లక్షణావళు లవి సఫలంబులగునె.' (వాక్య వ్యాసమునందు—నీవు నలునకుఁ బేర్మితో దేవివైన నీ సముజ్జ్వల రూపకాంతి విభవ నిత్యసౌభాగ్య

భాగ్యాభిజాత్య భద్రలక్షణావళు లవి సఫలంబులగును, కాకున్న నీ సముజ్జ్వలరూపకాంతి విభవ నిత్యసౌభాగ్య భాగ్యాభిజాత్య భద్రలక్షణావళు లవి సఫలంబులుకావు.) కానికి—'ఆ. నలుగ కాని నళినదళనేత్ర వరియింప దట్టె.' (వాక్యవ్యాసమునందు నలునే వరియించును గాని వేఱొకని నళినదళనేత్ర వరియింపదట్టె.) భార. ఆర. ౨ ఆ. మొ.

వ్యా. భూతంబునవచ్చు నిక్క తుమర్థభావ లక్షణంబులంగాదు సద్రుత సపర్గమ్ముంజేర క్రియలకు నినన్నంతక గల్గును, వానికిం బరముగ కాక కాన్యవ్యయంబులున్న నవి యుక్తవాక్యములకు పదములకును గ్రాహకములగు. చూపంబడిన లక్ష్యములలో ఇనన్నంత క్రియాపూర్వకత 'కాక'కు మాత్రమే గలదు. 'కాని'కి అవధారణార్థకాంత నామవాచకపూర్వకతం జూపినాఁడు. ఇనన్నంతక్రియకుఁ బరమందున్న 'కాక' నట్టి 'కాని'కిని అవధారణార్థకాంత నామంబునకుఁ బరమందున్న 'కాని' నట్టి 'కాకు'కును ఉపలక్షణముగఁ గొనవలయును.

సూ. ౧౫. కొన్నియెడలంగాని క్రియాపూర్వకంబు పూర్వ విరుద్ధార్థకం బగు.

వాక్యంబులందు పూర్వార్థమునఁ గ్రియమీఁద వచ్చిన 'కాని' యవ్యయ ముత్తరార్థవాక్యముయొక్క యర్థము పూర్వార్థవాక్యముయొక్క యర్థమునకు విరుద్ధముగా నుండుననుటను దెలుపుచున్నది యని యర్థము.

ఉ. వాఁడు వచ్చునుగాని కార్యవ్యాసంగముచే రాఁడాయెను.
వాఁడు రాఁడుగాని నీ నిర్బంధముచేత వచ్చినాఁడు. మొ.

వ్యా. ఈ లక్ష్యములంబట్టి పూర్వాపరార్థములందలి క్రియ లేకకర్తృకములై యున్నప్పుడే ఈ సూత్రము వర్తించునని భ్రమయరాదు. 'వాఁడు వచ్చుఁగాని వీఁడు రాఁడు'—ఇత్యాదిగను ఉండవచ్చును.

సూ. ౧౬. కొన్నియెడల వ్యాస వాక్యమునకు ముందు సంగ్రహవాక్యంబు నొండగు

ఉ. 'వ. అయ్యా యేను నీకుం బ్రియంబుసేసెద, నీ హృదయేశ్వరి యైన దమయంతిపాలికిం బోయి నీ గుణంబులు దానికి వర్ణించి చెప్పి యక్కన్య యన్యుల నపేక్షింపక నీయందు బద్ధానురాగ యగునట్లు చేసెద.' 'వ. ఇది యెట్లు ధర్మపరిపాలన పరులై వీరులై రణనిహతు లయిన రాజు లక్షయ లోకసుఖంబు లనుభవింప నతిథులై యిందుల కెంతకాలం బయ్యె రానికారణం బేమి.' 'వ. శక్రుం డిదియేమి యెందు లకుం బోయెదవని యడిగిన.' భార. అర. ౨ ఆ. మొ.

వ్యా. 'అయ్యా యేను నీకుం బ్రియంబుసేసెద' 'ఇది యెట్లు' 'ఇది యేమి' అను నివి సంగ్రహవాక్యములు మీఁదివివ్యాస (=విస్తృత) వాక్యములు.

సూ. ౨౧. కొన్నియెడల వాక్యంబు వాక్యాంతరగర్భంబు నగు.

ఉ. 'వ. ఇందుల కెంతకాలంబయ్యె రాని కారణంబేమి?' మొ.

(చూ. క్రిందు)

వ్యా. ఒక వాక్యమధ్యమున వేఱొక వాక్య ముండుటయుం గలదు. 'ఇందులకు రానికారణం బేమి' అను వాక్యమధ్యమున 'ఎంతకాలం బయ్యె' నను వాక్యాంతరముం గనుఁడు. ఈలక్ష్యము పూర్వసూత్రోదాహరణ భాగముంగూడ, కావునఁ జెప్పుచున్నాఁడు 'చూ. క్రిందు' అని.

సూ. ౨౨. పొమ్ము నిశ్చయార్థంబునం దగు.

ఉ. 'అల్లునిఁ గల్యాణ గుణోత్తరుం బడయఁ గెట్లుంబోవఁ బొమ్మంచు' నిర్వ. 3 ఆ. మొ.

వ్యా. పోవునకు ముజ్జు పరంబుగా వు లోపంబును దీర్ఘంబునకు హ్రస్వంబును మువర్ణకంబునకు మాముడియును గలుగ 'పొమ్ము' అనురూప మేర్పడును. 'పో' అను ఏకాక్షరము దీనికి రూపాంతరము. వీనికి నిశ్చయార్థముం జెప్పుచున్నాఁడు. ఇవి యనాదరముం దెలుపుటయుఁ గలదు—ఉ. 'సీ. పట్టెఁబో దొంగఁ జేల్గట్టినట్టివి దాఁచి కొంచుఁ బోవక మెఱయించుటెట్లు.' కళా. ౨ ఆ. [శ. ర.]

సూ. ౧౯. పద్యంబులకుఁ గులకంబగు.

కులకం బనఁ బద్యమునకుఁ బద్యాంతరముతో నన్వయము.

ఉ. 'తానిక పందు చెచ్చెరఁ గాని ప్రచ్చుడు.' భార. ఆది.

౨ ఆ. ౯౦.

వ్యా. ఒక్క వాక్య మొక్క పద్యముతో ముగియక మీఁదిమీఁది పద్యముల లోనికి అల్లుకొనియున్న నట్టి పద్యసమూహమునకుఁ గులకమని పేరు. లక్ష్యమున 'ప్రచ్చుడుఁ' అనునది యానంతర్యార్థ కాంతాసమాపక క్రియ. ఈపద్యంపు ముగియుకతో వాక్యమునకు ముగియుక గల్గలేదు.

ఇది బాలబోధసుధాపరనామధేయ కుమారదేవపండితీయం బను
ప్రౌఢవ్యాకరణ వివరణంబునందు
వాక్యపరిచ్ఛేదము.

---

# ము క్త ల క్ష ణ వి వే చ న ము.

---

వ్యా. ముక్త=(అటనట) విడువఁబడిన, లక్షణ = శాస్త్రాంశముల, వివేచనము= తెలివిడి.

## సంజ్ఞ.

సూ. ౧. దీర్ఘపూర్వకంబగు లఘురేఫము హ్రస్వపూర్వకమగుచో నలఘురేఫం బగు.

ఉ. 'క. వెఱపక కలలోఁ జేసిర, కొఱగామికి వగచుచోట గుణరత్నము చే,కుఱె నీకు నలిగి తన్నినఁ, బఱపుపయిం బడినయట్టు పద్మదళాక్షీ.' ఉ. హరి. ౫ ఆ. మొ.

వ్యా. 'చేకూరు' అనునది తొలుదిరూపము. హస్తగత మగునని యర్థము. ఇందలి రేఫము లఘువు. దానికిముందున్నది దీర్ఘము. ఆ దీర్ఘము హ్రస్వమైన మీఁది లఘురేఫమునకు అలఘురేఫ మాదేశమగును—'చేకుఱు'. లక్ష్యమున హ్రస్వపూర్వకరేఫము అలఘువనుటకుం బ్రమాణమేమనఁగా ప్రాసమేయని మీఁది సూత్రవృత్తియందు మూలకారుఁడే చెప్పనున్నాఁడు.

సూ. ౨ అలఘురేఫము లుప్తాచ్కమగుచో లఘురేఫం బగు,

ఉ. 'ఎ, గీ. నీవు నాపద,కోర్చి భంగపాటు తీర్చికొనుము' భార. విరా. ౧ ఆ. మొ. 'లఘుర్ భవేద్ గురుః క్వచిద్ గురుశ్చ లఘుస్తథా, ఉచ్చారణస్య కల్ప్యత్వాన్నిదానం తత్ర సర్వచః' । అని యథర్వణాచార్యులు. మఱియు 'నాన్యేషాం వైధర్మ్యం లఘ్వ లఘూనాం రయోస్తునిత్యం స్యాత్.' 'అనయోస్సంగతిం యస్తు కరోతి కవితాకృతౌ, అస్యా అత్యంత దోషత్వాద్దుష్కవి స్సమీకథ్యతే.' అని ప్రథమాచార్యులును ద్వితీయాచార్యులును నియమించియుండుటంజేసి యివి పూర్వరేఫంబులే యనుటకు వల్లకాదు. (చేకూరు—లఘురేఫము, తీఱు—అలఘురేఫము.)

వ్యా. ఉత్ప్రాప్తము=లోపించిన యచ్చుగలది. 'తీఱు' ధాతువునకు 'చుగాగమం బాచ్ఛికంబున కసంయుక్త నలడ రాంతంబునకుం బ్రేరణంబున బహుళంబుగా నగు' నను బాల. క్రి. సూ. ౭౧ చేత చుక్కును, 'క్రియాఫలంబు కర్తృగామి యగుచోఁ గొను ధాతు వనుప్రయుక్తంబగు' నను బాల. క్రి. సూ. ౧౭౨ చే కొనును, రాఁగా 'తీఱుచుకొను' అను రూప మేర్పడును. రేఫగతాచ్చు లోపించిన తీఱ్ + చు కొను అనియుం, అలఘురేఫమునకు లఘురేఫమురాఁగా తీర్చుకొను అనియుం సిద్ధించును. 'కొను ధాతువు పరంబగునపుడు చిగాగమంబు బహుళంబుగా నగు' నను బాల. క్రి. సూ. ౧౭౩ చే 'తీర్చికొను' అని యగును. లఘ్వలఘురేఫము లొండొకదాని కగుచుండు నంటకు బ్రమాణము 'లఘుర్భవే' దిత్యాది కారిక. రఱ ప్రాసనిషేధమునకు ప్రమాణము. 'నాస్త్యేషాం' 'అనయో' రిత్యాది.

### సంధి.

సూ. ద్విత్వరహితంబగు ద్వితీయావిభక్తి యుకారమున కచ్చు పరంబగుచో సంధి రాదు.

ఉ. నను నెఱిఁగె, నిను నెఱిఁగె. మొ.

వ్యా. 'ఇఁకాదులఁ దప్ప ద్రుతప్రకృతికములకు సంధిలేకున్నను [బా. సంధి. సూ. ౯] ప్రథమేతరవిభాగ [బా. సంధి. సూ. ౨] సామర్థ్యమున నన్నుఁ + అడిగె, నిన్నుఁ + అర్చించె నిత్యాదులకు వైకల్పికసంధి ప్రాప్తించునని బాలవ్యాకరణము. ద్వితీయావిభక్త్యుత్తునకు ద్విత్వములేనిచోఁ దానికే ఆసంధి ప్రాప్తిగాని అంతటను గల్గదని ఇచ్చట సవరణ. కావున రామున్ + అడిగె = రామడిగె, ననున్ + ఎఱిఁగె ననెఱిఁగె నిత్యాద్యనిష్టరూపములు తొలంపఁబడినవి.

### సమాసము.

సూ. ౧. తెలుఁగు సర్వనామంబుతోడం గర్మధారయంబు చూపట్టదు.

వ్యా. సర్వనామంబుతోడ ననఁగా త్రికేతరమైన దానితో ననుట.

సూ. ౨. ద్విగువు మహదర్థఘటితంబు బహుస్పష్టంబు.

వ్యా. సంఖ్యావాచకంబగు విశేషణంబునకు విశేష్యంబుతోడ సమాసంబు ద్విగువు నాఁబడు. ఉ. ముజ్జగములు, ముల్లోకములు. మహదర్థక మనఁగా పురుషబోధకములగు డుజాది ప్రత్యయములు. వీనితోఁగూడిన ద్విగుసమాసము కానఁబడదనుచున్నాఁడు.

ఇది బాలబోధసుధాపరనామధేయ కుమారదేవపండితీయంబను
ప్రౌఢవ్యాకరణ వివరణంబునందు
ముక్తలక్షణవివేచనము.

కుమారదేవపండితీయము సంపూర్ణము.

కల్యాణాద్భుత గాత్రాయ కామితార్థ ప్రదాయినే,
శ్రీ వేఙ్కటనివాసాయ శ్రీనివాసాయ మఙ్గళమ్.



Printed at Chandrika Press, Madras.—2-4-47
Publisher's Quota P. L. C. O. H. No. M. S. 114 B 500

వేదము వేంకటరాయశాస్త్రులవారి ప్రచురణ,

4, మల్లికేశ్వరగుడిసందు, లింగిసెట్టివీధి, జి. టి. మదరాసు.

---

# సంస్కృతగ్రంథములు. (ఆంధ్రలిపి)

ప్రతి 1-8 రూ. అ.

మేఘసందేశము, మల్లినాథవ్యాఖ్య - తెనుఁగు ప్రతిపద టీకా తాత్పర్య పదప్రయోజనచర్చ - ఆక్షేపసమాధానములు. సంస్కృత మారంభించువారు ఈ తెనుఁగు సంపూర్ణటీక చేత దీనిని చదివి సులువుగా రసము గ్రహించి సాహిత్యము పొందవచ్చును. 2 8

రఘువంశము, మల్లినాథవ్యాఖ్య తెనుఁగు ప్రతిపదటీకాతాత్పర్యములు. ఎల్లవారును స్వయముగా పఠించి సంస్కృతమందు సాహిత్య మలవరుచుకొనుటకు ఉత్తమసాధనము. 3 0

కుమారసంభవము, పైదానివలెనే టీక 3 0

అమరుకావ్యము, శృంగారలక్ష్యము, వేమభూపాల సంస్కృత వ్యాఖ్య సంపూర్ణాంధ్రటీకయు అచ్చగుచున్నది. 1 8

పుష్పబాణవిలాసము, సంస్కృతవ్యాఖ్య, తెనుఁగుపూర్ణటీక 0 12

భర్తృహరి శతకత్రయము, త్వరలో వెలువడును.

హితోపదేశము, మూలము మాత్రము 1-0-0 పాతప్రతి 0 8

పంచతంత్రము ,, 1-8-0 పాతప్రతి 0 12

దశకుమారచరిత్రము ,, 1 0.0 పాతప్రతి 0 8

విక్రమార్కచరిత్రము, వరరుచికృతము, తెనుఁగు టిప్పణము, సులువైనశైలి, సంస్కృతమారంభించువారు చదువవచ్చును(అచ్చు) ,,

భోజచరిత్రము, సులువైనశైలి, పైదానివలెనే టీక ,,

బిల్హణచరిత్రము, తెనుఁగు పూర్ణటీక, ఈనరసప్రబంధము విభక్తి జ్ఞానమున్నవారికెల్ల సరసమగును.

రసమంజరి, భానుసూరికృతి, తెనుఁగు పూర్ణటీక, శృంగారరస 1